# చతుర

సంపుటి : 3 ఆగస్టు 1980 సంచిక : 7

## ఈ నెల సమగ్ర నవల

"అత్యంత సుందరమైన ఈ ఏకాంతం, మనసులు దోచుకునే ఈ మనోహర దృశ్యాలు, మంచి తోడు...ఇంకేం కావాలి నీకు ఇంతకంటే?"

"అవన్నీ సరే నాకు ఒకటి మాత్రం ఎంత ప్రయత్నించినా దొరకడం లేదు. అదే నా బాధ."

"ఏమిటది?"

"మృత్యువు"

ఆమె ప్రత్యుత్తరం విని స్థాణువైపోయాడతను.

తన ప్రాణ స్నేహితుడి ముద్దుల భార్య ఆమె. ఒకప్పుడు తను పెళ్ళాడదామని కలలు గన్న తన క్లాస్‌మేట్ ఆమె.

ఆవిడ ఇలా అంటుంటే ఆమె భర్తేమో-

"నిన్ను చూస్తే ఆమె చైతన్యంతో వికసిస్తోంది. నేనేం అడ్డు చెప్పను గానీ ఆమెను సుఖపెట్టు" అని అంతకాలం తనలో దాచుకున్న ఓ రహస్యం చెప్పేశాడు.

ఆ రహస్యం ఏమిటి?

చివరికి అతను వారి జీవితాల్లో ముసిరిన

## కారు మేఘం

ప్రభావాన్ని విచ్ఛిన్నం చేయగలిగాడా?

ప్రేమైక జీవుల అంతఃసంఘర్షణని అద్భుతంగా మలచిన ప్రఖ్యాత హిందీ రచయిత **గుల్షన్ నందా** నవల 'కాలీఘటా'కు

**కిన్నెర రూబెన్**

అనువాదం 'కారుమేఘం' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం :
జగ్ మోహన్
2వ కవరు : సూరజ్ ఎన్. శర్మ
3వ కవరు : మోహన్ కుమార్ శర్మ

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 - 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60 - 70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.


చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500004.

## మూడో ప్రాణి

కోర్టులో విడాకుల కేసు నడుస్తోంది అటు భర్త తరపు లాయరు, ఇటు భార్య తరపు లాయరు కుస్తీ పడుతున్నారు. కానీ కేసు తెగటంలేదు.

"చివరసారిగా అడుగుతున్నాను. దేవుడి మీద ప్రమాణం చేసి చెప్పండి అసలు మీ ఇద్దరికీ తగువెందుకు కొచ్చింది?"

జడ్జి ఆ దంపతుల్లో మొదట భార్యను పిలిచి అడిగాడు.

భార్య ఏడుస్తూ వెక్కిళ్ళుపడుతూ చెప్పింది-



"మా పెళ్ళై పదేళ్ళయింది. ఈ పదేళ్ళ కాలం మేమెంతో అన్యోన్యంగా వున్నాం. ఒక్క చిన్న తగువు కూడా ఎరగం. విడదీయలేని జంటగా బ్రతికాం. గత సంవత్సరం మా ఇద్దరి మధ్యను మూడో ప్రాణి వచ్చింది. అంతే! ఆ రోజు నుంచి మా జంట విడిపోయింది"

అంతా విని జడ్జి అన్నాడు-

"దాంపత్య జీవితంలో అది సహజం. చిన్నారి పిల్లల ప్రవేశమే అంత. ఇంతకీ ఆ మూడో ప్రాణి ఎలా ఉందమ్మా! కులాసాయేగదా!" భార్య వెంటనే చెప్పింది-

"అదా! దానికేమండీ గజ్జెల గుర్రంలా ఉంది. ఆ ముండ మా పక్కింట్లో అద్దెకు ఎప్పుడు దిగిందో గానీ, ఆ రోజు నుంచీ నా మొహంకేసి అసలు చూట్టమే మానేశాడు మా ఆయన."

-గౌస్

## లూజు జాకెట్లు

మరో రెండు రోజులలో కలక్టరుగారు తమ గ్రామానికి వస్తున్నారు. అది తమ భాగ్యమనుకున్నారు ఆ గ్రామ మునసబు, కరణము.

కలక్టరుగారు రెండు పూటలా ఏమి తింటారో ముందుగానే తెలియజేయబడింది. చెప్పినట్లుగానే ఏర్పాట్లన్నీ జరుగుతున్నాయి. కాని ఆ లిస్టులో అందరికీ అర్థం కానిది ఒక్కటే.

రాత్రి భోజనం తర్వాత కలక్టర్ గారికి 'లూజు జాకెట్లు' కావాలట. మరి లూజు జాకెట్లు అంటే?

"కిళ్ళీలలో ఇదో రకం అయ్యుంటుంది" ఎవరో అన్నారు. వెంటనే పట్నం పోయి కనుక్కున్నారు. ఊహుఁ- ఆ పేరున్న కిళ్ళీ ఏమీ లేదు.

మునసబు "లూజు జాకెట్లంటే చాలా లూజుగా ఉండే చొక్కాలు అయ్యుంటాయి. భోజనమయ్యాక కలక్టర్‌గారు అవి తొడుక్కొని పడుకుంటారేమో" అన్నాడు.

కరణం "అంతేనా... లేక కలెక్టరు గారు కళా పోషకులా" అన్నాడు.

"అదేంటి ?" మనసబు అడిగాడు.

"అదే... లూజు జాకెట్లంటే... అందమైన జాకెట్లు తొడుక్కున్న అమ్మాయిలేమో ?!" అన్నాడు.

"నిజమేనోయ్...ఎందుకేనా మంచిది ఆ ఏర్పాట్లూ చేయించి ఉంచండి" అన్నాడు మునసబు.

కలక్టరుగారు రానూ వచ్చారు. రాత్రి భోజన కార్యక్రమం కూడా పూర్తయింది.

కలక్టరు వంటవాడు మునసబుని



పక్కకు పిల్చి "లూజు జాకెట్లు సిద్ధమేనా" అని అడిగాడు.

"ఓ... సిద్ధమే..." అంటూ సంచిలోనుండి నాలుగు లూజు చొక్కాలు తీశాడు మునసబు.

దానికి వంటవాడు పక పకా నవ్వుతుంటే— కలక్టర్‌గారు సంగతి తెల్సుకుని ఆయనా ఘొల్లున నవ్వసాగాడు.

"మరి లూజు జాకెట్లంటే ఏంటో సెలవియ్యండి... నిమిషంలో ఏర్పాటు చేస్తాను" అన్నాడు మునసబు... మనసులో అమ్మాయి మెదులుతుంటే.

"లూజు జాకెట్లంటే కమలాపళ్ళు... కమలాలనే ఇంగ్లీషులో లూజు జాకెట్లని అంటారు" అంటూ వంటవాడు చెప్తూ నవ్వసాగాడు.

—పినిశెట్టి శ్రీనివాస్

# భార్యాలున్నారు జాగ్రత్త

సొర్జెంట్ సన్యాసిరాజు చాలా ఉషారుగా వున్నాడారోజు. ఆరు నెలలుగా ఎదురు చూస్తున్న అవకాశం రానేవచ్చింది. సెలవు కోసం పెట్టుకున్న అప్లికేషన్ ఆఫీసర్ ఆమోదముద్రతో శాంక్షన్ అవబోతున్నట్టు తెలిసింది. అదీ ఆ ఆనందానికి కారణం.

పెళ్ళాంతో హనీమూన్ కెళ్దామని పది నెల్లుగా కలలు కంటున్నాడు రాజు. కానీ సెలవు దొరికిచావలేదు. ఆర్నెల్ల క్రితం పెట్టుకున్న అప్లికేషన్ యీ రోజుకి శాంక్షనైంది. ప్రస్తుతం అతని భార్య కాంతం పుట్టింట్లో వుంది. తను వెంటనే అత్తవారింటికి పోయి ఎటోఅటు హనీమూన్‌కి చెక్కేద్దామని ఈస్ట్‌మన్‌కలర్ కలలు కనేస్తున్నాడు రాజు.

ఇంతలో ఆఫీసర్ గదిలోంచి పిలుపొచ్చింది. బహుశా సెలవు మంజూరైందని చెప్పటానికై వుంటుందనుకున్నాడు. విప్పారిన మొహంతో ఒక్క పరుగున ఆఫీసర్ ముందుకొచ్చి మంచి సెల్యూట్ కొట్టాడు.

"నీకు సెలవు మంజూరుచేస్తున్నాను"





అన్నాడాఫీసర్ సీరియస్‌గా.

తక్కున మరో సెల్యూట్ కొట్టాడు.

"కానీ.."ఒక్క క్షణం ఆగి అన్నాడు మళ్ళీ-

"నువ్వు యీ వూరొదిలి బయట కెళ్ళడానికి వీల్లేదు."

'బతుద్దాయ్' మనసులో గొణుక్కుని, పళ్ళు నూరుకుంటూ పైకొచ్చాడు. ఉత్సాహంఅంతా చప్పున చల్లారిపోయింది. ఆరునెల్లనుంచి పడిగాపులుపడి కూర్చుంటే ఇప్పటికైంది. అందులో బోడిషరతొకటి. కాలికి తాడుకట్టి వదిలిన కోడిపుంజులా



గింజుకున్నాడు రాజు; ఎదురు చెప్తే అది కూడా ఇవ్వను పో పొమ్మంటాడేమోనని భయం. ఆలోచిస్తుంటే చప్పున ఓ బ్రెయిన్ వేవ్ వచ్చినట్టయింది.

ఆ నాలుగు రోజులూ ఉన్న వూళ్ళోనే సర్దాగా ఏదైనా హోటల్లో గడుపుదామనుకొన్నాడు. 'వెంటనే రమ్మని' భార్యకో టెలిగ్రాం కొట్టి, నాల్రోజుల కాపరమే కాబట్టి వెంట ఎక్కువ సామాన్లేవీ తేవొద్దని చెప్పేడు.

ఆ ప్రకారం చిన్న బ్రీఫ్‌కేస్‌లో బట్టలు అవీ సర్దుకొని బయలుదేరి వచ్చింది కాంతం. స్టేషన్ కెళ్ళి ఆమెని రిసీవ్ చేసుకొని దగ్గరలో ఉన్న ఓ హోటల్‌కి తీసుకెళ్ళేడు రాజు.

ఆ హోటల్ మేనేజర్ చాలా మంచి వాడేగాని సార్జంటైనా, క్రయిం బ్రాంచ్ డైరక్టరైనా కూడా మరో ఆడమనిషితో గది కావాలని వస్తే, వాళ్ళిద్దరూ భార్యా భర్తలని ఋజువు లభిస్తేకాని గది ఇవ్వడా పుణ్య పురుషుడు.

సన్యాసిరాజు గది కావాలని అడగ్గానే "వీల్లేదు" అన్నాడు మేనేజర్.

తెల్లబోయి ఆఫీసులో ఆఫీసర్ రాహువులా పట్టుకుంటే వీడిప్పుడు కేతువులా తయారయ్యేడే అనుకున్నాడు మనసులో.

"మీరిద్దరూ భార్యాభర్తలనిపించటం లేదు" అన్నాడు మేనేజర్ మర్యాదగానే.

రాజింకా ఏదో చెప్పబోయేంతలో కాంతం రౌద్రాకారంతో, చేతిలో బ్రీఫ్‌కేస్ త్రిశూలంలా ఎత్తి సన్యాసిరాజు వంక తిరిగి – "చూశారా ! మీ తెలివితేటలు ఇలాగే తెల్లారుతుంటాయి. నాలుగు రోజులు బయట వూరికెళ్ళే సెలవు సంపాదించకపోగా ఎందుకీ సంబడం. ఇలాంటివన్నీ ఆలోచించకుండా ఎంత పనికిమాలినవాడైనా ఇలా చేస్తాడా? అలా గుడ్లు వెళ్ళబెట్టి వాజమ్మలా చూడక పదండి స్టేషన్‌కి..." ఇంకా ఏదో అనబోతున్న ఆమె వాగ్ధాటికి అడ్డుపడి ఆమెకు సాష్టాంగ దండప్రమాణాలు చేశాడు మేనేజర్.

తర్వాత సన్యాసిరాజు వంక తిరిగి "సారీ సర్... చాలు... ఈ మాత్రం ఋజువు చాలు... ఇవిగో గది తాళాలు"

అంటూ గది తాళాలు అందించాడు. బాయ్‌ని కేకేసి సామాన్లు గది లోపల పెట్టమన్నాడు.

ఈసారి కళ్ళు, ముక్కు, చెవులు సాధ్యమైనంత పెద్దగా తెరిచి అలాగే వుండిపోయాడు సార్జెంట్ సన్యాసిరాజు.

—వి. చంద్రశేఖర్

# స్నేహధర్మం

రంగారావుకు బాగ అలవాటు బాగాఉంది.

ఓసారి బార్లోకి అడుగు పెట్టిన నేను రంగారావును చూసి చాలా ఆశ్చర్య పోయాను.

"అదేంటి గురూ! నువ్వొక్కడివి కూర్చున్నావు ... నీ ఎదురుగ్గా రెండు గ్లాసులు? ఏమిటి కథ?'' అనడిగాను.

రంగారావు విషాదంగా నవ్వాడు.

"నేను, నా ప్రియ మిత్రుడు, గాఢ స్నేహితుడు కైలాసంగాడు లేకుండా జీవితంలో తాగగా ఎపుడయినా ఎవరయినా చూశారా?"

"లేదు గురూ!" తలూపాను నేను.

"వాడు సెలవుమీద వెళ్ళాడు. మరి వాడు లేకున్నా వాడి గ్లాసుండడం ధర్మం గదా!" అని రెండు గ్లాసులూ ఎత్తి బిగిం చేశాడు.

ఓ రెండు నెలల తరువాత రంగారావును మళ్ళా అదే బారులో చూశాను. చిత్ర మేమిటంటే రంగారావు ముందిపుడు ఒకటే గ్లాసుంది. నేను బోల్డంత ఆశ్చర్య పోయి అడిగాను—

"అదేంటి గురూ!"

"నాకీ మధ్య ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది బాయ్! తాగడం పూర్తిగా మానేశాను!" విషాదంగా మూలిగాడు రంగారావు.

"మరి...?" సందేహిస్తూనే అడిగాను.

"అవునోయ్ ... చెడిపోయింది నా ఆరోగ్యంగానీ నా ప్రియమిత్రుడు కైలాసంగాడి ఆరోగ్యం కాదుగదా! మరినేను మానేస్తే వాడెందుకు మానేయాలి! అందుకని వాడిది మాత్రం పుచ్చుకుంటు



న్నాను!"

గటగటమని గ్లాసు ఖాళీ చేశాడు రంగారావు.

—రుక్మిణి

# నిజాయితీ

కట్టెలు కొట్టుకొని బతికేవాడు, వాడి నిజాయితీ కథ మీకు తెలిసే ఉంటుంది. అతగాడు ఓసారి అడవిలో కట్టెలు కొట్టు కొంటూంటే, అతని గొడ్డలి చేయిజారి పక్కనున్న బావిలో పడిపోతుంది. ఈత రాని అతను దేవుడికి మొర పెట్టు

కొంటాడు. వెంటనే దేవుడు ప్రత్యక్షమై' ఆ బావిలోకి దిగి బంగారు, వెండి, కంచు, గొడ్డళ్లను ఒకటి వెనుకగా ఒకటి పైకితీసి ఇవ్వబోతే—అతను అవేవీ తనవి కావనీ, చివరిసారిగా పైకితీసిన ఇనుపగొడ్డలి మాత్రమే తనదనీ అంటాడు. అతడి నిజాయితీకి సంతసించిన దేవదేవుడు గొడ్డళ్లు అన్నింటినీ అతనికే బహూకరించి అదృశ్యమైపోతాడు. ఇతగాడు హాయిగా ఇంటికి తిరిగివసాడు. ఇదీ కథ.

ఇక చెప్పబోయేది ఆ తర్వాత కథ...



అలా ఆ జీవి తన భార్యతోటి సుఖంగా జీవిస్తున్న రోజులవి. సుఖాలన్నీ ఉన్నాయి కానీ వాళ్ళకి ఒక్కటే కొరత. అదే పిల్లలు లేకపోవడం. నానా నోములు, మొక్కుబడులు చేసుకున్నారు. పక్క గ్రామంలో ఏదో అమ్మవారి జాతర జరుగుతోందని తెలుసుకొని అక్కడికి ప్రయాణం కట్టారు. ఆ గ్రామం చేరుకోవాలంటే మళ్లీ అదే అడవి మార్గంగుండా ప్రయాణం.

దట్టమైన అడవి. ముళ్లు, కంపలు, పొదలు, పెద్ద పెద్ద చెట్లతో అంతా గుబురు గుబురుగావుంది. ఆ అడవితో చిరపరిచయం అతనికి వుంది కనుక-భార్యను తన వెనుకే జాగ్రత్తగా నడచి రమ్మని హెచ్చరిస్తూ అతను ముందు నడవసాగాడు. అయినా ఎలాగో ఆదమరచిన అతని భార్య దారి తప్పి పాడుపడ్డ ఓ లోతైన నేలబావిలోకి పడిపోయింది. అమ్మో!' అని కేకవేసింది. అప్పటికి కూడా ఈత నేర్చుకోని అతను మళ్ళీ దేవుడితో మొరపెట్టుకొన్నాడు.

అతని నిజాయితీ, సత్ప్రవర్తన తెలిసిన ఆ దేవదేవుడు ఈసారి కూడా ప్రత్యక్షమై అతని మొర ఆలకించి, బావిలోకి దిగాడు. కొంత సేపటికల్లా ఓ స్త్రీని పైకితెచ్చి - "ఈమేనా నీభార్య ?" అని అడిగాడు. క. కొ.కి కళ్లు చెదిరి పోయాయి. తక్షణం అతను "అవును ఈవిడే నా భార్య!" అన్నాడు.

దేవుడికి చాలా ఆశ్చర్యం వేసింది. కుతూహలంకొద్దీ, ''నిజాయితీ పరుడివనుకున్నాను. నీ నైజం బయటపడింది. రంభను చూసి, నా భార్య అని అబద్ధాలాడతావా ?" అని అడిగాడు.

దానికి అతడు-"దేవా! నేను నిజాన్ని 'లికివుంటే తమరు ఈ రంభని, తర్వాత ఊర్వశిని, మేనకని, ఆ చివరగా నా భార్యని తీసుకొచ్చి చూపించేవారు. ఆ తరువాత నా నిజాయితీని మెచ్చుకొని ఈ నలుగురినీ నాకు కట్టబెడితే, ఈ బీదవాడి గతి ఏం కాను?" అన్నాడు.

అతడి వాక్చతురతకు, సిసలైన నిజాయితీకి మెచ్చుకొని, దేవదేవుడు అతని భార్యను పైకి రప్పించి, సంతాన యోగత్యను ప్రసాదించి అదృశ్యమై పోయాడు.

— శ్రీయుగంధర్

ముంగిట్లో ఉన్న ద్వారం దగ్గర గుఱ్రపు డెక్కల చప్పుడు వినిపించ గానే మాధురి కిటికీ తెరచి క్రిందకు చూసింది. ఆమె భర్త ఈరోజు త్వరగానే తిరిగి వచ్చాడు.

ఆమె చక చక గదిలోకి వెళ్ళి చెల్లా చెదురుగావున్న వస్తువులనుయధాస్థానంలో సర్ది భర్తను ఆహ్వానించడానికి సిద్ధమైంది.

సూర్యుడు అస్తమించాడు. చీకటి మెల్లి మెల్లగా తన నల్లని ముసుగును ప్రకృతిపై కప్పుతోంది. మాధురి పని మనిషి గంగతో లైటు వెలిగించమని చెప్పి తాను కిందకు దిగి ఇంటి ముందుకు వచ్చింది.

వాసుదేవ్ తన భుజానికి వేలాడు తున్న తుపాకీని తీసి ప్రక్కనే నిలబడ్డ నౌకరుకు అందించాడు. ఎదురుగా వచ్చి నిలబడిన మాధురిని చూసి ఒక చిరు నవ్వు నవ్వాడు. ఇద్దరూ చేయి చేయి కలిపి పక్క పక్కనే నడుస్తూ మేడ పైకి వచ్చారు.

బయట ఇంకా పూర్తిగా చీకటిపడలేదు. గదిలో దీపం వెలిగించి ఉండటం చూసిన వాసుదేవ్ అడిగాడు అపుడే లైట్లు వెలి గించారే ?"

"ఊ ... ఈ రోజు మీరు త్వరగా తిరిగి వస్తారని" మాధురి చిరునవ్వు చిందిస్తూ చిలిపిగా జవాబిచ్చింది.

"మరి నేను మధ్యాహ్నమే తిరిగి వస్తే?"

"మీరు లేకుంటే ఈ ఇల్లు చీకటి కొట్టులా అనిపిస్తుంది. ఒంటరిగా ఉన్న నన్ను ఇంత పెద్ద ఇల్లు నోరు తెరచి మింగేస్తుందేమో, అన్నంత భయం వేస్తుంది"

"ఒంటరిగా ఎందుకుంటావు? గంగ ఉంది. పైగా నౌకర్లు, చౌకిదారు ఉన్నా రుగా. అన్నిటికంటే మంచిది ఇంటి చుట్టూ వున్న ఈ సుందర ప్రకృతి. చాలదా నీకు తోడు... !"

"అన్నీ ఉన్నా మీరు లేకుంటే మాత్రం..." మాధురి భర్త మాటలు మధ్యలోనే తెంచి, అతని కోటు గుండీలు విప్పసాగింది.

వాసు కోటు వదిలి మంచం మీద పడుకొన్నాడు. మాధురి వెళ్ళి అతని పక్కనే కూర్చొని, చెదరిన అతని తల వెంట్రుకలను వేళ్ళతో మృదువుగా సరి చేస్తూ అడిగింది-

"ఈ రోజు ఎలా గడిచింది మీ వేట?"

"చాలా చెడ్డరోజు. ఒక్క పిట్టకూడా దొరకలేదు"

"మంచి పనే జరిగింది. పాప భారం కొంత తగ్గిపోయింది"

"పాపమా! పాప పుణ్యాల సరిహద్దు ఇంత సమీపంలో ఉందా! అలా అయితే ఈ లోకంలో ఇహ బ్రతికినట్లే"

"ఎలా అయితే బాగుంటుంది మరి ?"

మాధురి తన రెండు చేతుల్నీ అతని మెడచుట్టూ వేస్తూ గోముగా, ప్రేమగా, వయ్యారంగా అడిగింది. వాసు మౌనం గానే అయినా పరిశీలనగా, ప్రేమతో మత్తుతో నిండిన ఆమె కళ్ళలోకి చూశాడు. నెమ్మదిగా ఆమె చేతులు తొల గించి, మంచం మీద నుండి లేచాడు.

మాధురి మృదువుగా అతని చేతిని తన చేతిలోకి తీసికొని, అర్థం కానట్లుగా చూస్తూ అడిగింది"

"ఏమైంది?"

"ఏమీలేదు గానీ స్నానానికి ఏర్పాటు చేయించు ... ... బాత్‌రూంలో నీళ్ళు




పెట్టించు"

మాధురిలో కెరటంలా పొంగిన ఉద్రేకం చల్లబడింది. బొమ్మలా అతని వైపు చూస్తూ ఉండిపోయింది.

వాసు నవ్వి బట్టలు మార్చుకో డానికి పక్క గదిలోకి వెళ్ళాడు.

అతడు వెళ్ళిన తర్వాత కూడా ఆమె కొన్ని నిమిషాలపాటు అక్కడే నిలబడి, శూన్యంలోనికి రెప్పవాల్చకుండా చూస్తూ ఉండిపోయింది. అంతలో ఏదో గుర్తుకు వచ్చిన దానిలా ఉలిక్కిపడి, స్నానానికి నీళ్ళు పెట్టమని గంగతో చెప్పి భర్తకు కావలసిన బట్టలు బయటకి తీసింది. అప్పుడప్పుడు తనపట్ల భర్త చూపే ఉపేక్షా భావాన్ని, నిర్లక్ష్య వైఖరిని తలచుకొంటే ఆమెకు నిరాశ కలుగు తుంది. మనసంతా చేదుగా, జీవితం చీకటిగా అయిపోతుంది. ఒక్కోసారి అప్ర యత్నంగానే ఆపాదమస్తకం వణికి పోతుంటుంది.

వారి పెండ్లి జరిగి మూడు సంవత్స రాలు దాటిపోయింది. అయినా ఇంకా తన భర్త స్వభావాన్ని, అంతరంగం లోతును గ్రహించలేకపోతోంది. మరెవరితో నైనా మాట్లాడుతూ కొంత మనసుకు ఆహ్లాదం కల్గించుకొందామంటే, దగ్గరలో బంధువులుగాని, మిత్రులుగాని ఎవరూ లేరు. రాత్రింబవళ్ళు తన మనసును, మనసులో ఉవ్వెత్తుగా లేస్తుండే భావాలను బలవంతంగా, అతి ప్రయత్నం మీద అణచుకొంటూ మౌనంగా ఉంటూంది. తనకు ఏ విషయంలో లోటు ఉందని? తనలో యవ్వనం ఉంది, అందం ఉంది, చదువు ఉంది, తాను ఉన్నత కుటుం బములో పుట్టింది. తన తండ్రికి డబ్బుకు, వైభవానికి ఏమీ కొదువలేదు ... సభ్య సమాజంలో పాటించవలసిన విషయా లన్నీ తనకు క్షుణ్ణంగా తెలుసు. అయినా మరి భర్త తనకు దూర దూరంగా ఉంటూ, బిడియపడుతూ ఉంటున్నాడు.

ఈ ప్రశ్నలన్నీ ఆమె మనసులో కల్లోలాన్ని రేపుతున్నాయి. కాని ఆ భావతరంగాలను అరికట్టే మార్గం ఏమిటి? ఆ మార్గం తెలియక ఆమె గంటల కొద్దీ ఆలోచించి చివరకు అలసిపోతుంది. ఎంతసేపు ఆలోచించినా ఆమెకు తనలో లోపంగాని, భర్త ప్రవర్తనకు కారణం గాని, ఈ సమస్యకు ఒక పరిష్కారం గాని తోచేది కాదు.

తన భర్తను ఆకర్షించాలని, ఆయన మనసుకు సంతోషం కలిగించి ఆయనను మురిపించి తనవైపు తిప్పుకోవాలని ఆమె కొత్త కొత్త ప్రయత్నాలెన్నో చేస్తుండేది. కాని అన్నీ వ్యర్థమయ్యేవి. ఇద్దరి మధ్య ఒక అగాథం ఏర్పడి అది ఇంకా పెద్దది అవుతోందా అనిపిస్తుంది. ఆయన్ను ప్రసన్నం చేసుకోవాలనీ, ఆయన ప్రేమను పొంది, ఆ ప్రేమ ప్రవాహంలో తనివిదీర స్నానమాడాలనీ, ఆమె ఎన్నో ప్రయత్నాలు చేసింది. కాని అన్నీ వృథా అయ్యాయి. ఇప్పుడామె అసలు ప్రయత్నించడమే మానుకొన్నది. ఆమె పరిస్థితి నదీ తరంగాలపై తేలి యాడుతూ-అల ఇటు కదిలితే ఇటు, అటు కదిలితే అటు కదిలే గడ్డిపోచవలె వుంది.

ఆమె చాలా విచిత్రమైన జీవితం గడుపుతోంది. ప్రేమలేదు. ఏవగింపు లేదు. సంతోషం లేదు. విషాదం లేదు. లేశ మాత్రం ఆసక్తి మాత్రం వుంది. దానితోపాటు అణుమాత్రం అనురక్తి మిగిలి వుంది. వీటికి తోడుగా నిరంతరం

బాధించే వేదన ఉంది. గాఢనిద్రలో ఉన్న తనపై ఎవరో పెద్దరాయి విసిరి తల పగులగొట్టినట్లు, ఆ దెబ్బను చూస్తూ వారు ఎంతో ఆనందం అనుభవిస్తున్నట్లు ఆమెకు అనిపిస్తుంది.

బాత్‌రూమ్ గడియ తీసిన చప్పుడయింది. ఆమె ఉలిక్కిపడి తనను తాను సంబాళించుకొని, బల్లమీద ఉన్న టీ ట్రేను చూస్తూ ఉండిపోయింది. వాటిని గంగ అక్కడ ఎప్పుడు పెట్టి వెళ్ళిందో ఆమె గమనించనే లేదు. వాసు వస్తున్న చప్పుడైంది. ఆమె బల్లమీదకు వంగి టీ తయారు చేస్తోంది. మౌనంగా, గంభీర ముద్రలో ఉంది. వాసు ఆమె వైపు ఓరగా చూశాడు. చిరునవ్వు నవ్వుతూ ఆమె దగ్గరికి వచ్చి కూర్చున్నాడు. మాధురి టీ కప్పు భర్తకు అందించింది. కప్పు అందుకుంటూ అతడు అడిగాడు –

"ఏమిటి సంగతి? సీరియస్‌గా కనిపిస్తున్నావు. నొసలు మీద ముడతలు పడ్డాయి?"

"నేనెలా ఉంటే మీకెందుకు?" మాధురి కాస్త సీరియస్‌గానే జవాబిచ్చింది. ఆ తర్వాత అనాసక్తంగా తల పక్కకు తిప్పుకొని తన కోసం టీ కలుపుకో సాగింది.

"నాకు కాకుంటే మరెవరికి కావాలి నీ విషయం?"

"ఏమో, నాకేం తెలుసు. మీకు వేటాడటం తెలుసు. ఎదుటి ప్రాణుల్ని గాయపర్చటం మాత్రం తెలుసు. గాయపడ్డ మనసుల్లోని బాధ మీకేం తెలుస్తుంది?"

"మధూ...!"

"హూ...!"

"ఎదుటివాళ్ళను గాయపరచడంలో నాకు ఆనందం లభిస్తుందా?"

"ఏమో, నాకేం తెలుసు? మీకే తెలియాలి."

"అయితే విను...ఆ ప్రాణులకు ఎంత బాధ కలుగుతుందో, అంతకంటే ఎక్కువ బాధతో నేనూ విలవిలలాడిపోతాను"

"అయితే వేటకు వెళ్ళడం మానేయండి."

"వీల్లేదు ... మానేయడం నాకు చేతకాదు."

వాసు టీ తాగి మౌనంగా కూర్చున్నాడు. ఇంకా ఎక్కువ తర్కించడం మంచిదికాదని అనుకున్నాడేమో! మాధురి కూడా మౌనంగా టీ తాగుతోంది.

వాసు లేచి తన గదికి వెళ్ళాడు. ఆమె మరికొంతసేపు అక్కడే కూర్చొని ఏవేవో అర్థంకాని ఆలోచనల్లో లీనమైంది. తర్వాత లేచి బట్టలు మార్చుకోసాగింది. ఆమె మనసులో ఎన్నో ఆలోచనలు...ఆయన స్వభావం తెలిసి కూడా తాను ఇలా గంభీరంగా మూతి ముడుచుకొని ఉండటం భావ్యంగా లేదేమో? ఆయన అలా ఉండటాన్ని తప్పుగా భావిస్తున్నానేమో!

ఆమె తన అంతరంగాన్ని ఒకసారి పరిశీలించుకొంది. నిజంగా ఆమెకు తన భర్తపట్ల ఎంతో ప్రేమ ఉంది.

అంతలో ఆమె అంతరంగంలో దాగిన మధుర భావం ఏదో నిద్ర మేల్కొంది. మెల్లగా నడిచి వాసు ఉన్న గదిలోకి వెళ్ళింది. అతడు బీరువా పక్కన నిలబడి ఏదో పుస్తకం వెదుకుతున్నాడు. మాధురి శబ్దం కాకుండా అతని వెనక్కు వెళ్ళి నిలబడింది. అతడు ఎంతసేపటికీ వెనక్కు తిరగక పోవడంతో కొంగు అంచును సన్నగా చేసి అతని చెవికి ఆనించింది. అతడు ఉలిక్కిపడి, వెనక్కు తిరిగి

చూశాడు. మాధురి ఫక్కున నవ్వింది.

ఇప్పుడామె ఇంకా అందంగా కనిపిస్తోంది. లేత గులాబీ రంగు సిల్కు చీర...చక్కగా దువ్వుకున్న కేశరాశి.. ప్రకాశవంతమైన, యౌవనశోభతో నిండిన అందమైన ముఖం...

ఆమె పెండ్లి కూతురుగా ఈ ఇంట్లో మొట్ట మొదట అడుగుపెట్టిన దృశ్యం అతని కండ్లముందు నిలిచింది...అప్పుడు కూడా ఆమె ఇలాగే అందాలరాశిలా, ప్రేమ దేవతలా ఉంది. అతడు చిరునవ్వుతో ఆమె వైపు ప్రశంసాపూర్వకంగా చూశాడు. చేతిలోని పుస్తకాన్ని మూసి బీరువాలో పెట్టాడు. మాధురి తన చేతిలో ఉన్న గులాబి పువ్వును అతని చేతిలో పెట్టింది. తన జడలో అలంకరించమన్న భావంతో నిలబడింది.

అతడు ఆమె ఉద్దేశం గ్రహించి, ఆమె భుజాలను రెండు చేతులతో పట్టుకొని ఆమెను వెనక్కు తిప్పి, జడలో గులాబి తురిమాడు. మాధురి ప్రఫుల్ల వదనంతో అతని కండ్లలోకి చూసింది. ఆమె కండ్లలో ప్రేమ ఉంది. మత్తు ఉంది.

ఆమె చిరునవ్వు నవ్వి తన ముఖాన్ని అతని వక్షంపై ఆనించి అన్నది-

"అలా బయటికి పోదామా...?"

"ఎక్కడికి ?"

"సరోవర తీరానికి...షికారుగా వెళ్ళి వద్దాము."

"ఇప్పుడా! పొద్దు క్రుంకుతోందిగా."

"అయితేనేం...ఆకాశంలో చంద్రుడు ఉంటాడుగా!"

వాసు నిరుత్తరుడయ్యాడు.

ఇద్దరూ పాల పొంగులా పరుచుకొని ఉన్న తెల్లని వెన్నెలలో, సరస్సు ఒడ్డున విహరిస్తున్నారు. సరస్సులో నిశ్చలంగా ఉన్న నీరు పెద్ద గాజు పలకను పరచి నట్టుగా భ్రమ కలిగిస్తోంది.

ఆమె జీవితంలో ఎన్నో పగళ్ళు, ఎన్నో రాత్రులు ఈ సరస్సును చూడటంలోనే, దాని ఒడ్డున షికారు చేయడంలోనే గడిచాయి. కాని అవన్నీ కలలో జరిగినట్లుగా అనిపిస్తున్నాయి. ఆమె మొట్టమొదటిరోజు ఆ సరస్సు ఒడ్డుకు వచ్చి వెళ్ళినరోజు...ఎంత అసంతృప్తి, నిస్పృహ చెందిందో ఈ దినం కూడా అంతే అసంతృప్తిని అనుభవిస్తోంది. ఆమె మనసులో ఈరోజు కూడా కోరికలు జ్వాలలై నిలువునా కాల్చివేస్తున్నాయి. ఆమె నిరంతరం తనలో చెలరేగే ఆకాంక్షను, ఉద్రేకాన్ని బలవంతాన అణచివేస్తూ వచ్చింది.

ఈ సుందరమైన సరస్సు...ఈచిన్న ఇల్లు...కళకళ లాడుతూ పైరుపచ్చలతో నిండి ఉన్న గ్రామం...పట్టణ కోలాహలానికి దూరంగా...స్వర్గ లోకంలోని ఒక భాగంలా ఉంది.

అయినా ఆమె మాత్రం నరక లోకపు అగ్నిలో కాలుతున్నట్లుగా బాధ పడుతోంది. మనసులోని మాట పెదాల దాకా రాలేకపోతూంది. తానేమో తన సర్వస్వం భర్తకు అర్పించుకొంది. కాని ఆయన తన భావాలను గ్రహించనివాడిలా తన ప్రేమకు దూరంగా, ఏదో లోకాల్లో విహరిస్తుంటాడు'

ఎందుకని? ఎందుకలా చేస్తున్నాడు??

వాళ్ళు చాలాదూరం నడిచి వెళ్ళి ఒక చోట ఆగిపోయారు. పచ్చని గడ్డిపై కొంచెంసేపు కూర్చున్నారు. వాళ్లు భార్యాభర్తలే! కాని అపరిచితుల్లా కూర్చున్నారు. ఇద్దరూ కూడా అవతలి వ్యక్తికి ఏదో చెప్పాలనే అనుకొంటున్నారు. కాని

ఎవరూ ఏమి చెప్పలేకపోతున్నారు. చాలా సేపటివరకు అలాగే కూర్చొని ఉన్నారు. మాధురి నోరు తెరచి ఒక మాట కూడా మాట్లాడకపోవడంతో, మౌనాన్ని భంగపరుస్తూ వా సు దే వ్ అన్నాడు. "ఈరోజు ఎందుకు ఇలా మౌనం వహించావు ?"

"నేను మాట్లాడితే మీకు నచ్చదేమో అని !"

"అలాంటిదేమీ లేదు. నీ మనసులో మాట చెప్పేసెయ్యి. నేనేమీ అనుకోను"

"అయితే ఒక విషయం అడగ మంటారా ?"

"నిరభ్యంతరంగా"

"మన పెండ్లి జరిగి ఎంతకాల మయింది ?"

"సుమారు మూడు సంవత్సరాలు"

"కాని నాకు మాత్రం ఇంకా వివాహమే కాలేదేమో అనిపిస్తోంది"

"మాధురీ!" ఆమె ఏమి మాట్లాడ బోతోందో, ఏ విషయాలు ప్రస్తావించ బోతోందో అతడు గ్రహించినట్లున్నాడు.

"ఊ...!"

"నేను ఏనాడో చెప్పానుగా నీతో... ప్రేమ ఒక విచిత్రమైన భావం. అసంతృప్తి అనేది ఉన్నంతకాలం ప్రేమ సజీవమై ఉంటుంది. ఆ తృప్తి అన్నది శాశ్వతమైన ప్రేమకు చిహ్నము"

"కానీ ప్రజలంతా ఏమనుకుంటు న్నారో మీకు తెలుసా ?"

"ఏమంటున్నారు?"

"నీ భర్త నిన్ను ప్రేమించడం లేదు అని"

వాసు చికాకుపడిన మనసుతో వెంటనే లేచి నిలబడ్డాడు.

"నువ్వు ఇలాగే సంతానహీనురాలివి గానే ఉండిపోతావు" అని కూడా వారు అంటున్నారు. మాధురి మనసులోని మాటలు ఒక్కొక్కటే బయటపెడు తోంది.

వాసు ఆమె వైపు తీక్షణంగా చూశాడు.

"ఒకామె మరో మాట కూడా అన్నది!"

మాధురి కొంచెం ఆగి చెప్పాలా వద్దా అన్నట్లు చెప్పింది. ఈ మాటలు అంటూం డగా ఆమె గొంతు బొంగురు పోయింది.

"ఏమన్నది?" వాసు నుదుటికి పట్టిన చెమట తుడుచుకొంటూ అడిగాడు.

"నీ భర్త ఎవరినైనా...!" ఈ మాటలు అంటూండగా ఆమె పెదాలు వణికాయి. తన భర్తలోని ప్రేమ రాహిత్యానికి, ఇంతకాలం అతడు తన పట్ల ముభావంగా ఉండడానికి గల ప్రబల కారణాన్ని బహిర్గతం చేయబోతున్నందుకు ఆమె పెదాలు కంపించాయి.

వాసు ఆశ్చర్యంతో ఆమె ముఖ కవళికలను, కంపిస్తున్న ఆమె స్వరాన్ని గమనించాడు. మాధురి ఆగి ఆగి మెల్లగా తాను చెప్పదలుచుకొన్న మా ట లు చెప్పింది-"నీ భర్త ఎవర్నయినా ప్రేమి స్తున్నాడేమో!" అన్నది.

మాధురి చెప్పిన మాటలు విన్న వాసుకు పోయిన ప్రాణాలు తిరిగి వచ్చి నట్లయింది. తలను చేతితో పట్టుకొని, రెప్పలు కిందకు వాల్చి అన్నాడు-

"నువ్వు ఏమనుకొంటున్నావు ?"

"ఒక్కోసారి ఆమె మాటలు నిజమే నేమో అని సందేహం కలుగుతుంటుంది"

"ఎందుకని ?"

"సరోవర తీరానికి వచ్చినప్పుడు

 

కూడా మీపు నాకు అసంతృప్తినే మిగుల్చుతున్నారు"

"ఓహో అదా !" వాసుదేవ్ తల పైకెత్తి ఆకాశం వైపు, తెల్లని మేఘాలతో దాగుడు మూతలాడుతున్న చంద్రుని వైపు చూస్తూ అన్నాడు.

"లేకుంటే ఈ నిర్లక్ష్యం, ఈ మౌనం ఉండవేమో ! మీరు బంధువుల బలవంతం వల్ల విధిలేక నన్ను పెండ్లి చేసుకొన్నారని కూడా విన్నాను"

"ఇదంతా నీకెవరు చెప్పారు?" వాసు ఆశ్చర్యంగా అడిగాడు.

"మీ అక్కగారు. బహుశ ఆ కారణం వల్లనే నా పట్ల మీ ప్రవర్తన ఇంత వింతగా ఉంటున్నదని నేను అనుకుంటున్నాను"

"మాధురీ...ప్రతి మనిషిలో కొన్ని రహస్యాలు దాగి వుంటాయి. వాటిని పెదాలతో ఉచ్చరించడానికి కూడా ఆ మనిషి సాహసం చేయలేడు"

"నాతో చెప్పకూడని అంత రహస్యం మీలో దాగి ఉందా? ఏమిటది ?"

"సమయం వచ్చినప్పుడు చెప్తాను!" అంటూ అతడు లేచి సరస్సు ఒడ్డునే మెల్లగా అడుగులు వేయసాగాడు. మాధురి కూడా అతని వెనకే అడుగులో అడుగు వేస్తూ నడుస్తోంది. ఈ సరస్సు వలె తన భర్త మనసు కూడా పైకి మామూలుగా కనిపిస్తున్నా, చాలా అగాధమైంది. దాని లోతు కనుక్కోవడం చాలా కష్టం అని ఆమె తన మనసులో అనుకొన్నది.

వాసు అన్యమనస్కంగా ఏమాలోచిస్తున్నాడో గానీ తనకే తెలియకుండా మెల్లమెల్లగా ముందుకు అడుగులు వేస్తున్నాడు. మాధురి ఎక్కడ వెనుకపడిపోయిందో, ఎప్పుడు వెనక్కు తిరిగి వెళ్ళిపోయిందో అతనికి తెలియనే లేదు. మాధురి మాటలు అతనికి ఈ రోజు మరింత బాధను కలిగిస్తున్నాయి. అతని హృదయాన్ని ఎవరో పిడికిలిలో బిగించి పిండుతున్నట్లుగా ఉంది.

అంతలో ఏదో విషయం గుర్తుకు వచ్చి తక్కున ఆగి వెనక్కు తిరిగి చూశాడు— మాధురి అక్కడ లేదు. పిండిలా పరచుకొన్న వెన్నెల వెలుగులో అతడు కనిపించినంతదూరం పరిశీలనగా చూశాడు. కాని ఆమె ఎప్పుడో వెనక్కు వెళ్ళిపోయింది.

అతడు ఇంటికి తిరిగి వచ్చాడు. మాధురి తన పడక గదిలో మంచంమీద బోర్లా పడుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది. వాసు ఆమెను చూసి కొంచెం కలవరపడ్డాడు. తన కలవరపాటు కప్పిపుచ్చుకోవాలనే ప్రయత్నంలో కోటు విప్పడం కోసం గంగను పిలిచాడు. మాధురి ఇంకా ముడుచుకొని మూటలాగా పడుకొంది. ఆమె ఏడ్పు సన్నగా, ఆగి ఆగి వినిపిస్తోంది. గంగ లోపలికి రాగానే వాసు ఆమెతో అన్నం వడ్డించమని చెప్పాడు. గంగ వెళ్ళిపోయింది. అతడు మాధురి దగ్గరికి వచ్చి నిలబడ్డాడు. ఆమె వెక్కిళ్ళుపెట్టి ఏడుస్తోంది. ఏడుపు ఆపుకోవాలని ప్రయత్నిస్తోంది. కానీ సాధ్యం కావడం లేదు. ఆమెను ఎలా ఓదార్చాలో ఏడ్పును ఎలా మాన్పించాలో తోచక అతడు అక్కడే నిలబడ్డాడు. తర్వాత ఆమె పక్కనే మంచంమీద కూర్చున్నాడు. నెమ్మదిగా తన చేతులతో ఆమె వీపును నిమురుతూ అన్నాడు—

"మాధురీ! లే...అన్నం తిను"



మాధురి అలాగే పండుకొని ఏడుస్తూ ఉంది. వాసు ఆమెను లెమ్మని ఒకటి రెండు సార్లు బ్రతిమాలాడు. కాని ఆమె ఏమీ జవాబివ్వలేదు. ఇంతలో గంగ వచ్చి "బాబుగారు! రండి, అన్నం వడ్డించాను" అని పిలిచింది.

"మూతలు పెట్టి ఉంచు గంగా! నాకు



ఆకలిగా లేదు" కొన్ని క్షణాలు ఆగి. వాసు ఆమెతో అన్నాడు. తర్వాత మంచం పైనుండి లేచి పక్క గదిలోకి వెళ్ళాడు.

మాధురి వాసు మాటలన్నీ వింది. గది దాటి బయటికి వెళ్ళిన అతని అడుగుల చప్పుడు కూడా విన్నది. తలెత్తి చూసేసరికి అతడు గది దాటి పోతున్నాడు. అతన్ని ఆపాలనుకొంది కాని అప్పటికే అతడు గది దాటి వెళ్ళాడు. పక్కగది తలుపులు మూతపడిన శబ్దం వినిపించగానే ఆమెకు మళ్ళీ ఏడుపు పొంగి వచ్చింది.

ఆమె పెద్దగా ఏడవసాగింది.

ఆమె ఈ విధంగా నిస్సహాయురాలై ఏడవడం చూసిన గంగ ఉండలేక పోయింది. దగ్గరికి వచ్చి మాధురిని లేపి కూర్చోబెట్టింది. మాధురి మనసు వికలమైంది. హృదయం సుడిగాలిలో ఎగిరే ఎండుటాకులా అయింది. గంగ నుండి కొంత ఓదార్పు లభించగానే ఆమె గంగ ఒడిలో తలదాచి వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆ విధంగా ఆమె తన గుండె బరువును తగ్గించుకొంది.




'గంగా !"

"ఏంటమ్మగారూ !?"

"అయ్యగారింకా టిఫిన్ చేయలేదా ?"

"లేదు! ఆయన ఉదయాన్నే బయటికి వెళ్ళారు."

"ఎక్కడికి?" మాధురి ఆశ్చర్యపోతూ అడిగింది.

"సరస్సు అవతల వైపుకు...... ఆయన స్నేహితుడెవరో వస్తున్నాడట. ఆయన్ను తీసికొని రావడానికి వెళ్ళారు."

"నిన్న ఆయన ఈ సంగతి నాతో మాట మాత్రమైనా చెప్పలేదే ?"

"బహుశ...మరచిపోయారేమో" అని గంగ గదిలో ఉన్న వస్తువులను సర్దుతూ దుమ్ముదులపడంలో నిమగ్నమైంది. మాధురి మౌనంగా ఉండిపోయింది. ఆమె గంభీర ముద్ర ఆమె ఏదో విషయాన్ని దీర్ఘంగా ఆలోచిస్తున్నదని చెప్తోంది.

మౌనంగా వెళ్ళి కిటికీ రెక్కతెరిచి అక్కడే కూర్చుంది. ఎదురుగా సరస్సు, దానిలోని జలరాశికూడా గంభీరముద్రలో ఉన్నాయి.

ఆమె చూపులు సరస్సు దాటి ఆవలి వైపుకు చేరాయి. అక్కడ ఒక చిన్న రైల్వేస్టేషను ఉంది. ఆ ఊరికి రావాల కున్న వాళ్ళు ఎవరైనా సరే, ఆ స్టేషనులోనే దిగాల్సి ఉంటుంది. ఆమె భర్త తన స్నేహితుణ్ణి ఆహ్వానించడానికి ఆస్టేషనుకే వెళ్ళాడు. అక్కడి నుంచి గ్రామంలోకి రావాలంటే ఒకే ఒక మార్గం ఉంది. అదే పడవ మార్గం.

ఇప్పుడామె తన ప్రవర్తనకు పశ్చాత్తాప పడసాగింది. ఆయన బహుశ నిన్నటి తన ప్రవర్తన మూలంగానే కోపం వచ్చి స్నేహితుని విషయం ఏమీ చెప్పకుండా వెళ్లారేమో!

మాధురి సరస్సుపైన ఎగురుతున్న పక్షులను చూస్తోంది. అలసిన ఆమె శరీరంలో, రక్తనాళాల్లో మళ్ళీ నవజీవనం, నవోత్సాహం నిండినట్లనిపించింది. ఆమె వెంటనే లేచి గంగను పిలిచింది- గంగా! నువ్వు త్వరగా ఇల్లంతా శుభ్రంచేసి, వస్తువులన్ని సరిగా సర్దు. నేను టిఫిన్ తయారు చేస్తాను"

ఆమె ఈ మాటలుఅని వంటింట్లోకి వెళ్ళింది. ఈ దినం ఆమె స్వయంగా తన భర్తకు, రాబోయే అతిథికి ఫలహారం తయారు చేయాలనుకొంది. తన భర్త అతిథిని వెంటపెట్టుకొని ఇంట్లోకి రాగానే, రాత్రి జరిగినదంతా మరచిపోయి ఎంతో ఉల్లాసంగా, ఉత్సాహంగా అతన్ని తనకూ, తనని అతనికీ పరిచయం చేస్తాడు..

"ఈమే మాధురి...నా ప్రాణం, నాజీవ సర్వస్వం. ఈమె కారణంగానే, ఈమె సాహచర్యం వల్లనే నేను నిర్జన ప్రదేశంలో కూడాస్వర్గ సుఖాన్ని అనుభవించగల్గు తున్నాను ......

ఆమె ఊహల్లో తేలియాడుతోంది. ఎన్నో ఊహించుకొంటోంది. ఎన్నో ఊహా చిత్రాలు మనోఫలకంపై చిత్రించ బడుతున్నాయి. మాటి మాటికి, పని

మధ్యలో ఆపి సరస్సు వైపు చూస్తోంది. వాళ్ళు కనిపించకపోయేసరికి నిరాశ చెందుతోంది. ఏదో అర్థంలేని భయం ఆమె మనస్సును కలచివేస్తోంది. కాని ఆ బాధ ఏమిటో ఆమెకే తెలియడం లేదు.

అంతలో గంగ పరుగుతో ఆమె దగ్గరికి వచ్చి అన్నది —"వాళ్ళు... వాళ్ళు......వచ్చేశారు!"

"ఏరీ!"

"అదుగో...పడవపైన......"

ఆమె పరుగున వరండాలోకి వచ్చి చూసింది. దూరంగా నీటిపై తేలియాడుతూ ఒక పడవ ఆమె వైపుగా వస్తూ ఉంది. దూరంగా ఉన్నందు వల్ల గుర్తించ లేకపోతోంది కానీ, ఆ పడవలో తన భర్త తప్పక ఉంటాడని ఆమె మనసు నమ్మకంగా చెబుతోంది. భర్త ఒక్కడే రావడంలేదు. వెంట మరొకరు కూడా ఉన్నారు.

గంగను వంట గదిలో ఉండమని చెప్పి ఆమె వెంటనే తన గదిలోకి వెళ్ళింది. మళ్ళీ అదే కిటికీ దగ్గరికి వెళ్ళి బయటకి తొంగి చూసింది. ఆ పడవ క్రమంగా ముందుకు సాగివస్తోంది. భయం, సంతోషం రెండూ ఆమె హృదయాన్ని ఆక్రమించుకొన్నాయి. గుండె వేగంగా కొట్టుకోసాగింది. అద్దంలో తన ముఖం చూసుకొంది. చెదరిన వెంట్రుకలు, అలంకరణ లేని ముఖం —చూసుకొని అసంతృప్తి చెందింది. త్వర త్వరగా తల దువ్వుకొని జడ వేసుకొంది. అలమరలో నుండి లేతగులాబీ రంగు చీర తీసి కట్టు కొంది. ఒక చేతికి అదే రంగు గాజులు వేసికొని, జడకు సిల్కు రిబ్బను కట్టు కొంది. ఇదంతా కొద్ది నిమిషాల్లోనే పూర్తి చేసింది,

తమ యిద్దరి మధ్య పొరపొచ్చాలు న్నాయనీ, భార్యా భర్తల మధ్య పొందిక లేదనీ, తమజీవితాల్లో విషాద ఛాయలున్నాయనీ ఇతరులు, ముఖ్యంగా అతిథులు కనిపెట్టడం ఆమెకు ఇష్టంలేదు. కిటికీ చాటున నిలబడి క్రిందకు చూసింది. పడవ ఒడ్డుకు చేరింది. వాళ్ళు కిందకు దిగారు. చౌకీదారు సామాన్లు దించుతున్నాడు. ఆమె గుండె ఇంకా వేగంగా కొట్టుకోసాగింది.

ఆమె ఆగంతకుణ్ణి చూడాలని ప్రయత్నించింది. కాని ఆ ప్రయత్నం ఫలించలేదు. తన భర్త స్నేహితునికి ఇంటిని చూపించే ప్రయత్నంలో కిటికీ వైపు చూడగానే ఆమె చటుక్కున పక్కకు జరిగి గోడచాటున నిలబడింది. దడ దడ లాడుతున్న గుండెతో అక్కడే నిలబడి వాళ్ల రాకకు ఎదురుచూడసాగింది.

కింద కొంత సంచలనం కలిగింది... నౌకర్లు హడావిడిగా అటూ ఇటూ పరుగులు తీశారు. గంగ పరుగున లోపలకి వచ్చింది. యజమాని రాకను మాధురికి తెలిపింది. మౌనంగా నిలబడి ఉంది. ఆమె ప్రాణాలన్నీ చెవుల్లో కేంద్రీకరింపబడి ఉన్నాయి. అడుగుల శబ్దం వింటోంది. హాలు బయట నుండి వాసు మాటలు వినిపించాయి. "గంగా! మాధురి ఎక్కడ ఉంది?" ఆమె ఉలిక్కిపడి తనను తాను సంబాళించుకొన్నది. వాళ్ళు పక్కనేఉన్న గదిలోకి వచ్చారు. అక్కడే ఉండాలా! ముందుకు వెళ్ళి వాళ్ళకు స్వాగతం చెప్పాలా అన్న విషయం నిర్ణయించుకోలేకపోయింది. అంతలోనే వాసు పరదా తొలగించి లోపలికి ప్రవేశిం చాడు. క్షణంసేపుఆశ్చర్యంగా మాధురిని చూస్తూ ఉండిపోయాడు. ఆమె ఈ గులాబీ

రంగు బట్టల్లో ఎంతో అందంగా, ఆకర్షణీయంగా, మరులు పురిగొల్పేలా కనిపిస్తూంది. అతడు చిరునవ్వు నవ్వి, తన చేతిలో ఉన్న పువ్వును ఆమెకు అందించాడు. మాధురి సిగ్గుతో,సంకోచంతో తల వంచుకొని నిలబడింది. వాసు తన కోటు ఆమెకు అందిస్తూ అన్నాడు-

"మనకు ఒక అతిథి వచ్చాడు. బయట ఉన్నాడు."

"నిన్న మీరు ఈ విషయం చెప్పనే లేదు."

"నీవు చెప్పే అవకాశం ఇస్తేకదా !"

ఆమెమౌనంగా భర్తకోటును స్టాండుకు తగిలించింది. వాసు అన్నాడు-"అతని కొరకు ఏమీ ప్రత్యేకంగా శ్రమ పడాల్సిన పనిలేదు. అతడు మన ఇంటి మనిషి అనుకో... ఆ...అది సరే... చాలా దూరం ప్రయాణం చేసి వచ్చాడు. అతని స్నానానికి ఏర్పాట్లు చేయమని గంగతో చెప్పు... అతడు నా గదిలో ఉంటాడు" అని చెప్పి బట్టలు మార్చుకో సాగాడు. అతిథి భోజనానికి, విశ్రాంతికి ఏర్పాట్లు చేయడానికి మాధురి బయటకి వెళ్ళింది.

ఆమె హాలులో అడుగు పెడుతూ అక్కడ నిలబడిఉన్న వ్యక్తిని చూసి ఠక్కున ఆగిపోయింది. అతడు కిటికీ గుండా సరస్సును చూస్తున్నాడు. అతని వీపు గదివైపు ఉంది. సిగరెట్ పొగవల్ల గది అంతా పొగాకు వాసన వ్యాపించింది. మాధురి మెల్లగా, చప్పుడు చేయకుండా వెనక్కు తిరిగి వెళ్ళిపోవాలనుకుంది కాని అతిథి ఆమె అడుగుల సవ్వడి విన్నట్లు వుంది. కాని వెనక్కు తిరగకుండానే నోటితో సిగరెట్ పొగ బయటకి వదులుతూ అన్నాడు- "వాసూ! ఇది పల్లెటూరు కాదు, భూతల స్వర్గం అంటే నమ్ము. ఈ ప్రదేశం ఇంత అందంగా, హాయి గొల్పేదిగా ఉంటుందని తెలిస్తే నేను ఎప్పుడో నీ దగ్గరకు వచ్చి మకాం పెట్టిఉండేవాణ్ణి".

మాధురి అతనికి జవాబుగా అనాలనుకొంది. కాని ఆమె పెదాలు కదలలేదు. పెధాలు దాటి ఒక్క మాట కూడా రాలేకపోయింది. కొంతసేపటి వరకు తన మాటకు జవాబు రాకపోవడంతో అతిథి గిరుక్కున వెనక్కు తిరిగాడు. ఇద్దరి చూపులు కలిశాయి. వాళ్ళు ఒకరినొకరు ఆశ్చర్యంగా చూశారు. అతని చేతిలోని కాలుతున్న సిగరెట్ అప్రయత్నంగా కిందపడిపోయింది. మాధురి కండ్లు సిగ్గుతో, సంకోచంతో కిందకు వాలాయి. ఆమె వెంటనే వెనక్కు మళ్ళింది. కాని అప్పటికే వాసు పక్క గదిలో నుండి అక్కడకు వచ్చాడు. మాధురి బొమ్మలా నిలబడిపోయింది. వాసు చిరునవ్వుతో ఆమెవైపు చూశాడు. అతిథిని సంబోధిస్తూ అన్నాడు-"రాజా ఈమె నా భార్య మాధురి. నా జీవన సర్వస్వం. ఈమె ఉండబట్టే నేను ఈ ఎడారి ప్రదేశంలో కూడా స్వర్గసుఖాన్ని అనుభవిస్తున్నాను"

రాజేంద్ర మెల్లగా చేతులు జోడించి ఆమెకు వందనం చేశాడు. మాధురి కంపిస్తున్న పెదాలతో అతనికి ప్రత్యభివాదం చేసింది. వెంటనే బయటకి వెళ్ళిపోయింది.

ఆమె బయటకి వెళ్తూ రాజేంద్ర తన భర్తతో అంటున్న మాటలు విన్నది.

"వాసూ! నువ్వు చాలా అదృష్టవంతుడివి. నీకు ఒక మంచి సహధర్మచారిణి దొరికింది."

ఆమె పరదా చాటున నిలబడి ఈ




మాటలు విన్నది. గదిలో మౌనం నిండు కున్నది. ఆమె తెరచాటునుండే కొత్తగా వచ్చిన వ్యక్తిని మరోసారి పరిశీలనగా చూసింది. నిజంగా...అదే ముఖం, అదే రూపం...బాగా పరిచయం అయినముఖం.

అతడు కూడా సిగరెట్ పొగ వదులుతూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు... తప్పక తనను గురించే అయి ఉంటుంది.

చాలా విచిత్రమైన కలయిక. రాజేంద్ర.... తనతో బాగా పరిచయం ఉన్న రాజేంద్ర. తన భర్తకు ప్రాణ మిత్రుడా! రాజేంద్ర కాలేజీలో తన క్లాస్ మేటు.. ఇద్దరూ ఒకే సంవత్సరం బి.ఎ. పరీక్ష రాశారు... తాను ప్యాసయింది. రాజేంద్ర కాలేదు. ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు ఎంతగా ప్రేమించుకొన్నారని! జీవిత పర్యంతము ఒకరి నొకరు విడిచి ఉండ రాదనీ, కలసి జీవనయాత్ర సాగించాలనీ ప్రతిజ్ఞలు చేసుకొన్నారు... కాని... పరిస్థితులు జీవన గమ్యాన్ని, నిర్ణయాలనూ తారుమారు చేస్తాయి...గొప్ప గొప్ప నిర్ణయాలు సహితం అలాగే మిగిలిపోతాయి.

రాజేంద్ర బి. ఎ.ఫెయిల్ కాగానే వెళ్ళి మిలిటరీలో చేరాడు.అది యుద్ధ సమయం. అతన్ని వెంటనే సరిహద్దుకు పంపారు... అలా అతను దూరం అయాడు... చేసికొన్న బాసలు మాసిపోయాయి. మాట్లాడుకొన్న ఊసులు కలలుగా మిగిలి పోయాయి. ఇందులో తన దోషం ఏముంది? కులం, గోత్రం, వంశంలాంటి అన్ని విషయాల్లో పెద్దలకు వాసుతో సంబంధం నచ్చింది. అందరూ ఏకగ్రీవంగా చేసిన నిర్ణయానికి, తల్లి దండ్రుల అభీష్టానికి తల వంచి, వాసు దేవ్‌కు భార్యగా మారక తప్పలేదు.

మాధురికి వాసును ఎన్నిక చేసిన వ్యక్తి ఆమె అక్క. వాసు ఆమెభర్తకు సవతి తమ్ముడు. చూడటానికి అందంగా ఉన్నాడు. అతని స్వభావం, ప్రవర్తన, మర్యాద ఇవన్నీ చూసిన తర్వాత మాధురికి కూడా అతని పట్ల ఇష్టత ఏర్పడింది. అందుకే ఆమె తన అంగీకారం తెలిపింది.

ఆమె అలా ఊహాలోకాల్లో విహరిస్తూ గత స్మృతులను తవ్వి తీస్తోంది. అంతలో ఎదుట ఎవరో నిలబడ్డట్లు గమనించి ఉలిక్కిపడింది. తల పైకెత్తి చూసింది—

ఎదురుగా రాజేంద్ర నిలబడి ఉన్నాడు. అప్పుడే గదిలో నుండి బయటకి వచ్చిన అతడు ఆమెనే పరిశీలనగా చూస్తున్నాడు.

మాధురి గాభరాపడి పమిట సరిచేసుకొంది. తలపై ముసుగు వేసికొని వంట గదివైపు అడుగులు వేసింది. రాజేంద్ర ఆమెకు దగ్గరగా వచ్చాడు. మెల్లగా అడిగాడు-"వేడినీళ్ళు ఇప్పిస్తారా?"

మాధురి కండ్లు పైకెత్తి చూడలేక పోతోంది. నేలకేసి చూస్తూ ఆగి ఆగి నెమ్మదిగా—"ఆ... అలాగే...ఇస్తాను" అని గంగను పిలిచింది.

గంగ పరుగున వచ్చింది. "గంగా! వీరికి స్నానానికి వేడినీళ్ళు తోడు!"

"స్నానానికి కాదు. గడ్డం చేసుకోవడానికి" రాజేంద్ర చేతిలో వున్న చిన్న గిన్నెను గంగకు అందిస్తూ అన్నాడు. గంగ ఆ గిన్నె అందుకొని నీళ్ళు తేవడానికి వెళ్ళింది.

మాధురి దొంగచాటుగా అతన్ని గమనించింది. అతడు ఆమెను నఖశిఖ పర్యంతము పరిశీలనగా చూస్తున్నాడు. మాధురి అతని చూపులకు తట్టుకోలేకపోయింది. భయపడి కొంచెం దూరంలో వున్న

మరొక వరండాలోకి వెళ్ళి నిలబడింది.

మెల్లగా హాయిగా వీచే గాలితెరలు సరస్సులోని నీటితో ఆటలాడుకొంటు న్నాయి. ఆమె నుదుటిపై వచ్చి పడు తున్న ముంగురులను సవరించుకొంది. కనుచూపు మేర వ్యాపించిన సరోవరాన్ని తీక్షగా చూస్తూ ఉండిపోయింది.

"ఎంత అందమైన దృశ్యం!"

రాజేంద్ర మాటలకు ఆమె ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసింది. అతడామెకు చాల సమీపంగా వచ్చి నిలబడివున్నాడు. మాట్లాడటానికి ఆమె ఎంతగా భయపడు తోందో అతడంతగా ఆతురపడు తున్నాడు. మాధురి కండ్లు పైకెత్తి అతణ్ణి చూసింది. మళ్ళీ కండ్లు కిందకు దించివేసింది.

రాజేంద్ర మళ్ళీ అన్నాడు—

"మీరు ఎక్కడికి వెళుతున్నారు?"

"మీకు టిఫిన్ తయారు చేయడానికి" మాధురి కండ్లు పైకెత్తకుండానే జవాబు ఇచ్చింది.

"అంత తొందరేముంది? ఇంకా చాలా టైముందిగా-"

గంగ వచ్చి గదిలో నీళ్ళు పెట్టిన సంగతి చెప్పి వెళ్ళింది.

రాజేంద్ర మాధురి వైపు చూస్తూ అడిగాడు-

"మీరు...మీరు మాధురి కదూ !?"

మాధురి ఏమీ సమాధానం చెప్పలేదు. చేతి వేళ్ళ గోళ్ళు కొరుకుతూ తనలోని భయాన్ని దూరంగా పారద్రోలాలని వ్యర్థ ప్రయత్నం చేస్తోంది.

రాజేంద్ర మళ్ళీ ప్రశ్నించాడు "మీరు నన్ను గుర్తుపట్టారా?"

"నీళ్ళు చల్లారి పోతున్నాయి" అంటూ మాధురి చకచక వంట గదిలోకి వెళ్ళి పోయింది. రాజేంద్ర వెనక్కి తిరిగి తన గదిలోకి వెళ్ళాడు.

రాజేంద్ర తొలిచూపులోనే తనను గుర్తుపట్టాడు అన్న విషయం ఆమె భయాన్ని, ఆందోళనను ఎక్కువ చేసింది. అన్యమనస్కంగా టిఫిన్ చేస్తోంది. ఎవరైనా పిలిచినా గంగను పంపుతూ, తాను మాత్రం వంటగదిలోనే పనిచేస్తూ ఉండిపోయింది.

గంగ చేతికిచ్చి ఫలహారం పంపింది. వారిద్దరితో కలిసి టీ తాగే సాహసం చేయలేకపోయింది. రాజేంద్ర నోటినుండి ఏవైనా అప్రస్తుతమైన మాటలు వెలువడు తాయేమో, అది విని భర్త మనసులో ఏదైనా సందేహం కలుగుతుందేమో అని ఆమె భయపడుతోంది. కాని భర్త కోరిక మేరకు తనకు ఇష్టం లేకున్నా ఆ గదిలోకి వెళ్ళక తప్పటం లేదు.

రాజేంద్ర ఆమె భయాన్ని గమనిం చాడు. ఆమె విచారంగా ఉండటం చూసి అతని మనసులో ఏదో తెలియని ఉత్కంఠ రేగింది.

మాటల మధ్యలో వాసు తనకు, రాజేంద్రకు మధ్య ఉన్న స్నేహాన్ని గురించి తెలిపాడు. ఇద్దరం సైన్యంలో కలిసి మెలిసి ఎంతో స్నేహంగా ఉండే వాళ్ళమనీ, కలిసి యుద్ధంలో పాల్గొన్నా మనీ, ఖైదీలుగా చిక్కామనీ చెప్పాడు.

మాధురి కప్పులలో టీ పోస్తూ ఉంది. రాజేంద్ర ఆమెకు సహాయంగా పాలగిన్నె ముందుకు జరుపుతూ అన్నాడు- "ఈ రోజు మా కలయిక ఎన్ని సంవత్సరాల తర్వాతదో మీకు తెలుసా?"

ఆమె మౌనంగా ఉండిపోయింది. రాజేంద్ర తన ప్రశ్నకు జవాబుగా అన్నాడు- "అయిదు సంవత్సరాల

 

తర్వాత కలిశాం".

మాధురి తల పైకెత్తి చూసింది. స్నేహితులిద్దరూ నవ్వుతున్నారు. ఇద్దరి ముఖాల్లో ప్రసన్నత ఉంది. "రాజూ! ఇన్నేళ్ళ తర్వాత కలిశాం. కానీ నాకు మాత్రం మనం వేరు కాలేదనిపిస్తోంది" వాసు టీ కప్పు చేతిలోకి తీసుకొంటూ అన్నాడు.

"మనసులో నిజమైన ప్రేమ ఉంటే ఎవరికైనా అలాగే అనిపిస్తుంది'' రాజేంద్ర భావగర్భితంగా మాధురివైపు చూస్తూ వాసుకు సమాధానం ఇచ్చాడు.

మాధురి రాజేంద్ర మాటల్లోని వ్యంగ్యాన్ని గ్రహించింది. ఆమె శరీరం కొద్దిగా కంపించింది. చేతిలోని టీ కప్పు వణికింది. వాసు, రాజేంద్ర ఇద్దరూ ఆమెను చూసి నవ్వసాగారు. వాళ్ళ నవ్వు పదునైన కత్తిలాగా ఆమె గుండెల్లో దిగబడి అంతులేని వేదనకు గురిచేసింది. అయినా ఆమె మౌనంగా ఉండిపోయింది.

వాసు నవ్వును బలవంతంగా ఆపుకొంటూ అన్నాడు— ''పెండ్లి అయి మూడేండ్లుదాటినా మాధురిలో ఆ బిడియం, ఆ వణుకు ఇంకా తగ్గనే లేదు. మొదటి రోజు ఎలా ఉందో ఇప్పుడు కూడా అలాగే ఉంది''

మాధురి సిగ్గుపడింది. అక్కడి నుండి వెళ్ళడానికి సిద్ధం అయి లేచింది. రాజేంద్ర ఆమె వైపే చూస్తూ అన్నాడు- ''ఇలా కొద్దిగా బిడియ పడటం, సిగ్గు పడటమే స్త్రీకి అందాన్నిస్తుంది...అయితే, ఇది ఎంతో కాలం ఉండదులే..."

"ఎందుకని?"వాసు వెంటనే అడిగాడు.

అతడు జవాబుగా ఏమి చెప్తాడో వినాలనే కుతూహలంతో మాధురి కూడా ఆగింది.

''ఒకరిద్దరు పిల్లలు పుట్టి, ఆడుతూ పాడుతూ తిరుగుతుంటే ఈ జంకు, వణుకు అన్నీ పోతాయి"

ఈ మాటలు విన్న వాసు చకితుడై అతనివైపు చూడలేక చూపులు పక్కకు మరల్చాడు. అతనికి తలమీద అకస్మాత్తుగా పెద్దమంచుగడ్డ పెట్టినట్లయింది. తన మాటలు సమయానుకూలంగా లేవనీ, ఎదుటివాళ్ళకు బాధ కల్గించాయనీ గ్రహించిన రాజేంద్ర మౌనం వహించాడు.

మాధురి తల వంచుకొని వంటగది వైపు వెళ్ళింది.

ఆమె వంట గదిలో ప్రవేశించగానే మళ్ళీ ఇద్దరూ కలిసి పెద్దగా నవ్వుతున్న శబ్దం వినిపించింది. ఆమె క్షణంసేపు ఆగి విన్నది-

స్నేహితుల నవ్వులతో ఆ ప్రదేశమంతా మారుమోగుతోంది.




''గంగా! మాధురిని త్వరగా రమ్మని చెప్పు"

మాధురి వాసు మాటలు విన్నది. గంగ వచ్చి విషయం చెప్పకముందే బయటి ఆవరణలోనికి వచ్చింది. గంగ ముందుకు వచ్చి ఆమె చేతుల్లోని టిఫిన్‌ను, బుట్టను అందుకొంది. బయట ముంగిట్లో వాసు, రాజేంద్ర ఆమె రాకకై ఎదురు

చూస్తున్నారు.

ఈ రోజు వాళ్ళు పిక్నిక్ ప్రోగ్రాం వేసుకొన్నారు. మాధురి మొదట వాళ్ళ వెంట వెళ్ళేందుకు ఇష్టపడలేదు. కాని, వాసు ఆదేశాన్ని, రాజేంద్ర అభ్యర్థనను కాదనలేకపోయింది.

రాజేంద్ర ఇక్కడికి వచ్చి రెండు రోజులు గడిచిపోయాయి. ఇది మూడవ రోజు. ఈ మూడు దినాల్లో మాధురి అతనికి ఎన్నోసార్లు ఒంటరిగా తటస్థ





పడింది. కాని ప్రతిసారీ ఆమె ఏదో ఒక సాకు చెప్పి అతనితో మాట్లాడకుండా తప్పించుకొంటూ వస్తోంది. వాసు సమక్షంలోనే ఏ మాటలయినా మాట్లాడటం మంచిదని ఆమె భావించింది. కారణం ఏమోగానీ రాజేంద్రతో మాట్లాడడానికి, అతని ఎదుట నిలబడటానికి ఆమె భయపడుతోంది.

ఈరోజు కూడ ఆమె వాళ్ళవెంట వెళ్ళడానికి జంకుతోంది. వాళ్ళిద్దరూ ఏదో మాట్లాడుతూ ముందు నడిచిపోతున్నారు. ఆమె వాళ్ళ వెనకే కొన్ని గజాల దూరంలో ఆలోచనల్లో లీనమై మెల్లగా అనుసరిస్తోంది. వాళ్ళు ఎప్పుడైనా ఆగి ఆమెను ఏదైనా ప్రశ్న అడిగితే ఆమె వాళ్ళవైపు కల చెదిరిపోయిన దానిలాగా, ఎవరో అకస్మాత్తుగా తట్టి నిద్ర లేపినట్లుగా ఆశ్చర్యంగా చూస్తోంది.

ముగ్గురూ పడవలో సరస్సు దాటుతున్నారు. ముగ్గురూ మౌనంగా ఉన్నారు. ఆ నిశ్శబ్ద వాతావరణంలో తెడ్ల చప్పుడు మాత్రం వినిపిస్తూ ఉంది. వాళ్ళను చూస్తుంటే బొత్తిగా పరిచయంలేని ముగ్గురుయాత్రికులు అక్కడే ఆ క్రొత్త ప్రదేశంలో మొదటిసారిగా కలుసుకొన్నట్లూ, ఎవరితో ఏమి మాట్లాడాలో తోచక అలా మౌనంగా ఉన్నట్లూ అనిపిస్తుంది.

వాసు నావకు ఒక చివర్న కూర్చు

న్నాడు. రాజేంద్ర రెండో అంచున కూర్చొని ఉన్నాడు. మాధురి మధ్యలో కూర్చొని త్రాసులోని ముల్లులా ఆ పద వను సమ తూకంలో ఉంచుతోందా అని పిస్తోంది ... ఆమె బిడియపడుతున్న ట్లుగా, దిగులుగా, దీర్ఘాలోచనల్లో ముడుచు కొని కూర్చొంది. రాజేంద్ర ఈ విషయం పసిగట్టాడు. అతడు ఆమెతో చూపులు కలిసినప్పుడల్లా పలకరింపుగా, చిరునవ్వు నవ్వుతున్నాడు. చల్లగా వీచే పిల్లగాలులు ఆమె నుదుటిపై పడుతున్న ముంగురులతో ఆడుకొంటున్నాయి. ఆమె చేతితో వాటిని సరిచేసుకొంటోంది. కాని అవి మళ్ళీ చెదరిపోయి ఆమె నుదుటిపైన, చెంపలపైన పడుతున్నాయి. వాటిని సవ రించుకొనే సమయంలో ఆమె చూపులు అప్రయత్నంగా రాజేంద్ర చూపులతో కలిసేవి. ఆమె వెంటనే సిగ్గుతో తల కిందకు వంచేది.

మాధురీ !"

"ఆ..!" రాజేంద్ర పిలుపుకు ఉలిక్కి పడి ఆమె అతనివైపు తిరిగి చూసింది.

"ఏమిటి ఈరోజు ఏదో దీర్ఘాలోచ నలో మునిగిపోయావు ?"

"నేనా... ఏమీ లేదే !"

"నేనూ అదే అడగాలనుకొంటు న్నాను" వాసు మిత్రుని ప్రశ్నను సమర్థిస్తూ అన్నాడు.

రాజేంద్ర మాటలు విన్న మాధురి తన భయాన్ని దూరంగా పారద్రోలే ప్రయత్నంలో చిన్నగా నవ్వింది. ఇప్పటి దాకా బిగించుకొని ఉన్న ఆమె పెదాలు కొద్దిగా విచ్చుకొన్నాయి. "కాని, నువ్వు కూడా ఎవడో కొత్తవాడిలా మౌనంగా కూర్చున్నావే ?" వాసు రాజేంద్రతో అన్నాడు.

"ఈమెను గురించే ఆలోచిస్తూ ఉన్నాను"

"ఏమిటి ?" వాసు వెంటనే అడిగాడు. మాధురి చెవులు కూడా రాజేంద్ర చెప్ప బోయే సమాధానం కోసం ఎదురు చూస్తు న్నాయి. రాజేంద్ర క్షణంసేపు ఆగి అన్నాడు— "ఈమెను చాలా సంవత్స రాల క్రితం ఎక్కడో చూశానని అని పిస్తోంది"

"అందుకేనేమో అలా భయపడుతూ, బిడియపడుతూ..."

వాసు మాటలు పూర్తి కాకుండానే మధ్యలోనే రాజేంద్రవైపు కోపంగా, తీవ్రంగా చూస్తూ మాధురి అన్నది— "మీరు కాకమ్మ కథలు చెప్పడం ఎందుకు? మనిద్దరం కాలేజీలో సహాధ్యాయులం అని చెప్తే సరిపోతుంది కదా !"

కంపిస్తున్న ఆమె కంఠస్వరం విన్న రాజేంద్ర ఫక్కున నవ్వాడు. బలవంతాన నవ్వు ఆపుకొని వాసుతో అన్నాడు— "చూశావా.. నేను నీతో చెప్తున్న మాటలు నిజం అయ్యాయి. నీ భార్యను నేను ఎక్కడో చూశాను అన్న విషయం స్పష్టంగా రుజువైంది"

"ఇది మరీ బాగుంది...మరి ఈ రెండు దినాలు మీరు అపరిచితుల్లాగా ఎందుకు ప్రవర్తించారు ?"

"ఆమె నన్ను గుర్తుపడుతుందిలే అనుకొన్నాను."

"ఆయన నన్ను గుర్తుపట్టలేదేమో, ఇప్పుడు బలవంతాన గుర్తుచేయడం ఎందుకులేఅని నేను భావించాను" ఆ గంభీర వాతావరణంలో నవ్వుల జల్లు కురిపిస్తూ మాధురి అన్నది.

ఇద్దరూ పెద్దగా నవ్వారు. వాసు స్నేహితుని వైపు చూస్తూ అన్నాడు.




"భలే...భలే...విచిత్రమైన కలయిక... నీవేమో నా స్నేహితుడిగా ఇక్కడకు వచ్చావు. కానీ నాకంటే ముందే మాధురితో నీకు బాగా పరిచయం ఉంది అని తెలిసిపోయింది."

"అది నా అదృష్టం...ఇప్పుడిహ రెండింతల ఆదర సత్కారాలకు పాత్రుడినన్నమాట— ఇటు నీ ద్వారా, అటు నీ అర్ధాంగి ద్వారా. అవునా వదిన గార్లూ ?"

'వదినా' అన్న సంబోధన వినగానే మాధురి చటుక్కున తల పైకెత్తి తన భర్తను, రాజేంద్రను మార్చి మార్చి చూసింది. ఇద్దరి పెదాలపై చిరునవ్వు ఉంది. ఒకరిలో భూతకాలపు తళుకు ఉంది, మరొకరిలో భవిష్యత్కాలపు బెళుకుఉంది. ఆమె మళ్లీ మొదటిలా మౌనంగా ఉండి పోయింది. నావ కదలిక మూలంగా ఏర్పడి అంతలోనే మాయమౌతున్న కెరటాలను తదేకంగా చూసోంది.

నీలాకాశంలో అక్కడక్కడ తేలి యాడుతున్న మబ్బులు, నిర్మలంగా నిశ్చలంగా ఉన్న చెరువు నీటిలో కెరటాల దాగుడు మూతలు, పంక్తిగా ఆకాశంలో ఎగురుతున్న తెల్లని కొంగలు అతి సుందర దృశ్యాన్ని కన్నుల ముందు నిలుపుతున్నాయి. ఇప్పుడు ముగ్గురూ మాటల్లో భాగం పంచుకొంటున్నారు. ఆ ఇద్దరూ ఏదైనా విషయం మొదలు పెడితే మాధురికి కూడా వాళ్ల మాటల్లో పాలు పంచుకొనక తప్పడం లేదు.

ఒక గంట ప్రయాణం చేసిన తర్వాత పడవ చెట్లు, పొదలు, పచ్చిక దట్టంగా వున్న చోటుకు చేరింది. ముగ్గురూ పిక్‌నిక్ సామగ్రి దించి దగ్గరలోనే చుట్టూ గడ్డితో కప్పబడి ఉన్న ఒక పెద్ద అరుగుమీద పెట్టి వచ్చారు. క్రింద పచ్చగా పెరిగిన గడ్డి, తివాచీలాగా మెత్తగా ఉంది. అలాంటి అరుగులు అక్కడ చాలా ఉన్నాయి. అవి ఎండ, వానల నుండి రక్షించుకునేందుకు అనుకూలంగా ఉన్నాయి.

సామాన్లు అక్కడ పెట్టిన తర్వాత చెరువులో స్నానం చేయాలని నిర్ణయించారు. మాధురినికూడా వెంట రమ్మన్నారు. కానిమాధురి రానన్నది. వెంటనే రాజేంద్ర అడిగాడు–

"మీరు ఎందుకు రారు ?"

"నాకు ఈదటం చేతకాదు" ఆమె నెమ్మదిగా జవాబిచ్చింది.

"వాసుదేవ్ ఈత కూడా నేర్పలేదా?"

"తనకే ఈత సరిగా రానివాడు ఎదుటి వాళ్ళకు ఏం నేర్పగలడు?" వాసు మధ్యలో కల్పించుకొని అన్నాడు. అతని మాటలకు ఇద్దరూ సిగ్గు పడ్డారు.

కొంచెం సేపు మౌనంగా ఉన్న తరు వాత రాజేంద్ర మళ్ళీ అన్నాడు–

"నాకు ఏమీ అర్థంకావడంలేదు."

"ఏమిటి ?" వాసు ప్రశ్నించాడు.

"నేను ఇక్కడికి వచ్చినప్పటి నుండి మీరిద్దరూ ముభావంగా, గంభీరంగా, ఏదోలా కనిపిస్తున్నారు. మీలో ఏదో విషయం మీద అభిప్రాయభేదాలు వచ్చి నట్లుంది."

"అదేం లేదు రాజూ ! నీకు తెలి యదు... చూసేవాళ్ళకు మాలో భేదం ఉన్నట్లూ, ఒకళ్లకొకరం వ్యతిరేకంగా ఉన్నట్లూ అనిపిస్తుంది. కాని వాస్తవంలో మా మనసులు కలిసే ఉంటాయి... ఔనా మాధురీ ?" వాసుదేవ్ ఒక క్షణం ఆగి మాధురి చేతిని తన చేతిలోకి తీసు కొని దగ్గరికి లాక్కొంటూ అన్నాడు–

"ఈత నేర్చుకొంటావా ?"

"ఊహు !"

"కాదు వదినా ! మా వెంట నీవూ రావలసిందే. తప్పదు."

"వద్దు... వద్దు... నేను ముందే చెప్పలేదా, నాకు నీళ్ళలో దిగడం అంటే భయమని."

"నేను పక్కనే ఉంటాగా - నీళ్ళలో మునిగిపోనిస్తానా !" వాసు ఆమెను ఇంకా దగ్గరికి లాక్కొన్నాడు.

ఇద్దరు స్నేహితులూ పెద్దగా నవ్వుతూ ఆమెను తమ వెంట లాక్కొని వెళ్ళారు.

చెరువు గట్టుకు వెళ్ళి మాధురి మళ్ళీ ఆగిపోయింది. కాని వాసు ఆమెను నీళ్ళ లోకి లాగాడు. నీళ్ళలోకి దిగగానే మాధురి కెవ్వున కేక వేసింది. ఆమె నీళ్ళలో మునుగుతూ తేస్తోంది. స్నేహితు లిద్దరూ కలసి చెరో చెయ్యి పట్టుకొని ఆమెను పైకి లేపి నిలబెట్టి మునగకుండా కాపాడారు. ఆమె భయంతో కాళ్ళు చేతులు ఆడిస్తుంటే వాళ్ళిద్దరూ పక పక నవ్వ సాగారు.

వాసు ఇంకా లోతుకు వెళ్లాలన్నాడు. మాధురి ససేమిరా రానన్నది. ఆమెను, రాజేంద్ర దగ్గర వదిలి వాసు ఈదు కుంటూ ముందుకు వెళ్లాడు. రాజేంద్ర ఆమె భుజాలు రెండూ పట్టుకొని మెల్ల మెల్లగా ఈత నేర్పుతున్నాడు. మాధురి చాలా అలసిపోయింది, గట్టిగా ఊపిరి పీల్చి వదులుతోంది, ఆయాసపడుతూ అతన్ని బతిమిలాడుతోంది- "ఇక చాలించండి...!"

"ఇప్పుడే అధైర్యపడితే, ఈత ఎలా నేర్చుకుంటావు ? ఆయనకు సహాయం అవసరంలేదు. నీకే సహాయం కావాలి"

కొన్ని క్షణాలు మౌనంగా ఉన్న తర్వాత మాధురి అడిగింది "మీరెందుకలా మా ఇద్దరిలో ఏదో భేదాభిప్రాయా లున్నాయి అన్నారు !"

"అది నా సందేహం మాత్రమే. కానీ నా సందేహాలు తరచుగా నిజాలు ఔతుం టాయి" రాజేంద్ర చెయ్యి చాపి ఒడ్డును పట్టుకొన్నాడు. తర్వాత నీళ్ళలో నుండి బయటికి వచ్చాడు. మాధురి కూడా బయటకి రాబోయింది. కాని రాజేంద్ర ఆమెను వారించాడు. ఒడ్డును పట్టుకొని ఈదడం నేర్పసాగాడు.

"మాధురీ! ఒక విషయం చెప్తావా?"

"ఏమిటి ?"

"నన్ను ఇక్కడ మొదటిసారి చూసి నప్పుడు నీవు ఎందుకలా గంభీరంగా మారిపోయావు ?"

"నేనేమీ మారలేదే... ?"

"వాసుకు భయపడ్డావా...?

"మీకు తెలియదా పెండ్లి అయిన తర్వాత స్త్రీకి కొన్ని కర్తవ్యాలు, కొన్ని బాధ్యతలు ఉంటాయని"

"నేను నిన్ను కర్తవ్యం మరచి పొమ్మని ఎప్పుడన్నాను?"

"మరచిపోవాల్సి వస్తుందేమో ! మీ మగ జాతిని ఎలా నమ్మడం ?"

"ఎందుకని అలా అంటున్నావు ?"

"ఊరికనే... మనసుకు అలా అని పించింది."

"మనసు పవిత్రంగా ఉంటే చాలు. ఎవరూ వేలెత్తి చూపడానికి కూడా సాహసం చేయరు. ఇప్పుడు నీ సంగతే ఆలోచించు. నీవు నా దగ్గర ఉన్నావు... నీ భర్త చాల దూరాన, చూపుకు అంద నంత దూరాన ఉన్నాడు."

"ఆయన మనసులో ఎన్ని సుడి గుండాలు తిరుగుతున్నాయో మీకేం తెలుసు ? అతి చల్లగా ఉన్న ఈనీళ్ళలో

 

కూడా ఆయన మనసు కాలిపోతూ ఉండ వచ్చు."

మాధురి మాటలు వినగానే రాజేంద్ర శరీరంలో నీరసం ఆవరించింది. అతని చేయి వదులైంది. మాధురి నీళ్ళలో మునిగిపోసాగింది. రాజేంద్ర చటుక్కున చేయి పట్టుకొని ఆమెను ఒడ్డుకులాగాడు. పచ్చని మైదానం మధ్యలో తెల్లగా, శోభాయమానంగా ఉన్న ఆమె వంపులు తిరిగిన శరీరం– అప్పుడే నీళ్ళలో కడిగి ఒడ్డున నిలబెట్టిన పాలరాతి విగ్రహంలా ఉంది. రాజేంద్ర నిమిషం పాటు ఆమెను పరిశీలనగా చూశాడు. తర్వాత చూపులు మరల్చుకొని చెరువు నీటివైపు చూస్తూ అన్నాడు – "మాధురీ! వెంటనే బట్టలు మార్చుకో. లేకపోతే జలుబు చేస్తుంది"

ఈ మాటలని అతడు నీళ్ళలోకి దూకాడు. మాధురి ముడుచుకుపోయి, చలికి వణుకుతూ నిలబడింది. అతడు నీటిలో ఈదుకొంటూ దూరంగా, బహుశ వాసు వైపుగా పోతున్నాడు.

ఆకాశంలో ఉన్న చిన్న చిన్న మబ్బులన్నీ ఏకమై పెద్ద మేఘంగా ఏర్పడుతున్నాయి. ఒకవైపు నుండి కారు మేఘం కమ్ముకొని వస్తోంది. కుంభ వర్షం కురిసే సూచనలు కనిపిస్తున్నాయి. మాధురి చలికి ముడుచుకొనిపోయి అరుగు దగ్గరకు వెళ్ళింది. తువ్వాలుతో ఒళ్ళు తుడుచుకోసాగింది.

స్నేహితులిద్దరూ బాగా ఈది, అలసిపోయి తిరిగి వచ్చేసరికి మాధురి కాఫీ సిద్ధం చేస్తోంది. ఆమె నల్లని వెంట్రుకలు భుజాలపై అటు ఇటు ఊగుతూ త్రాచు పాములను గుర్తుకు తెస్తున్నాయి. పమిట కొంగును భుజాలపైకి తెచ్చుకొని స్టౌ సరి చేస్తోంది.

మాధురి మూడుకప్పుల్లో కాఫీ పోసింది. అందరూ కూర్చొని తాగుతున్నారు. పెండ్లి అయినప్పటికి మాధురిలో ఏమి మార్పు రాలేదని రాజేంద్రకు అనిపిస్తోంది. ఆమె ఇప్పుడు కూడా ఒకనాటి కాలేజి గర్ల్ మాధురిలాగే కనిపిస్తోంది. చంచలత్వం స్థానంలో గాంభీర్యం వచ్చేసింది. అంతే!

ఇక్కడికి వచ్చినప్పటి నుండి అతని మనసును ఒకే ఆలోచన వేధిస్తోంది. భార్యాభర్తల మధ్యలో అగాథంలా ఏర్పడి, వాళ్ళ మనసుల్లో అశాంతిని నింపుతున్న ఆ వింత రహస్యం ఏమిటి? యవ్వన ప్రాయంలో ఉన్న ఇతర దంపతుల్లాగా కలసి మెలసి నవ్వుతూ, సరసాలాడుతూ ఉండటం లేదు. ఎందుకని? మాటల మధ్యలో ఈ రహస్యం తెలుసుకోవాలని ఒకటి రెండు సార్లు ప్రయత్నించాడు. కాని మాధురి ఏదో ఒక సాకుతో విషయం మార్చేది.

ఉన్నట్టుండి పెద్ద వర్షం మొదలైంది. వాళ్ళు చెట్లకింద నిలబడ్డారు. చెట్లు ఆ పెద్ద వర్షాన్ని ఆపుకోలేకపోయాయి. సామాన్లను సర్దుకొని దగ్గరలోనే ఉన్న ఒక పురాతన కట్టడంలోకి పరుగు తీశారు. అదొక మహలు. చాలా గదులున్నాయి. రాజేంద్ర ఆ ప్రాచీన మహలును వివరంగా చూడాలనుకున్నాడు. వాసును రమ్మని బలవంతం చేశాడు. కాని చాల సేపు ఈదినందువల్ల వాసు బాగా అలసిపోయాడు. మాధురివైపు చూసి "నువ్వు వెళ్ళరాదూ రాజేంద్రకు తోడుగా" అన్నాడు.

"మీరు కూడా రండి" మాధురి అన్నది.

"ఈ శిథిలాలూ, పడిపోయిన మంది రాలూ చూడటంలో నాకు అంత ఆసక్తి లేదు"

"ఏం ?" రాజేంద్ర అడిగాడు.

"నేనిలాంటివి ఎన్నో చూశాను. నేను ఇక్కడ కూర్చొని వర్షాన్ని చూస్తుంటాను. మీరు వెళ్ళి చూసి రండి"

రాజేంద్ర బట్టలు మార్చుకొని వెళ్ళ డానికి సిద్ధం అయ్యాడు. అతడు కొంచెం సేపు మాధురి కోసం ఎదురు చూశాడు. ఆమె ఉన్నచోటు నుండి కొంచెమైనా కదలకపోయేసరికి ఎవరినీ పిలవకుండానే ఒంటరిగా నడిచి వెళ్ళాడు. వాసు మొదట రాజేంద్రను, తర్వాత మాధురిని చూస్తూ అన్నాడు- "నీవు కూడా వెళ్ళకూడదూ! అతడు ఒంటరిగా వెళ్ళాడు. ఎవరమూ రాలేదని అనుకొంటాడేమో !"

"నన్నేం చేయమంటారు ?"

"అతడు మన అతిథి. పరాయివాడు కాదు. నాకు ఎంత స్నేహితుడో, నీకు కూడా అంతే గదా!"

"ఊ..." మాధురి లేచి, రాజేంద్రను అనుసరించింది. ఆమెకు మనసులో రాజేంద్ర వెంట వెళ్ళాలనీ, కొంచెంసేపు సరదాగా గడపాలనీ కోరిక ఉన్నా, భర్త ఎదుట మాత్రం తన మనసులోని కోరికను బహిర్గతం చేయడం ఇష్టంలేదు. శిథిలాల లోకి ప్రవేశించే ముందు ఆమె వెనక్కు తిరిగి భర్తవైపు ఒకసారి చూసి మెల్లగా ముందుకు నడిచింది. వాసు వర్షాన్ని, ఆకాశాన్ని, భూమితో కలిపే వర్షపు ధార లనూ చూస్తూ కూర్చున్నాడు.

మహల్ లోపల అంతటా చిక్కని చీకటి వ్యాపించి ఉంది. అక్కడక్కడా గోడలకు ఉన్న చిన్న కిటికీల గుండా వెలుగు కిరణాలు కొద్దిగా లోపల ప్రవే శిస్తున్నాయి. రాజేంద్ర చాలా ముందుకు పోయినట్లుంది, ఆమె కండ్లు పెద్దవిచేసి, పరిశీలనగా చూస్తూ, నెమ్మదిగా అడు గులు వేస్తోంది. ఎక్కడా రాజేంద్ర జాడ లేదు.

ఆమె ఒక మూల దక్కన ఆగి పోయింది. చిమ్మ చీకటిలో తన పక్కన ఏదో నీడ ఉన్నట్లు భ్రమ కలిగింది. భయంతో ఆమె రక్తనాళాలు ఎండి పోయాయి. ఆమె వెనక్కు తిరగాలని మెల్లగా కదిలింది. అంతలోనే పెద్ద పొగ ఆ నీడను కమ్మివేసింది.

మాధురి భయంతో అరచింది.

"భయపడ్డావా ?"

"ఓహ్, మీరా ! నేను... నేను... ఏదో..."

"భూతం అనుకున్నావా ?"

"మీరిక్కడ నిలబడి ఏంచేస్తున్నారు?"

"నీ కోసం నిరీక్షిస్తున్నాను"

"నేను వస్తానని మీకెలా తెలుసు?"

"నా మనసు చెప్పింది"

"ఆయన బలవంతం చేసి పంపారు. లేకపోతే నేను వచ్చేదాన్ని కాదు"

"అబద్ధం... అతడు నీ శరీరాన్ని మాత్రమే పంపాడు. నీ మనసు నా వెంట రావడానికి మొదటి నుండీ సిద్ధంగానే ఉంది"

అతని మాటలు విన్న మాధురి దొంగ తనం చేస్తుండగా పట్టుబడిపోయిన దొంగలా సిగ్గుపడి ముఖాన్ని పక్కకు తిప్పుకొంది. రాజేంద్ర ఆ మసక వెలు తురులో ఆమెను చూశాడు. దగ్గరగా వచ్చి మంద్ర స్వరంతో అన్నాడు—

"నేనన్నది అబద్ధమా ?"

"ఎందుకు కాకూడదు...!"





"కాని... నీవు నన్నింత తొందరగా మరచిపోయావంటే నాకు నమ్మశక్యం కావడం లేదు. నన్నెలా మరచి పోగలి గావు ?"

"సరే.. ముందుకు పదండి ! నాకు ఇక్కడ ఊపిరి ఆడటం లేదు" అని, మాధురి ముందుకు అడుగులు వేసింది. రాజేంద్ర ఆమె భుజం మీద చెయ్యివేసి ముందుకు పోకుండా ఆపాడు.

ఆమె ఆపాదమస్తకం కంపించింది. రాజేంద్ర ఆమె చూపుల్లో చూపులు కలిపి అదే ప్రశ్నను మళ్ళీ అడిగాడు.

"మీరు ఇలాంటి మాటలు మాట్లాడ కూడదు. నేనిప్పుడు మరొక వ్యక్తికి ఇల్లాలిని" మాధురి అతనికి దూరంగా జరిగి అన్నది.

"ఆ విషయం నేను మాత్రం ఎప్పుడు కాదన్నాను. కాని, నీవు నాపట్ల ఎందు కింత విచిత్రంగా, పరాయిదానిలాగా ప్రవర్తిస్తున్నావు?"

"అంటే...?"

"నీ మనసులో సహజంగా ఉన్న భావాలను అణచుకొని..."

"మనసులో...భావాలు...మనసులో ప్రత్యేక భావాలు ఏముంటాయి."

"ఏదో ఒక రహస్యం...తెలియని బాధ..."

"బాధా..." మాధురి నోటి నుండి ఈ మాటతో పాటు నిట్టూర్పు వెలువడింది.

"అవును మాధురీ...! నేను ఇక్కడికి వచ్చినప్పటి నుండి చూస్తున్నాను. నీవు ఏదో బాధతో మునిగి ఉన్నట్లుగా కని పిస్తున్నావు...ఏదో గొప్ప వేదన నీలో దాగి ఉన్నట్లుగా, విషాదమూర్తిలా కని పిస్తున్నావు."

"పదండి...మీకు శిథిలాల విశేషాలు చూపిస్తాను."

"వద్దు...! ముందు నీ మనసులో ఏర్పడిన శూన్యాన్ని చూడాలని నాకు చాలా కోరికగా వుంది."

"మీరిక్కడ ఇంకా కొన్ని రోజు లుంటారుగా ?"

"అవును."

"మెల్లమెల్లగా మీరే అన్ని సంగతులు తెలుసుకొంటారు."

"అంతే గాని నీవు మాత్రం ఏమీ చెప్పవా?"

"చెప్తాను...కాని ఇప్పుడు కాదు... పదండి పోదాం" మాధురి తన చేతిని రాజేంద్ర చేతికి అందించింది.

ఒకరి చేతిలో మరొకరి చేయి ఇమడ గానే ఇద్దరిలో ఏదో తెలియని వింత అనుభూతి ఇద్దరికీ ఒడలు గగుర్పొడిచే టట్లు చేసింది. వాళ్ళు ముందుకు సాగి పోయారు.

ఆ పాడుబడిన మహలు బాబరు చక్రవర్తి కాలం నాటిది. కొండను నరికి అక్కడ ఒక పెద్ద దుర్గం నిర్మించ బడింది. దాంట్లో ఒక పెద్ద సైన్యాన్ని ఉంచవచ్చు. దూరానికి ఆ ప్రదేశం ఒక కొండలాగా మాత్రమే కనిపిస్తుంది. మాధురి ఆ కోటను గురించీ, సైనికం గానూ, చారిత్రకంగానూ దాని ప్రాశ స్త్యాన్ని గురించీ వివరిస్తోంది. అతను ఆమె ముఖాన్నే పరిశీలనగా చూస్తూ మెల్లగా ముందుకు అడుగులు వేస్తున్నాడు. తాను చూడని మనోహర దృశ్యాలను మనసులో ఊహించుకొంటున్నాడు. పెండ్లి అయిన కొత్తలో మాధురి, వాసుతో కలసి ఈ ప్రదేశంలో ఈ చీకటి గుహల్లో తిరిగి ఉంటుంది. ఈ అంధకారం, ఈ ఏకాంతం, పైగా కొత్తగా పెండ్లి అయిన

యువతీ యువకులు ఆనంద లోకాలు చూపించడానికి అంతకు మించిన అవకాశం ఏముంటుంది. వాళ్లు ఈ చీకటి గుహల్లో ఏదో ఒక మూల తప్పకుండా గాఢాలింగనంలో కొద్ది నిమిషాలు గడిపి ఉంటారు.

కాలికి ఏదో రాయి కొట్టుకోవడంతో రాజేంద్ర ఆలోచనలకు అంతరాయం ఏర్పడింది. మాధురి మౌనంగా నిలబడి అతని వైపు చూస్తోంది. అతని పరధ్యానాన్ని, ఆలోచనలతో నిండిన ముఖాన్ని చూసి ప్రశ్నించింది.

"ఏమిటో దీర్ఘాలోచనలో పడ్డారే మీరు?"

"ఏమీలేదు...నీవు ఏమని చెప్పావు. ఈ మహలు అశోక చక్రవర్తి కట్టించాడు"

"అశోకుడా!?" ఆమె ఫక్కున నవ్వింది. రాజేంద్ర కూడా తన పరధ్యానానికి సిగ్గు పడ్డాడు మాధురి అన్నది "మీరు దేన్ని గురించి అంత తీవ్రంగా ఆలోచిస్తున్నారు?"

"నిన్ను గురించే ఆలోచిస్తున్నాను"

"ఏమని?" ఆమె ఆసక్తిగా అడిగింది.

"స్వర్గంలాంటి ఈ ప్రదేశంలో జీవితం గడుపుతున్న నీవు ఎంతటి అదృష్టవంతురాలివో కదా అని ఆలోచిస్తున్నాను"

"మీరేమనుకుంటున్నారు ? నేను ఈ స్వర్గంలో ఎలాంటి జీవితం గడుపుతున్నానని మీరు భావిస్తున్నారు?"

"అత్యంత సుందరమైన ఈ ఏకాంతం మనసులు దోచుకునే ఈ మనోహర దృశ్యాలు, మంచి తోడు ఇంకేం కావాలి నీకు ఇంతకంటే?"

"అవన్నీ సరే నాకు ఒకటి మాత్రం ఎంత ప్రయత్నించినా దొరకడంలేదు. అదే నా బాధ"

"ఏమిటది?"

"మృత్యువు"

మాధురి ఈ మాట చెప్పి చూపులు పక్కకు తిప్పుకొని చూస్తూ ఉండి పోయింది. ఆమె మెల్లగా అడుగులు వేస్తూ ఒక గోడ దగ్గరికి వెళ్ళి నిలబడింది. ఆ గోడలో నుండి బొట్లు బొట్లుగా నీరు కింద పడుతోంది. ఆమె చేతి వ్రేళ్ళతో ఆ తడిగోడ మీద బొమ్మలు వేస్తోంది.

ఆమె ప్రత్యుత్తరం రాజేంద్రకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. అతడు ఆమె మనసు లోతులను గ్రహించాలని ప్రయత్నిస్తున్నాడు. ఆమె నుండి అలాంటిదే ఏదో జవాబు వస్తుందని అతడు ఆశించాడు. అయితే భార్యా భర్తల ఇద్దరి మధ్య ఇలాంటి భేదాభిప్రాయాలు ఏర్పడటానికి ఇద్దరి జీవితాల్లో అర్థంకాని అసంతృప్తి చోటు చేసుకొని జీవితాన్ని దుర్భరం చేయడానికి కారణం ఏమిటో గ్రహించలేక పోయాడు.

అతడు మెల్లగా ఆమెను సమీపించాడు. ఆమె భుజంమీద చెయ్యి వేసి ఆమెను పిలిచాడు"

"మాధురీ!"

మాధురి పక్కకు తిరిగి అతణ్ని చూసింది. ఎదురుగా ఉన్న గోడలనుండి నీరు ఏ విధంగా బొట్లు బొట్లుగా పడుతోందో ఆమె కండ్లనుండి కూడా కన్నీటి బొట్లు అలాగే పడ్డాయి. అతడు ఏళ్ళ తరబడి వియోగ బాధను అనుభవిస్తున్నాడు మాధురి కూడా ఎంతో కాలంగా బాధను మౌనంగా సహిస్తూ ఉండి పోయింది.

ఆతడు గోడ వైపు దృష్టి మరల్చి, దానిమీద నీటితో రాసిన అక్షరాలు

చదివాడు.

'మృత్యువు'.

ఈ మాట చదివి అతడు అడిగాడు–

"ఏమిటిది మాధురీ! ఎందుకు ఏడు స్తున్నావు ?"

"ఏమీ లేదు" ఆమె పమిటతో చెంపల పైకి వచ్చిన కన్నీరు తుడుచుకుంటూ అని, బయటి వైపుకు అడుగు వేసింది. రాజేంద్ర ఆమెకు అడ్డంగా వచ్చి, ఆమెను ఆపి అన్నాడు – "నిన్ను ఊరికే పోని వ్వను"

"పదండి చాలా సేపయింది. ఆయన మనకోసం ఎదురు చూస్తుంటారు"

"ఉహు! నీ దుఃఖానికి, బాధకు కారణం ఏమిటో తెలుసుకోకుండా నిన్ను పోనివ్వను"

"తెలుసుకొని ఏం చేస్తారు ?"

"నీ కండ్లలో ఈ నిరాశ రేఖలు నా మనసును కలిచి వేస్తున్నాయి. వాటిని దూరం చేసేందుకు ప్రయత్నిస్తాను"

"ఇప్పుడు కాదు. మరోసారి ఎప్పుడైనా చెప్తాను. అప్పుడు వినండి"

"అంత కాలం ఎవరు ఉంటారు!"

"ఆయన నా వారు కాదు" మాధురి రుద్ధకంఠంతో, ముఖం పక్కకు తిప్పుకొని అన్నది.

"అంటే ... నాకేమీ అర్థం కావటం లేదు"

"కారణం ఏమిటో తెలియదు గాని, ఆయన నాకు దూరంగా ఉంటూంటారు. నన్ను అసహ్యించుకొంటున్నారేమో అని పిస్తోంది"

"ఎప్పుడైనా, ఏదైనా అనుకోని విషయం జరిగిందా ?"

"లేదు; పెళ్ళి అయిన రెండో రోజే మేము ఇక్కడికి వచ్చాము. అప్పటినుండి ఇక్కడే ఉన్నాము"

"అతని ప్రవర్తనకు కారణం ఏమిటో తెలుసుకొనే ప్రయత్నం చేశావా?"

"ఏమీ అర్థం కావడం లేదు. పెళ్ళికి ఆయన ఒప్పుకోలేదన్న సంగతి మాత్రం నాకు తెలుసు. ఇంట్లో వాళ్ళందరూ బల వంతంచేసి పెళ్ళి చేశారు"

"కావచ్చు. కాని నీవంటి స్త్రీని భార్యగా పొందడం అతని ఉదాసీనతకు కారణం మాత్రం కాదు!"

"బహుశ, ఆయన మరో యువతిని ప్రేమించాడేమో ! మనసులో మాట విప్పి చెప్పనే చెప్పడు"

"ఓహో !" అతడు క్షణం సేపు మౌనంగా ఉన్న తర్వాత అన్నాడు—

"నాకు తెలిసింది"

"ఏమిటి?" మాధురి అతని సమీపంగా వచ్చి ఆసక్తి కనబరుస్తూ అడిగింది.

"తప్పంతా నీదే. మూడు సంవత్స రాలు గడిచినా అతని మనోసామ్రా జ్యాన్ని జయించలేని నీవు ఒక స్త్రీవే కాదు. నీవు చాలా చిత్రమైనదానివి"

"నేను ఎన్నిసార్లు,ఎన్ని ప్రయత్నాలు చేసి విఫలురాల్ని అయ్యానో మీకేం తెలుసు? ఆయన హృదయం ఒక కఠిన శిల"

"మీకు...మీ ఇద్దరి స్నేహాన్ని సమా నంగా పంచుకోగల్గిన మూడో వ్యక్తి అవసరం"

"ఎవరా వ్యక్తి?"

"ఓ చిన్న బాబు. మీ యిద్దరి ప్రేమకు కేంద్రమై ఇద్దరి మధ్య సన్ని హితత్వం పెంచేవాడు అవసరం"

"నాకా అదృష్టం ఎక్కడిది ?" కొంగును నోట్లో పెట్టుకొని తన భావాలు కనిపించకుండా ముఖం పక్కకు తిప్పు





కొంది.

"ఎందుకని...ఎందుకలా అంటున్నావు?"

''రాజూ!'' ఆమె నిరాశనిండిన చూపులతో, నిస్పృహ నిండిన స్వరంతో అతన్ని పేరు పెట్టి పిలిచి అన్నది- "ఇప్పుడు నీకు ఏమని చెప్పను ? ఆయన నాకు పరాయివాడు. నాకు ఆయనపైన ఏమీ అధికారం లేదు. నేను ఈనాటి వరకు అవివాహితురాలిలాగే ఉన్నాను. మహాసముద్రం దగ్గర ఉండి కూడా దప్పికతో ఉన్నాను. నామమాత్రంగా ఉన్న ఈ తాళిబొట్టుకు, పత్నిత్వానికి అర్థం ఉందా ?

''నాకు తెలియక అడుగుతాను. ఆయన నన్ను పెళ్ళి చేసుకొని ఇక్కడకు తీసుకొని రావడం ఎందుకు? నా కడుపు పండి, నా ఇంట్లో పసివాడు తిరగాలని నీవంటున్నావు. కాని మూడేండ్లు గడచినా నన్ను ఆయన ప్రేమించడం మాట అటుంచి, నా గదిలో పడుకోను కూడా లేదు. అప్పుడప్పుడు ఈ చెరువులో దూకి చచ్చిపోవాలనిపిస్తుంది ?"

ఈ మాటలంటున్నప్పుడు మాధురి కొంచెం కూడా సంకోచించలేదు. ఏదో విచిత్ర భావన, విచిత్ర ప్రేరణ ఆమెను ప్రేరేపించడం మూలాన మనసులో దాగిన విషయాలన్నీ బయటకు చెప్పేసింది. వెంటనే ఏడుస్తూ బయటికి వచ్చేసింది.

రాజేంద్ర అక్కడే నిలబడి ఆమెను చూస్తూ ఉండిపోయాడు. మాధురి ఆమె వైవాహిక జీవితంలోని సమస్యను, బాధను తనతో ఎందుకు చెప్పింది ? అతనికి వాసుపై కోపం వచ్చింది.



కాలేజీలో చదివే రోజుల్లో తను మాధురిని ప్రేమించాడు. మనసారా ప్రేమించాడు.

ఇన్ని సంవత్సరాలు గడిచినా ఆమెను పూర్తిగా మరచిపోలేకపోయాడు...... ఇప్పుడు అకస్మాత్తుగా ఆమెను మళ్ళీ కలుసుకోవడం తటస్థించింది ... ఆమె పరిస్థితిని చూసి ఎంతో బాధపడ్డాడు... హృదయంలో ఎక్కడో మారుమూలకు వెళ్ళి దాక్కున్న ప్రేమజ్వాల మళ్ళీ రేగింది.

అతడు గుహ నుండి బయటికి వచ్చేసరికి మాధురి వాసు దగ్గర కూర్చొని మాట్లాడుతోంది. వాసుదేవ్ ముఖంలో విచారం నిండుకొని ఉంది. అతడు ఆమె ముంగురులను సరిచేస్తున్నాడు.

రాజేంద్ర దూరాన నిలబడి వాళ్ళను చూస్తున్నాడు. అతనికి వాళ్ళ విచిత్ర స్వభావం చిక్కుబడిన దారంలా, అర్థం కాని పొడుపు కథలా కనిపించింది.

బయట ఇంకా జోరుగా వర్షం కురుస్తూనే ఉంది.




''బాబుగారూ! బాబుగారూ!'' అనే కేక ఇల్లంతా మారుమోగింది.

ఇంకా సరిగా తెల్లవారనేలేదు. నిశ్శబ్దతను చీల్చుకొంటూ ఈ కేక వాసుకు వినబడింది. హడావిడిగా పడక మీద నుండి లేచి బయటికి పరుగుతీశాడు.

గంగ కేకలు వేస్తూ అతని వైపు వస్తోంది... "బాబుగారూ! కోచ్‌మన్‌ను రక్షించండి"

"ఏమైంది ?" వాసు ప్రశ్నించాడు.

"గుర్రం అతన్ని నోట కరుచుకొని పోతోంది."

వాసుదేవ్ వెంటనే గోడన వేలాడుతున్న కొరడా అందుకొని కిందికి పరుగెత్తాడు. ఇంట్లో వాళ్ళందరూ బయటికి వచ్చారు. మాధురి వాకిట్లో నిలబడి గంగను ఏదో అడుగుతోంది.

పక్క గదిలో నుండి రాజేంద్ర బయటకి వచ్చి అడిగాడు "ఏం జరిగింది?"

"గుర్రం కోచ్‌మన్‌ను నోట పట్టుకొంది...ఆయన వెళ్లారు.. మీరు కూడా వెళ్ళండి..ఆలస్యం అయితే..." మాధురి మాటలు ఇంకా పూర్తికాక ముందే రాజేంద్ర కిందకు పరుగెత్తాడు.. మాధురి గంగ కూడా అతని వెనకే కిందకు వచ్చారు.

వాసు కిందికి వచ్చి చూసేసరికి గుర్రం మదించి, పిచ్చిగా అటూ ఇటూ ఊగుతోంది. అది నోటితో అతన్ని పైకెత్తి అటు ఇటు ఊపుతోంది. వాసు గుర్రాన్ని గట్టిగా గద్దించాడు. ముందుకు వచ్చి దాని వీపుపై కొరడాతో కొట్టసాగాడు. కోచ్‌మన్ అరుపులు, గుర్రం సకిలింపులు, ఛళ్ళు ఛళ్ళుమని వినిపిస్తున్న కొరడా దెబ్బల శబ్దం... వీటితో అక్కడి వాతావరణం గడ గడలాడింది. గుర్రం మాత్రం కోచ్‌మన్‌ను వదిలి పెట్టలేదు. వాసును మాధురి, రాజేంద్ర ఆపాలని ప్రయత్నించారు. కాని ఆగలేదు. దగ్గరికి వెళ్ళి కింద పడిఉన్న తాడు తీసి గుర్రం మెడకు వేసి గట్టిగా లాగాడు. కోచ్‌మన్ శరీరం దాని నోటి నుండి జారి కిందపడింది. గుర్రం ముందరి కాళ్ళమీద లేచి పెద్దగా సకిలించింది. అది ఒకటి రెండు క్షణాల్లో వాసు పైన పడుతుందేమో అనిపించింది. భయంతో మాధురి పెద్దగా కేకవేసింది. కాని వాసు గుర్రాన్ని తన వశంలోకి తెచ్చుకొన్నాడు. అతడింకా దాన్ని కొరడాతో కొడుతూనే ఉన్నాడు.

రాజేంద్ర, గంగ వెళ్ళి కోచ్‌మన్‌ను పైకి లేపారు. అతని శరీరం రక్తంతో తడిసిపోతోంది. గుర్రపు పండ్లు అతని పొట్టలో గుచ్చుకుని పెద్ద గాయం చేశాయి. చౌకీదారు, చుట్టుపక్కల ఉన్న నలుగురైదుగురు కలిసి తాడుతో గుర్రాన్ని కట్టివేశారు.

వాసు ఒళ్ళంతా చెమట పట్టింది. అతడు బాగా అలసిపోయాడు. ఈ దినం అతడు చూపిన కోపాన్ని, ఆ కోపంతో అతడు కొట్టిన కొరడా దెబ్బలను చూసి అందరూ భయంతో కంపించిపోయారు. గుర్రం నోటిలో నుండి ఇంకా నురుగు వస్తోంది. దాని కండ్ల నుండి నీరు కారుతోంది. కొరడా దెబ్బల వాతలు దానిపిపు పైన మెరుస్తున్నాయి. వాసు ఒకసారి గుర్రం వైపు చూశాడు. వెంటనే ముఖం పక్కకు తిప్పి కోచ్‌మన్ వైపు చూశాడు. తర్వాత చౌకీదారుతో అన్నాడు. "అతన్ని వెంటనే పడవలో ఎక్కించి, చెరువు అవతల ఉన్న రైల్వే డిస్పెన్సరీకి తీసుకు వెళ్ళు... నేను ఈలోగా బట్టలు మార్చుకొని వస్తాను"

"ఇదంతా ఎందుకు జరిగింది ?". రాజేంద్ర అడిగాడు.

"పరువు కదా... వాడు పాపం గడ్డి మేయడానికి వెళ్లాడు... వెళ్లి ఈ అపద

తెచ్చుకొన్నాడు."

"కొత్తగా వచ్చాడా?"

"కాదు, నాలుగు సంవత్సరాల నుండి ఇతనే కోచ్‌మన్‌గా ఉంటున్నాడు.. కాని పశువుకు అదంతా ఎందుకు, తనకు, రోజూ సేవ చేస్తున్నవాడి ప్రాణాలకే ముప్పు తెచ్చింది."

రాజేంద్ర మౌనం వహించాడు. అందరూ పైకి వచ్చారు. మాధురి టీ తెచ్చి ఇవ్వమని గంగతో చెప్పి వాసు బట్టలు విప్పసాగింది. ఆమె చెవులు మాత్రం స్నేహితులిద్దరి మాటల్ని శ్రద్ధగా ఆలకిస్తున్నాయి.

"అంత ఆవేశంలో ఉన్నా కొరడా దెబ్బలు పడేసరికి గుర్రం లొంగి పోయింది నాకు"

"అంతా ఓ కలలాగా, ఆశ్చర్యంగా అనిపించింది'' రాజేంద్ర కుర్చీలో కూర్చొంటూ అన్నాడు.

''ఎందుకని?''

"ఇంత కోమల మనస్కుడు, గంభీర స్వభావి, శాంత పురుషుడు అయిన వాసు ఉన్నట్లుండి అంత కఠినుడుగా ఎలా అయ్యాడా అనిపించింది''

"పరిస్థితి అలాంటిది ... అలాంటి పరిస్థితిలో ఎంత వద్దనుకొన్నా నర నరంలో ఆవేశం నిండిపోతుంది"

గంగ ట్రేలో టీ తెచ్చింది. మాధురి అందరికీ టీ తయారుచేస్తోంది. ఈ సంఘటన వల్ల వాతావరణం గంభీరంగా మారిపోయింది. అందరూ భయం భయంగా, మౌనంగా ఉన్నారు.

టీ తాగిన వెంటనే వాసు కోచ్‌మన్‌ను చూసి రావడానికై డిస్పెన్సరీకి వెళ్ళటానికి సిద్ధపడ్డాడు. పిచ్చి పట్టిన గుర్రం కారణంగా అతని రక్తం విషపూరితం అయి చస్తాడేమోనని అతనికి భయంగా ఉంది.

రాజేంద్ర కూడా అతని వెంట వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. కాని వాసు అతన్ని వారిస్తూ "నీవు ఇంటి దగ్గరే ఉండు. నేను త్వరగానే తిరిగి వచ్చేస్తాను'' అన్నాడు.

వాసు వెళ్ళాడు. అతడు కనిపించినంత దూరం ఇద్దరూ అతని వడవనే చూస్తూ ఉండిపోయారు.

గదిలో మౌనం రాజ్యం చేస్తోంది. ఆ మౌనాన్ని భంగపరుస్తూ మాధురి అన్నది-"జంతువులకు పిచ్చెక్కితే చాల భయంకరంగా ప్రవర్తిస్తాయి."

"అవును...మనిషికి పిచ్చి ఎక్కితే అంతకంటే భయంకరంగా ప్రవర్తిస్తాడు."

చల్లగాలి మెల్ల మెల్లగా వీస్తూ వాళ్ళ శరీరాల్ని తాకుతోంది. ఇద్దరూ ముంగిలి దాటి చెరువు గట్టుకు నడిచారు. తీరంతో ఆటలాడుకొంటున్న అలలను చూస్తూ ఉండిపోయారు. మాధురి మనో ఫలకంపై ఇంకా ఆ భయంకర దృశ్య ప్రభావం అలాగే ఉంది.

రాజేంద్ర కొంత దూరం నడిచిన తర్వాత ఆగిపోయాడు. అక్కడ పచ్చిక బాగా ఉంది. "ఇక్కడ కూర్చుందామా?" అన్న అతని అభ్యర్థనకు ఆమె అంగీకార సూచకంగా తల ఊపింది. ఆమె చెరువు లోని నీళ్ళలో కాళ్ళు పెట్టి ఒడ్డునే ఉన్న రాతిపై కూర్చొంది. ఆమె వీపు రాజేంద్ర వైపు ఉంది. ఇద్దరూ తమ తమ ఆలోచనల్లో లీనమై ఉన్నారు. చివరకు రాజేంద్ర ఆ మౌనాన్ని భంగపరుస్తూ అన్నాడు -

''మాధురీ! పురుషుడు స్త్రీ విషయంలో మాత్రం చాల బలహీనుడని అంటారు...నిజమేనంటావా?''

''పురుషులు పైకి ఇలాంటి కమ్మని కబుర్లే చెబుతుంటారు కాని ఈ కబుర్ల జలతారు ముసుగు వేసి స్త్రీని ఒక ఆట బొమ్మగా మార్చి తమ ఇష్టం వచ్చినంత సేపు ఆడుకొంటారు...ఆ తర్వాత... తమ కోరికలు తీరగానే...తమ ఆకర్షణ తగ్గగానే ఆటబొమ్మగా భావించే ఆ స్త్రీని ముక్కలు చేసి సర్వ నాశనం చేస్తారు. దూరంగా విసిరి పారేస్తారు..." మాధురి అతని వైపు చూడకుండానే జవాబిచ్చింది.

"కానీ...నీపట్ల అలాంటి నిర్లక్ష్యం ఏమీ జరగలేదు కదా! ఈ బొమ్మ ఇంకా ఇంద్రధనుస్సులా, నిత్య నూతన సౌందర్యంతో మిరుమిట్లు గొలిపే అందంతో విరాజిల్లుతూనే ఉంది.''

"కావచ్చు...ఒక రోజు ఈ అందాల బొమ్మ కాస్తా, అకస్మాత్తుగా ఆత్మబలి చేసుకొంటుందేమో!"

"మాధురీ ...! అలాంటి మాటలు అనవద్దు ... నా మనసుకు అలాంటి మాటలు విని భరించే శక్తిలేదు"

"ఎందుకని ?"

"ఎందుకో నాకే తెలియదు. నీ పట్ల ఇంత సానుభూతి, ఆసక్తి ఎందుకు కలిగాయో నాకే తెలియదు"

"మీరు వట్టి కబుర్లు చెబుతున్నారు"

"నన్ను కేవలం కబుర్లరాయుడుగా భావిస్తున్నావా ? నేను మాత్రం నిన్నలా భావించడం లేదు"

"మీరు నన్ను ఏనాడో పూర్తిగా మరచిపోయారు. అలా మరచిపోతారని





నేను కలలో కూడా అనుకోలేదు"

"పెండ్లి అయిన తర్వాత స్త్రీ పరాయిదై పోతుంది. ఆమెను ప్రేమించడం, ఆమె నుండి ప్రేమను ఆశించడం పాపం"

"మీరు భలే వారే! పాపం చేయక ముందే ప్రాయశ్చిత్తం చేసుకొంటున్నారు" మాధురి నవ్వి అన్నది.

"ఎందుకలా అన్నావు? నేనేం పాపం చేశాను?"

"నా ఉద్దేశం అది కాదు. మీ స్నేహితుడు జ్ఞప్తికి రాగానే ఆయనతో కలసి నాలుగు దినాలు సరదాగా గడపాలని వచ్చారు. నిజమేనా ?"

"అవును. మీ ఆయన నాకు ప్రియ స్నేహితుడు"

"మరి నేను! మీ శత్రువును. ఔనా?"

"కాదు అలా అని నేనన్నానా ? నా ఉద్దేశం అదికాదు. నీవేమో స్త్రీవి, అతడు.."

"స్త్రీలు ఎవరికి స్నేహితులుగా ఉండ తగరా?"

"పెండ్లి అయిన తర్వాత సమాజం దృష్టిలో స్నేహం కూడా విపరీతంగా, అనుచితంగా అనిపిస్తుంది."

"అంతేనా ఇంకా ఏమైనా కారణాలున్నాయా ?"

"ఉన్నాయి. ఆడవాళ్ళ స్నేహాన్ని ఎలా విశ్వసించడం?"

ఈ మాటలు విన్న మాధురికి కోపం వచ్చింది. ముఖం గంభీరంగా మారింది. కాలితో నీళ్ళను గట్టిగా తన్ని వెంటనే లేచి నిలబడి ఇంటికి వెళ్ళడానికి సిద్ధమైంది. అతడు రెండడుగులు ముందుకు వేసి ఆమె కొంగు పట్టుకొని ఆపాలని ప్రయత్నించాడు. కాని ఆమె చటుక్కున కొంగు విడిపించుకొని అతనివైపు తీక్షణంగా చూసింది. "తప్పుగా భావించావా?" రాజేంద్ర వినయంగా ఆమెను బ్రతిమి

లాడుకొంటున్న ధోరణిలో అన్నాడు. అతని అంతరంగం తానన్న మాటలకు బాధపడుతోంది.

"లేదు లెండి. మీ మాటలకు చాల సంతోషించాను"

ఆమె ధోరణి చూసే ఆమె మనసు గాయపడిందని తెలుసూనే ఉంది.

"అది తమాషాగా అన్నమాట మాధురీ! నిన్ను చాలాకాలం తర్వాత అకస్మాత్తుగా ఇక్కడ చూడగానే నేను ఎంతగా సంతోషించానో నీకేం తెలుసు?"

"ఇక చాల్లెండి. అన్నీ కబుర్లే. కోతలు కోయడం మీ మగవాళ్ళకు ఉగ్గుపాలతో వచ్చిన విద్య"

"ఏం చేయమంటావు మరి. మీ ఆడ వాళ్ళు కోరేవి ఆ కబుర్లే కదా!" రాజేంద్ర నవ్వుతూ అన్నాడు. గంభీరంగా ఉన్న మాధురి ముఖం కూడా నవ్వుతో కళ కళ లాడింది. మళ్ళీ కూర్చుంది.

ఇలా ఒకర్ని ఒకరు నిందించుకుంటూ ఒకరిపై ఒకరు నిష్టూరాలు పలుకుతూ ఇద్దరూ మానసికానందాన్ని అనుభవిస్తు న్నారు.

వాళ్లు కాలేజీలో చదివే రోజుల్లో కూడా ఇలాగే ఒక్కొక్కసారి కబుర్లతో, ఒక్కొక్కసారి నిష్టుర వాక్యాలు వినడంతో గడిపే వాళ్లు. కొంచెం సేపయిన తర్వాత వాళ్ళు కల్పనాలోకం వదిలి ఈ లోకం లోకి వచ్చారు. ఇప్పుడు వాళ్ళలో బిడి యము, సంకోచం, భయం చోటు చేసు కొన్నాయి.

వాసు వెళ్ళి చాలా సేపయింది. వీళ్ళి ద్దరు పరిసరాల్ని మరచి చెరువు గట్టున కూర్చొని గడచిన అనుభవాలను గురించి ముచ్చటిస్తూ గడిపారు. వాళ్లమధ్య ఇంతకు పూర్వం ఉన్న ఘనిష్టత మళ్ళీ ఏర్పడసాగింది. మాధురి చెరువు గట్టున గడ్డిలో బోర్లా పడుకొని, ఒక చేతిని చెరువు నీటిలో అటు ఇటు ఊపుతోంది. రాజేంద్ర ఆమెకు కొద్ది దూరంలో కూర్చొని మరులు గొలిపే ఆమె యవ్వన శోభను, అవయవ సౌష్టవాన్ని తనివితీరా చూస్తున్నాడు.

చెరువులోని అలల లాగే రాజేంద్ర మస్తిష్కంలో ఎన్నో భావాలు చెలరేగు తున్నాయి. అతని మనస్సు ఆలో చిస్తోంది. వాసు మాధురిని ప్రేమించడం లేదు. మాధురికి వైవాహిక జీవితం ఒక పెద్ద భారంగా అనిపిస్తూంది...ఇలాంటి పరిస్థితిలో తాను మళ్లీ మాధురి ప్రేమను పొందే ప్రయత్నం చేస్తే తప్పేముంది? ఇద్దరికీ పరస్పరం ఇష్టం ఉంది. ఇద్దరి మధ్య అనురాగం, ఆకర్షణ అలాగే ఉన్నాయి ఇద్దరూ ఒకర్ని ఒకరు బాగా అర్థంచేసుకొన్నారు. కలసి ఉంటున్నారు. అభిప్రాయాలు కూడా కలుస్తున్నాయి.

కాని, వెంటనే వాసు తన ప్రాణ మిత్రుడనే విషయం అతనికి జ్ఞప్తికి వచ్చింది. మిత్రునికి ద్రోహం చేయడమా? అతడు అగ్నిసాక్షిగా పెండ్లి చేసుకున్న భార్య విషయంలో ఇలా ఆలోచించడమా? ...దాంతో అతని ఆలోచనలన్నీ నీటిలోని అలల్లాగా మనసులో కలసిపోయేవి. కాని, మాధురి వైపు చూపులు మరల్చగానే, ఆమె అసమాన సౌందర్యం చూడగానే...ఆమె శరీరంలోని అవయవాలన్నీ తనను ఆహ్వానిస్తున్నట్లుంది. అతనిలో మళ్లీ అవే ఆలోచనలు చెలరేగేవి.

ఒకనాడు వాళ్ళిద్దరూ పెద్దలను ఎదిరించి అయినా సరే ప్రేమ వివాహం. చేసుకోవాలని ప్రతిజ్ఞ చేసుకొన్నారు. తమ

భావి జీవితాన్ని గురించి ఎన్నో అందమైన కలలు కన్నారు...... గాలిమేడలు కట్టారు... తమ భవిష్యత్తును గురించి ఎన్నో నిర్ణయాలు తీసుకొన్నారు. ఆ ఊహా ప్రపంచంలో నిత్యం వసంతమే! నలువైపులా వర్ణ సుమ సౌరభాలే! ఆనంద డోలికల్లో ఊయల లూగే ప్రేమికుల ఉఛ్వాస నిశ్వాసాలే! రెండు రసహృదయాల మధుర సంగీతమే!

కాని కాలచక్రం అతి క్రూరంగా వాళ్ళ జీవితాలపై ప్రభావం చూపింది. అతడు సైన్యంలో చేరి యుద్ధ రంగంలోకి వెళ్ళాడు. వాళ్ళిద్దరు వేరయ్యారు. వాళ్ళ గాలిమేడలు కూలిపోయాయి. అతడు యుద్ధం నుండి తిరిగి వచ్చేసరికి మాధురి పెండ్లి జరిగిపోయిందనే వార్త తెలిసింది. అతనికి నిరాశా నిస్పృహలే మిగిలాయి.

తన ప్రేమ ఇలా ముగిసినందుకు అతని మనసు వికలమై రోమ రోమం బాధతో మూలిగింది. ఈలోకం పట్ల విరక్తి కలిగింది. ఇక ఎప్పటికీ పెండ్లి చేసుకోనని ప్రతిజ్ఞ చేసుకొన్నాడు. చాలా సంవత్సరాల వరకు అతడీ వియోగ జ్వాలలో కాలిపోతూ గడిపాడు. అతడామెను మరచిపోవాలని ప్రయత్నం చేస్తున్నాడు. కాని ఆమె తేజస్సును, ఆమె జ్ఞాపకాలను పూర్తిగా తుడిచిపెట్టలేక పోతున్నాడు. రోజులు దొర్లుతున్నాయి. చాలా కాలానికి అతని మనసు శాంతించింది. ఇప్పుడు గడచిన సంగతులు, మాధురి జ్ఞాపకాలు అతని మనసును అంతగా బాధ పెట్టడం లేదు.

కాని అకస్మాత్తుగా తన స్నేహితుణ్ణి చూడడానికి ఇక్కడికి వచ్చిన అతని మనసులో అణగి ఉన్న జ్వాల పెద్దదైంది. తన ప్రేమికురాలిని ఇక్కడ చూడవలసి వస్తుందని గాని, ఆమెతో ఇంత సన్నిహితంగా మెలిగే అవకాశం వస్తుందని కాని అసలు ఊహించనే లేదు.

మాధురి తన స్థానంలో లేచి కూర్చొంది. రాజేంద్ర ఆమెను రెప్ప వాల్చకుండా చూస్తూ ఉన్నాడు. విధి వాళ్ళిద్దర్నీ కొంత కాలంపాటు దూరం చేసి, మళ్ళీ ఆశ్చర్యకరంగా కలిపింది. అతడామెను రెప్ప వాల్చకుండా వింతగా, ఆశగా ఎంత సేపు అలా చూస్తూ ఉండిపోయాడో అతనికే తెలియదు. మాధురి గనక ప్రశ్నించకుంటే అలాగే చూస్తూ ఉండి పోయేవాడు. ఆమె పెదాలు బిగించి చిరు కోపం ప్రదర్శిస్తూ అన్నది—

"మీరు ఎందుకలా మింగేసేటట్లు చూస్తున్నారు నా వైపు?''

"కోపంగా మాత్రం కాదు... ప్రేమగా...!"

"మీ ముఖం మాత్రం అలా కనిపించడంలేదు''

"నీకు అన్యాయం చేసినవాడి మీద నాకు చాలా కోపం వస్తూంది"

"ఎవరి మీద ?"

"నీ భర్తమీద... అతడు నిన్నిలా నిరాశా నిస్పృహల పాలు చేసి బాధ పెడుతున్నాడు నీ యవ్వనాన్ని వృథా చేస్తున్నాడు. నీపట్ల విముఖంగా ఉంటూ నీ గుండెను రంపపు కోతకు గురి చేస్తున్నాడు"

ఈ మాటలు విన్న మాధురి మనసు గాయపడింది.

ఆమె మోకాళ్ల మధ్య తలపెట్టుకొని మౌనంగా ఏవో ఆలోచనల్లోకి జారి

 

పోయింది. ఆమె నొసలు మీద చెమట బిందువులు ఏర్పడటం రాజేంద్ర చూశాడు. కొంచెం సేపటి వరకు వాళ్ళిద్దరి మధ్య మౌనం రాజ్యం చేసింది. ఆ తర్వాత రాజేంద్ర అన్నాడు—

"మాధురీ ! ఒక మాట అడుగుతాను జవాబు చెప్తావా ?"

"ఏమిటది ?"

"అబద్ధం చెప్పనని ప్రమాణం చెయ్యి"

"మీరు అడిగితే కదా చెప్పడానికి !"

"నీవు...నన్ను... ఇప్పుడు కూడా ప్రేమిస్తున్నావా ?"

రాజేంద్ర ప్రశ్న విని ఆమె గడగడ వణికింది. ఈ ప్రశ్న వేస్తాడని ఆమె ఊహించలేదు. ఆమె వెంటనే తల పక్కకు తిప్పుకొని లేచి నిలబడింది. అతడు రెండవ సారి తన ప్రశ్నను అడిగే లోపలే చెరువు నీటిలో తెడ్ల శబ్దం విని ఇద్దరూ అటువైపు చూశారు. కండ్ల ముందు చాలా దూరం వరకు నిర్మలంగా, నిరామయంగా నీలం రంగుతో వ్యాపించి ఉన్న చెరువు ఉంది. దూరాన అటువైపు నుండి ఒక పడవ వస్తూంది. ఇద్దరూ ఒకళ్ళ నొకరు పలకరింపుగా చూసుకొన్నారు. మాధురి అతనితో అన్నది—

"పదండి ! ఆయన కూడా వచ్చేశారు !"

ఇద్దరూ అక్కడి నుండి బయలుదేరి దొంగల్లాగా ఇంట్లోకి వచ్చారు. బయటికి వెళ్ళనివాళ్ళలాగా కనిపించాలని ఎవరి గదిలోకి వాళ్ళు వెళ్ళారు.

వాసు హాల్లోకి రాగానే గంగను పెద్దగా కేకవేసి పిలిచాడు. ఇద్దరూ అతని కంఠస్వరం విన్నారు, కాని తమ తమ గదులలో పడుకొన్న చోటునుండి ఎవరూ కదలలేదు. వాసు రాజేంద్ర ఉన్న గదిలో అడుగు పెట్టాడు... అతడింకా పడుకొని ఉండటం చూసి అన్నాడు-

"ఏమిటి ఇంకా పడుకొని ఉన్నావు. స్నానం కూడ చేయలేదా ?"

"లేదు...నీ కోసం ఎదురు చూస్తున్నాను"

"మాధురి ఎక్కడ ?"

"తన గదిలో ఉందేమో !"

రాజేంద్ర జవాబు విని వాసు తన గదికి వెళ్ళాడు. అక్కడ మాధురి గదిలోని వస్తువులను తుడుస్తూ, యథాస్థానాల్లో పెడుతోంది. తలుపు దగ్గర శబ్దం కాగానే అటువైపు చూసింది.

"ఏం చేస్తున్నావు ?" వాసు ప్రశ్నించాడు.

"మీ కోసమే ఎదురు చూస్తున్నాను. అది సరే.. కోచ్‌మన్‌కు ఎలా ఉంది ?"

"డాక్టర్లకు అప్పచెప్పాను. బాగవుతాడనే అనుకొంటున్నాను"

మాధురి ఇంకా ఏమో అడగాలనుకొనే లోపలే రాజేంద్ర ఆ గది ద్వారం దగ్గరకు వచ్చాడు. అతన్ని చూడగానే ఆమె అడగడం మాని అలమరలో ఉన్న బట్టలు సరిగా సర్దసాగింది.

"రాజీ! మీరిద్దరు ఒకేసారి కాలేజీలో చదివారు కదూ !?"

మాధురి సిగ్గుతో పక్కకు తిరగటం చూసిన వాసు రాజేంద్రను ఈ ప్రశ్న అడిగాడు.

"అవును. ఏమిటి విశేషం. ?"

"నాకు మాత్రం నమ్మకం కలగటం లేదు."

"ఎందుకని ?"

"ఎందుకా ? ఒకర్ని చూసి ఇంకొ





కరు సిగ్గుపడటం.. అపరిచితుల్లాగా ప్రవ రించడం... ఒకే ఇంట్లో ఉంటూ కూడా వేర్వేరు గదుల్లో దూరి ఉండటం...ఇవన్నీ చూస్తుంటే నాకలా అనిపిస్తోంది"

"అయితే ఏంచేయమంటావు మమ్మల్నీ?" రాజేంద్ర స్నేహితుణ్ణి ప్రశ్నిస్తూ,మాధురివైపు ఓరగా చూశాడు.

"ఏమీ చేయనక్కర్లేదు.. కనీసం మాట్లాడుకోవచ్చు కదా!''

''మాట్లాడటమా.. నీ భార్యతోనా..! అదెలా సంభవం ?"

''ఎందుకు కాదు ?"

''ఆవిడ నీతోనే అపరిచితుల దగ్గర ఉన్నట్లు ప్రవర్తిస్తోంటే, ఇక నాతో ఏం మాట్లాడుతుంది ?''

వాసు అతని మాటల్లో దాగిన భావాన్ని గ్రహించి మౌనంగా ఉండి పోయాడు. మాధురి బయటికి వెళ్ళాలని ముందుకు అడుగు వేసింది.

"మాధురీ!" వాసు ఆమెను ఆపుతూ అన్నాడు.

"ఆ..." ఆమె ఆగింది. కాని వెనక్కు తిరిగి అతని వైపు చూసి, చూపుల్లో చూపులు కలిపే సాహసం చేయలేకపోయింది.

"ఎక్కడికి వెళ్తున్నావు ?" వాసు అడిగాడు.

"మీకు టిఫిన్ తీసుకొని రావడానికి"

"మీ రిద్దరూ ఏం తిన్నారు?"

"ఏమీ తినలేదు. మీ కోసం నిరీక్షిస్తు న్నాము"

ఈ మాటలని మాధురి గది దాటి బయటికి వెళ్ళింది. గదిలో మిగిలిన ఇద్దరు స్నేహితులు మాటల్లో లీనమయ్యారు. ఈ దినం రాజేంద్ర ముఖంలో ఏదో మార్పు గోచరిస్తోంది. తన స్నేహితుని లోని మార్పుకు కారణం అడగాలని వాసు మనసులో అనుకొన్నాడు. కాని ఏదో ఆలోచన వచ్చి ఆ ప్రయత్నం మాను కొన్నాడు.

కొంచెం సేపయిన తర్వాత అందరూ ఫలహారం తినసాగారు. మాధురి టీ తయారు చేస్తోంది. వాళ్ళిద్దరిలో ఒక విచిత్రమైన మానసిక సంఘర్షణ జరుగు తోంది. ఇద్దరూ బెరుకుగా, భయపడు తున్నట్లుగా, ఏదో తప్పు చేసినట్లుగా ఉన్నారు.

ఈ వాతావరణాన్ని, ఈ గాంభీ ర్యాన్ని వాసు ఎంతోసేపు సహిస్తూ ఉండలేకపోయాడు. అతడు రాజేంద్రతో అన్నాడు. "రాజీ! నా మాట విని నీవు వెంటనే పెళ్ళి చేసుకో"

"ఉన్నట్టుండి నీకీ ఆలోచన ఎందుకు కలిగింది?"

రాజేంద్ర ముందు వాసు వైపు, ఆ తర్వాత మాధురి వైపు చూసి అన్నాడు.

మాధురి టీలో పంచదార కలుపు తోంది. ఈ మాటలు వినగానే ఆమె చెయ్యి ఆగిపోయింది

వాసు టీ కప్పు చేతిలోకి తీసుకొంటూ అన్నాడు— "జీవితంలో సుఖ సంతో షాలు, తృప్తి ఉండాలనుకొంటే పెళ్ళి చేసుకోక తప్పదు''

"సమయానికి భోజనం తయారుచేసి వడ్డించటం, వేసుకోవడానికి అవసరమైన బట్టలు అందివ్వడం, ప్రతీ క్షణం భర్త రాకకొరకు ఎదురు చూడటం...ఇవేనా జీవితంలో సుఖ సంతోషాలంటే ? ఇంత కంటే విలువైనవి ఏవీ లేవా?''

''ఎందుకు లేవు. సుఖానిచ్చేవి చాలా ఉన్నాయి. కాని సుఖాన్ని అనుభవించే వ్యక్తిలో ఒక ముఖ్య లక్షణం ఉండాలి"

వాసు టీ తాగుతూ అన్నాడు.

"ఏమిటా లక్షణం?"

"అనుభవించే సుఖ సంతోషాలకు బదులుగా వెంటనే ఏదో ఉపకారం చేసి తీర్చాలనే భావం ఉండకూడదు. ఆ భావం ఏ మాత్రమైనా మనసులోనే ఉండాలి. చేసే పనులు హృదయపూర్వకంగా ఉండాలి, కాని బదులు తీర్చుకోవడం లాగా ఉండకూడదు"

ఇద్దరూ మాధురి వైపు ఒక్కసారే చూశారు. ఆమె ఏదో దీర్ఘాలోచనలో ఉన్నదానిలా, మౌనంగా ఉండిపోయింది. మెల్లగా టీ తాగుతోంది. ఆమె నుదుటిపై స్వేద బిందువులు తళతళ మెరుస్తున్నాయి.

వాసుదేవ్ ప్రేమగా మాధురి చెయ్యి తన చేతిలోకి తీసుకొని మృదువుగా నొక్కుతూ అన్నాడు - "నేను అబద్ధం చెప్పానా మాధురీ!?"

"మీరు...మీరా!" ఆమె ఉలిక్కిపడి అంతలోనే సంబాళించుకొని అన్నది. "అబద్ధం ఎందుకు చెప్తారు!"

ఈ మాటలని ఆమె టీ కప్పులు, ట్రే తీసుకొని బయటికి వెళ్ళింది. రాజేంద్ర ముందు ఆమెను, తర్వాత వాసును చూశాడు. అతడు సిగ్గు పడ్డాడు. బయట గంగ నిలబడి ఉంది. ఆమె మాధురి చేతిలోని ట్రేను అందుకొంది. మాధురి లోపలికి తిరిగి వచ్చి, పక్కనే ఉన్న గదిలోకి వెళ్ళింది. ఆమె ఇంకా గది దాటకముందే రాజేంద్ర చిన్నగా నవ్వుతూ అన్నాడు "బ్రదర్! ఓ మంచి అమ్మాయిని నువ్వే చూడరాదూ!"

"ఎలాంటి అమ్మాయి కావాలి?"

"నీకు బాగా నచ్చిన అమ్మాయి"

"నాకు నచ్చిన అమ్మాయా! అయితే ఆ అమ్మాయి కూడా తప్పక మాధురి లాగే ఉంటుంది"

"సరే! మరీ మంచిది. అలాంటి అమ్మాయినే సెలెక్టు చేయి" వాసు కొంచెం సిగ్గుపడి మౌనం వహించాడు. రాజేంద్ర అతని మనసులో తుఫాను రేగుతోందనీ, భావాల అలలు తీవ్రంగా ఉన్నాయనీ గ్రహించాడు. అంతే కాదు, తెర చాటున ఎర్రని స్లిప్పర్లలో దాగి ఉన్న పాలరాయిలాంటి తెల్లని పాదాలనుకూడా చూశాడు. మాధురి తెర చాటున నిలబడి వాళ్ళ మాటలు వింటోంది. కొంచెంసేపు స్నేహితులిద్దరు మౌనంగా ఉండిపోయారు. గంగ కెటిల్‌తో టీ, గిన్నెలో పంచదార తెచ్చి పెట్టింది. రాజేంద్ర టీ కలుపుతున్నాడు.

"వాసూ! ఈ కొండ మధ్య, ఈ ఒంటరి ప్రదేశంలో నీకుభయంవేయదా?" రాజేంద్ర అడిగాడు.

"నేనిక్కడ ఒంటరిగా ఉండటం లేదు కదా! తోడుగా మాధురి ఉంది... ఆమె తోడుగా ఉంటే నాకేం తక్కువ?"

"నా ఉద్దేశం అది కాదు... ఈ వాతావరణం.. శూన్యంగా ఉన్న ఈ ఇల్లు... ఒకరిద్దరు పిల్లలు గనక ఉంటే ఈ గదులు, గోడలు అన్నీ ఆనందంతో కళ కళలాడుతాయి."

ఈ మాటలు వినగానే వాసు ముఖం కళా విహీనం అయి తెల్లగా పాలిపోవడం రాజేంద్ర స్పష్టంగా చూశాడు. టీ కప్పు అతని చేతిలో నుండి కింద పడబోయింది అతడు దాన్ని అతి ప్రయత్నం మీద పట్టుకొన్నాడు. రాజేంద్ర మిగిలిన రెండు కప్పుల్లో టీ పోసి, కదులుతున్న పరదా వైపు చూసి మాధురిని ఆహ్వానించాడు.

మాధురి వెంటనే పరదా చాటునుండి

గదిలోకి వచ్చింది. రాజేంద్ర ఆమె వైపుకు కప్పు జరుపుతూ అన్నాడు- "ఇదిగో తీసుకోండి..టి చల్లారిపోతుంది"

"వద్దండి... తాగాలనిపించడం లేదు."

"ఈ సారికి తీసుకోండి. తయారు చేశాను కదా.. కంపెనీ కోసం అయినా తాగండి."

ఆమె జవాబుగా ఏమీ అనలేదు. టి కప్పు అందుకొని టి తాగుతోంది. ముగ్గురూ మౌనంగా ఉన్నారు.

వాళ్లు తమ తమ ఆలోచనల్లో లీనమయ్యారు. అయితే వాళ్ళ ఆలోచనలకు కేంద్రం ఒకటే.




"మాధురీ!"

"ఓ ! మీరా !"

"వాసు లేడా !"

"వెళ్ళారు"

"ఎక్కడికి?" రాజేంద్ర ఆశ్చర్యపోతూ అడిగాడు.

"చెరువు అవలి గట్టుకు... అర్ధరాత్రి ఎవరో వ్యక్తి ఆయన కోసం వచ్చాడు. కోచ్‌మన్ పరిస్థితి ప్రమాదకరంగా ఉందని చెప్పాడు. అతన్ని పట్నానికి తీసుకుని పోవాల్సి ఉంటుందేమో అని కూడా అన్నాడు."

"ఎప్పుడు వస్తాడు ?"

"ఏమీ చెప్పి వెళ్ళలేదు... ఒకవేళ పట్నం వెళ్తే రాత్రికి గానీ రాలేరు."

రాజేంద్ర మౌనం వహించాడు. అతడిప్పుడే నిద్రలేచాడు. పక్కనున్న బెడ్ మీద వాసు కనిపించకపోయేసరికి అతన్ని వెతుక్కుంటూ మాధురి గదిదాకా వచ్చాడు. అప్పుడామె డ్రెస్సింగ్ టేబిల్ మీది వస్తువులను సర్దుతోంది. రాజేంద్ర బల్లమీదున్న వార పత్రికను చేతిలోకి తీసుకున్నాడు. బాల్కనీలో కుర్చీ వేసుకుని పత్రిక చదవడంలో నిమగ్నమయ్యాడు.

ప్రాతఃకాలపు వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉంది. చెరువు మీద నుండి వీస్తున్న చల్లని గాలి శరీరంలో నవచైతన్యం నింపుతోంది. మొదట్లో కొన్ని దినాల వరకూ వాసులేకుంటే రాజేంద్రకు ఏమీ తోచేదికాదు. పిచ్చివాడిలా అయిపోయేవాడు. అతడు లేకుంటే దుర్భర ఏకాంతాన్ని అనుభవించేవాడు. రోజంతా ఏదో కోల్పోయినవానిలా ఉదాసీనంగా గడిపేవాడు. అయితే ఇప్పుడు అతడు లేకున్నా అంతగా వ్యధ అనుభవించడం లేదు. మాధురితో మాట్లాడుతూ, నవ్వుతూ ఆడుతూ, పాడుతూ కాలం గడపడంలో అతడొక మానసిక తృప్తిని అనుభవిస్తున్నాడు. వాసు ఉంటే ఇద్దరిలో ఎవరూ మనసు విప్పి ఫ్రీగా మాట్లాడగలిగేవాళ్ళు కాదు. ఇలాంటి సమయాల్లో మాధురి ఏమి అనుకుంటుందో, ఆలోచిస్తుందో, ఎలా ఫీలవుతుందో అతని ఊహకు అందేది కాదు.

అతని వెనుకవైపు చప్పుడైంది. కానీ అతడు కదలలేదు, మెదలలేదు, వెనుతిరిగి చూడలేదు. వస్తున్న అడుగుల సవ్వడి అతడు బాగా ఎరిగిందే! బాల్కనీ వైపున్న పరదా తొలగించింది మాధురి

టీ కప్పు చేతిలో పట్టుకొని అతని ఎదురు వచ్చి నిలబడింది. రాజేంద్ర ఆమె వైపు ఎగాదిగా చూస్తూ అన్నాడు "గంగతో పంపితే సరిపోయేది. మీరే తెచ్చారే!"

"అతిథిని గురించి మాకున్నంత శ్రద్ధ పని మనుషులకు ఉండదు. వాళ్ళు ఏదో నిర్లక్ష్యం చూపుతారు"

"అయితే నన్ను మీరింకా అతిథిగానే భావిస్తున్నారన్నమాట"

"ఆ...అవును. మరి మీ వ్యవహారం మాత్రం ఇంకా అతిథిలాగే వుంటోంది"

"ఏమిటి...నేనేం చేశాను. ఏమైనా పొరపాటు చేశానా...బెట్టు చేస్తున్నానా?"

"మీరు కొత్తిగా అపరిచితుల్లాగా ప్రవ రిస్తున్నారు. ఇంతకు ముందు ఏమీ పరి చయం లేనట్లు, కొత్తగా ఇక్కడికి వచ్చి నట్లు ప్రవర్తిస్తున్నారు. తప్పంతా నాదే లెండి. మీ ఎదుట అన్ని సంగతులు చెప్పడం నాదే తప్పు"

"కానీ నేనేమయినా పొరపాటు మాట్లాడి వాటి మూలంగా మిత్రుని దృష్టిలో హీనం అవుతానేమో అని భయ పడుతున్నాను"

"మీరు చాలా దూరం ఆలోచిస్తు న్నారే ?"

జవాబుగా రాజేంద్ర ఏమీ అనలేదు. అతడు మౌనంగా టీ తాగుతున్నాడు. కొంచెం సేపు ఆగి అన్నాడు "ఈ రోజు కాలం ఎలా గడపాలా అని ఆలోచిస్తు న్నాను"

"కొంచెంసేపు నవ్వుతూ, ఆ తర్వాత ఏడుస్తూ గడపండి"

"అంటే...?"

"మన జీవితాలే చిత్రమైనవి. కొంత కాలం నవ్వుతో, మరికొంత కాలం ఏడు పుతో గడిచిపోతుంటాయి."

"ఏడ్వవలసి వచ్చినప్పుడు నాకు ముందే చెప్పండి. నాకు ఏడుపు త్వరగా రాదు"

రాజేంద్ర మాటలకు మాధురి కిల కిల నవ్వింది. ఈ రోజు ఆమె నవ్వులో ఏదో వింత వుంది. అది ఎదుటివారిపై ప్రభా వాన్ని కలిగించేది, మనస్సులపై మత్తు చల్లేదిగా వుంది. ఇంతకు ముందెప్పుడూ ఆమె ఇంత నిర్మలంగా, మనసారా నవ్వడం అతడు చూడలేదు. ఆమె ముఖం వసంతంలో విరిసిన మల్లె మొగ్గలాగా ప్రఫుల్లంగా ఉంది.

అంతలో చౌకీదారు అక్కడికి వచ్చాడు. అతడు వాసు దగ్గర నుంచి వచ్చాడు "బాబుగారు రాత్రి వరకు ఇంటికి రాలేరు" అన్న వార్త చెప్పాడు.

"ఎందుకని? అతడు ఎలా ఉన్నాడు?"

"కోచ్‌మన్ శరీరం అంతా విషమయం అయిపోయింది. అందుకని అతన్ని పట్నానికి పెద్ద ఆసుపత్రికి తీసుకుని వెళ్ళారు"

అతడు ఈ కబురు చెప్పి వెళ్ళాడు. ఆమె ముఖం క్షణంసేపు విచారంతో నిండిపోయింది. అంతలోనే మళ్ళీ వికసించింది. రాజేంద్ర కళ్ళలోకి చూస్తూ ఆమె మెల్లగా అన్నది—

"సరే ఆ కష్టం కూడా తప్పిపోయింది"

"ఏ కష్టం?"

"నిరీక్షణ. రాత్రిదాకా ఆయన రారు"

"అయితే ఈ పగలు గడవడం నాకు కైలాస పర్వతం ఎక్కడంతో సమానం" రాజేంద్ర ఆమె ఏమంటుందో వినాలని అన్నాడు

"ఎందుకలా అంటున్నారు. నేను మీ దగ్గరలేనా ?"

"ఉంటావు. ఏం లాభం? వాసు సంగతి వేరు, నీ సంగతి వేరు. అతడు మగవాడు.

నీవేమో స్త్రీవి... ఆడవాళ్ళకి మనసు విప్పి మాట్లాడాలంటే చాలా కష్టం"

వ్యంగ్యంతో కూడిన రాజేంద్ర మాటలు విని ఆమె ముఖం ముడుచుకుంది. బయటికి వెళ్ళడానికి రెండడుగులు ముందుకు వేసింది.

రాజేంద్ర ఆమెను ఆపుతూ ప్రశ్నించాడు—

"కోపం వచ్చిందా ?"

"నేనేమీ మగవాణ్ణి కాదు. మీతో మనసు విప్పి మాట్లాడుతూ, మీకు తోడుగా ఉండటానికి. నేను మీకు ఏమవుతాను గనక ?"

"స్త్రీల హృదయం క్షణంలో సంకోచం చెందుతుంది. క్షణంలో మారిపోతుంది" అని నేనన్నది అందుకే.

"చెప్పండి... మీకు తోడుగా చాకిదాసును పంపమంటారా ! మగవాడు... బాగా బలంగా కూడా వున్నాడు. మీకు తోడుగా వుంటాడు. ఈ పగలంతా మీకు హాయిగా గడిచిపోతుంది"

మాధురి మాటలకు అతడు పకపక నవ్వసాగాడు. ఆమె కూడా పెదాలు బిగించి, పైకి పొంగి వచ్చే నవ్వును బలవంతంగా ఆపుకోవడం అతడు చూశాడు. రాజేంద్ర మెల్లగా ఆమెను చేయి పట్టుకొని ఆపుతూ అన్నాడు—

"ఒక విషయం చెప్తాను. సరే అంటావా?"

"చెప్పండి!"

"ఎక్కడికైనా పిక్‌నిక్ పోదాం పద"

అతని మాటలకు మాధురి ఉలిక్కిపడింది. అతడు ఇంకా ఏం అంటాడో అని ఆమె భయపడింది. కాని పిక్‌నిక్ అన్న ప్రతిపాదన విన్న ఆమె ముఖం సంతోషంతో వికసించింది. తర్వాత అంగీకార సూచకంగా తల పంకించి లోపలికి పారిపోయింది.

కొంచెం సేపయిన తర్వాత ఇద్దరూ చేతిలో చెయ్యి కలిపి చెరువు గట్టున నడుస్తున్నారు. వారి భుజాలమీద పిక్‌నిక్ సామాగ్రి వేలాడుతోంది.

వాళ్ళు ఇంతకు ముందు ముగ్గురూ కలిసి వచ్చిన చోటునే ఇప్పుడు కూడా పిక్‌నిక్ కొరకు ఎన్నుకున్నారు. ఆరోజు కంటే ఈరోజు ఇద్దరు చాలా ప్రసన్నంగా ఉన్నారు. ఈరోజు వాళ్ళకు ఎలాంటి భయం, బిడియం లేవు. వాళ్ళిద్దర్ని విధి ఒక పెద్ద గోళాకారంలో ఉంచినట్లు, ఆ గోళం క్రమక్రమంగా చిన్నది అవుతుంటే ఇద్దరూ దగ్గరికి జరుగుతున్నట్లు అని పిస్తోంది. త్వరలో ఇద్దరూ అతి సన్నిహితులై ఒకరిలో ఒకరు ఏకమై పోతారేమో అన్నట్లు ఉంది.

"ఈరోజు ఈత నేర్పరా ?" మాధురి కింద కూర్చుంటూ మెల్లగా రాజేంద్రను అడిగింది.

"ఒక షరతుమీద నేర్పుతాను"

"ఏమిటది ?" మాధురి అతడు ఏం కోరిక కోరుతాడో, ఎలాంటి విచిత్రమైన షరతు పెడతాడో అన్న ఆలోచనలో పడింది. ఆమె ముఖం మళ్ళీ గంభీరంగా మారిపోయింది.

"నా వెంట చెరువు మధ్య భాగం వరకూ రావాలి"

"ఒకవేళ మునిగిపోతే ?"

"మునిగిపోవడమా ! ఇక నేనున్నది ఎందుకు?"

"మిమ్మల్ని ఎలా నమ్మడం ? ఒకవేళ మధ్యలో చెయ్యి విడిచి పెడితే..."

"నిన్ను విడిచి నేను ఎక్కడికి పోతాను?" రాజేంద్ర నవ్వుతూ అన్నాడు.

"మోసం చేస్తే...అప్పుడు..."

రాజేంద్ర ఆమె భుజాన్ని పట్టుకొని తన వైపుకు లాక్కొని గంభీరంగా అన్నాడు—''మోసం చేయడం ఆడదానికి బాగా తెలుసు...మగవాడెప్పుడూ మోసం చేయడు''

ఈ మాటలంటూనే అతడు ఆమెను చకచకా తన వెంట నీళ్ళల్లోకి లాక్కొని వెళ్లాడు. నిశ్చలంగా ఉన్న నీటిలో కలవరం కలిగింది. వృత్తాకారాల్లో అలలు బయలు దేరి దూరానికి వ్యాపిస్తూ వున్నాయి. కాళ్ళు చేతులు ఆడించడం మూలాన నీళ్ళు బాగా పైకి చిమ్ముతున్నాయి. మాధురి అరుపులు, వెంటనే ఇద్దరూ కలిసి నవ్వే నవ్వులు వాతావరణంలో మారుమోగు తున్నాయి.

రాజేంద్ర తన చేతిని ఆమె వీపు కింద వుంచి ఆమె మునిగిపోకుండా చూస్తున్నాడు. ఆమె మెల్ల మెల్లగా ఈదుతూ లోతుగా వున్న వైపుకు పోతోంది. ఎప్పుడైనా ఏదైనా చేప ఆమె దేహాన్ని తాకుతూ వెళ్ళగానే ఆమె శరీరంతో విద్యుత్తు ప్రవహించినట్లయి ఉలిక్కిపడేది. ఆమె శరీరంలో చక్కిలి గింతలు పెట్టినట్లయి పులకించేది.

చాలా సేపు ఈది ఆమె అలసి పోయింది. ఆమె చేతులు, కాళ్ళు శక్తిలేనివి అయ్యాయి. రాజేంద్ర తన రెండు చేతులు ఆమె కోమల శరీరానికి ఆధారంగా ఉంచాడు. మాధురి తన శరీర భారం అంతా రాజేంద్రపైనే వదిలేసింది. ఒక మూటలాగా, ప్రాణంలేని వస్తువులాగా అతని చేతుల్లో ఒదిగిపోయింది. ఆ చల్లని నీటిలో కూడా ఆమె ఎర్రని మృదువైన శరీర స్పర్శ అతనిలో వింత పులకింతను కలిగిస్తోంది. అతడామెను ప్రేమగా, వలపులు నిండిన చూపులతో ఒకసారి చూశాడు. అసంతృప్తితో అలమటిస్తున్న ఆమెను చూస్తుంటే అతనికి ఎంతో జాలి కలిగింది. అతడు నీళ్ళలో నుండి ఆమెను బయటికి తెచ్చి పచ్చగా పెరిగిన గడ్డి మధ్య నిలబెట్టాడు. తడిసి, శరీరానికి అతుక్కుపోయిన ఆమె బట్టల్లోంచి నీళ్ళు పడుతున్నాయి. ఆమె తన శరీర భారం అతనిపైనే ఉంచి నిలబడింది. రాజేంద్ర మెల్లగా ఆమె చెంపలు నిమిరాడు. మత్తుగా, తామర మొగ్గల్లా ఉన్న కండ్లు, నెమ్మదిగా తెరచుకొన్నాయి. ఆమె తన కాళ్ళపై నిలబడింది. రాజేంద్ర ఆమెకు సాయం యిచ్చి, ఆమెను గడ్డిమీద కూర్చుండబెట్టి, కొంచెం దూరంలో పక్కగా పండుకొని విశ్రాంతి తీసుకో సాగాడు.

అలా ఇద్దరూ ఎంతోసేపు మత్తుగా, విశ్రాంతిగా పడుకొన్నారో వాళ్ళకే తెలియదు. రాజేంద్ర ఇంకా ఆమె శరీర స్పర్శ వల్ల కలిగిన పులకింతను, ఆనం దాన్ని అనుభవిస్తున్నాడు.

చాలా సేపు అలా మౌనంగా ఉన్న తర్వాత రాజేంద్ర తల పైకెత్తి ఏదో మాట్లాడాలని మాధురి వైపు చూశాడు. అతడామెను పేరు పెట్టి పిలిచి పలక రించాలనుకొన్నాడు. కాని ఆమె ఇంతకు ముందున్న చోట లేకపోవడం చూసి ఆశ్చర్యపోయాడు. బిత్తరపోయి అటు ఇటు చూశాడు.

అతడు దిగునలేచి అన్నివైపు దృష్టి సారించాడు. సామానులు ఎక్కడ పెట్టి నవి అక్కడే ఉన్నాయి. కాని మాధురి మాత్రం లేదు. అతడు చెరువు వైపు చూశాడు. అక్కడ కూడా ఆమె జాడ లేదు. ఆమె అంతదాక వున్నచోటుకు




వెళ్ళి చూశాడు. అక్కడ తడిసిన నేలపై చిన్నరాయితో రాసిన మాటలు చదివి అక్కడే రెండు నిమిషాలపాటు కదలకుండా ఉండిపోయాడు. అక్కడ తడి నేలపై "ఐ లవ్ యూ" అనే మాటలు రాయబడి ఉన్నాయి.

రాజేంద్ర మళ్ళీ జాగ్రత్తగా నాలుగు వైపులా చూశాడు. వరుసగా చూస్తున్న అతని చూపులు కొంచెం దూరంలో ఉన్న పొదల దగ్గర ఆగాయి. వాటిపైన మాధురి బట్టలు ఎండలో ఆరవేయబడి వున్నాయి. మరోసారి నేలమీద రాయబడిన మాటలు చదివాడు. ఆమె దగ్గరికి వెళ్ళాలని ఒక అడుగు ముందుకు వేశాడు. కానీ వెంటనే ఏదో ఆలోచించుకొని, నిర్ణయం మార్చుకొన్నాడు. మెడ పక్కకు తిప్పి పక్కకు చూడసాగాడు. కొంచెంసేపైన తర్వాత అతడు మళ్ళీ ఆ చెట్లవైపు చూశాడు. ఇప్పుడు అక్కడ బట్టలు లేవు. అతడు మాధురిని గురించి ఆలోచిస్తుండగానే ఆమె పొదల మధ్యనుండి బయటికి వచ్చింది. రాజేంద్ర ఆమె రాకను గమనించని వాడిలాగా ముఖం పక్కకు తిప్పుకొన్నాడు.

మాధురి చాటునుండి అతని వాలకాన్ని, అతడు తన కొరకు ఎంతో ఆత్రంగా దిక్కులు చూడటాన్ని గమనించింది. అయితే ఏమీ ఎరుగనిదానిలా అతని దగ్గరకు రాకుండా పాడుబడిన శిథిలాల వైపు నడిచింది. ఆమె రాజేంద్రతో మొదటి సారి ఏకాంతంగా కలిసి మాట్లాడి తన మనసులోని రహస్యాన్ని, బాధను చెప్పుకొన్న గుహవైపు నడిచింది. గుహలో ప్రవేశించే ముందు మరోసారి వెనక్కు తిరిగి రాజేంద్ర వైపు చూసింది. అతడు ఇంకా అక్కడే కూర్చుని ఏవో ఊహల్లో,ఆలోచనల్లో లీనమైయున్నాడు. అతడు బాహ్య ప్రపంచానికి దూరంగా కలల లోకంలో విహరిస్తున్నాడు.

ఆమె గుహలో చాటున నిలబడి అతని రాకకై ఎదురు చూస్తోంది. తన మనసును కల్లోలపరుస్తూ, హృదయంలో పెను తుఫానురేపుతూ, మాటల ద్వారా వ్యక్తం చేయలేని భావాలను చేతి వ్రేలితో నేలపై రాసింది. అతడు తప్పక గుహవైపు వస్తాడని ఆమెకు పూర్తి విశ్వాసం ఉంది.. ఈ ఏకాంత సమయంలో అతడు తన దగ్గరికి వస్తాడు... తన హృదయంలో పొంగి పొర్లే భావాలను నేలపై రాసిన మాటలు వెల్లడి చేస్తాయి. నిజం చెప్పాలంటే తాను రాజేంద్రను మనస్ఫూర్తిగా ప్రేమిస్తోంది.... వాసు తన ప్రేమను గెలుచుకోలేకపోయాడు.

ఆమె గుహలో నుండి మరోసారి బయటకి తొంగి చూసింది. అతడింకా యథాస్థానంలోనే కూర్చుని వున్నాడు. మాధురి మనసు ఈ పరాజయం వల్ల గాయపడింది. ఆమె నిరాశ చెందింది. అతడేమో తన హృదయాంతర్గత భావాలను గ్రహించకుండా అక్కడే జడపదార్థంలా కూర్చొన్నాడు. ఆమెఅక్కడే నిలబడి ఆలోచిస్తోంది. తాను నిస్పృహ చెందవలసిందేనా? తనకు నిరాశే మిగులుతుందా? అతడు తనతో మాట్లాడుతూ చాలాసార్లు మనసులోని ప్రేమను వ్యక్తం చేసి ఉన్నాడు. మరి ఇప్పుడు...

ఆమె ఇంకోసారి అటువైపు దొంగచూపు చూసింది. రాజేంద్ర తానున్న చోటు నుండి లేచి ఆమెవైపుగా నడిచి వస్తున్నాడు. ఆమె శరీరమంతా చక్కిలిగింత పెట్టినట్లయి పులకించింది. ఒళ్ళంతా విద్యుత్తు ప్రవహించినట్లయింది. ఆమె ఊపిరి బిగబట్టి ఇంకా నాలుగడుగులు



ముందుకు నడచి, చీకట్లో దాక్కొని అతని కొరకు నిరీక్షిస్తోంది.

ఆమె దృష్టి గుహ ముఖ ద్వారం వైపు కేంద్రీకరించబడి వుంది.

"మాధురీ"! ఆమెను పేరుపెట్టి మెల్లగా పిలిచిన శబ్దం. ఆమె చీకటిలో గోడకు ఆనుకుని మౌనంగా నిలబడి వుంది. మళ్ళీ పిలుపు వినిపించింది. ఆమె శ్వాస బిగపట్టి ఇంకా బిగించుకొని నిలబడింది. రాజేంద్ర గుహలో ప్రవేశించాడు, చీకట్లో తడుముకొంటూ ఆమెను దాటి ముందుకు వెళ్ళాడు. అతడు మళ్ళీ ఆమెను పేరు పెట్టి పెద్దగా పిలిచాడు. మాధురి తాను దాగిన చోటునుండి అతన్ని స్పష్టంగా చూస్తోంది. కొన్ని రోజుల క్రితం ఆమె, రాజేంద్ర కలసి మాట్లాడిన చోటు, ఆమె తన మనస్సులో దాగిన భావాలు విప్పి చెప్పిన చోటు అదే. ఈ రోజు ఇద్దరూ మళ్ళీ అదే చోట ఏకాంతంగా కలిశారు. ఆమె తన ప్రేమను, తన మనోవాంఛను తన భావాలను వివరించి చెప్పాలని ఆతుర పడుతోంది. ఆమె పెదాలు మనసులో సుడి తిరుగుతున్న భావాలను చెప్పి వేయా లని త్వరపడుతున్నాయి. ఈరోజు ఆమె తన మనసులో ఏమీ దాచుకోకుండా అంతా చెప్పేయాలని నిర్ణయించుకుంది.

రాజేంద్ర ఆశ్చర్యపోతూ అక్కడే నిలబడి ముందుకు చూస్తున్నాడు. మాధురి మెల్లగా అడుగులు వేస్తూ వచ్చి అతని వెనుక నిలబడింది. అతడు ఇంకొకసారి గట్టిగా పిలిచాడు. "మాధురీ!" అతని పిలుపు ఆ గుహలో మారుమోగి మళ్ళీ అతని చెవులను తాకింది. అక్కడి వాతా వరణంలో ఆ పిలుపు ఆ ప్రతిధ్వని మూలంగా కొంత కదలిక కలిగింది. మాధురి వెనుకనుండి తన చేతిని అతని భుజాల మీదుగా వేసి గొంతును చుట్టి వేసింది. తలను అతని వీపుకు ఆనించింది. ఆమె శరీరం అంతా వేడెక్కిపోయింది. అతని పట్ల ఉన్న ఆకర్షణతో, ప్రేమతో, మోహంతో ఆమె మత్తెక్కిపోయింది. ఆమె ఆగి ఆగి మాట్లాడుతుంది. ఏవేవో సంబంధం లేని మాటలు అంటోంది–

"రాజూ! నా ప్రియమైన రాజూ! ఇక నన్ను నేను నిగ్రహించుకోలేను. నాపై నాకే నమ్మకం పోతోంది... పరీక్షకు తట్టుకుని నిలబడే శక్తి నాలో లేదు. చూడు నా గుండె ఎలా దడ దడ కొట్టుకుంటోందో... నన్నిక వేధించకు. విరహంలో ముంచి వేయకు నన్ను. నేను ఎంత కాలం ఈ విరహాగ్నిలో దహించుకొనమంటావు ? నాకు నిష్కృతి లేదా ?''

ఆమె మాట్లాడుతూనే వుంది. రాజేంద్ర మౌనంగా వింటూవున్నాడు. అతని శరీరం అంతటా విద్యుత్తు ప్రవ హించినట్లయింది. అతని ఒళ్ళు పులక రించింది. రోమాలు నిక్క బొడచు కొన్నాయి. ఆమె వైపుకు తిరిగి ఆమె నడుము మీద చెయ్యి వేసి దగ్గరకు లాక్కున్నాడు. ఆమెను గట్టిగా గుండె లకు హత్తుకున్నాడు వాళ్ళు ఆ స్థితిలో ఎంతసేపు గడిపారో వాళ్ళకే తెలియదు. వాళ్ళు ఒకరి కౌగిలిలో మరొకరు ఒదిగిపోయారు. ఇద్దరి హృదయాలు గాఢంగా హత్తుకున్నాయి. ఇద్దరి గుండెలు ఒకటై వేగంగా కొట్టుకొంటున్నాయి వారి శ్వాసలు ఒకటయ్యాయి. ఈ కలయికలో శాంతి వుంది, సుఖం వుంది, తృప్తి వుంది. ఈ సుఖం కోసం, ఈ తృప్తి కోసం ఆమె మూడేండ్లుగా పరి

తపిస్తోంది. రాజేంద్ర వెచ్చగా వున్న తన పెదాలతో ఆమె నుదిటిపై పడిన నల్లని వెంట్రుకలను మృదువుగా స్పృశించాడు. ఆస్పర్శలో ఏదో అంతు లేని మాధుర్యాన్ని, అర్థంకాని వింత అనుభవాన్ని రుచి చూశాడు.

మాధురి ఉన్మత్తురాలిలాగా ఆగి ఆగి మాట్లాడుతోంది. ఏ మే మో అంటోంది...అవే మాటలు మళ్ళీ మళ్ళీ అంటోంది. కొన్ని సంవత్సరాల క్రితం రాజేంద్రతో పలికిన మాటలు. అతనితో చేసిన ప్రమాణాలు...మళ్ళీ అంటోంది. కానీ ఈ మాటల్లో, ఈ ప్రమాణాల్లో నూతనత్వం ఉంది, నిర్మలత్వం ఉంది.

ప్రేమ సంభాషణలు ఎన్నిసార్లు మాట్లాడినా పాతబడవు...అవి ప్రతి సారీ కొత్తగానే వుంటాయి. అయితే ఇప్పుడు పరిస్థితులు మారాయి...ఆమెకు ఇప్పుడు ఆ ప్రమాణాలు చేసే అధికారం, ప్రేమను గురించి మాట్లాడే అధికారం ఉందా? ఇప్పుడు అధికారం ఏమిటో, కర్తవ్యం ఏమిటో, కర్తవ్య రాహిత్యం అంటే ఏమిటో ... వాళ్ళిద్దరిలో ఎవరికీ తెలియదు...... తెలిసినా వాటిన్నిటిని గురించి ఆలోచిస్తూ, ఇంత గొప్ప అవకాశాన్ని వ్యర్థం చేసుకొనేంత నిగ్రహం ఇద్దరిలోనూ లేదు.

* * *

ఇద్దరూ ముంగిలి దాటి ఇంటి ఆవరణలో అడుగు పెట్టేసరికి సూర్యుడు అస్తమించాడు. సంధ్యా కన్య ప్రకృతిపై చీకటి ముసుగు కప్పుతోంది. ఇద్దరూ మౌనంగా వున్నారు. ఇద్దరూ పగలంతా బయటే గడిపారని, ఇంట్లోలేరని వాళ్ళకు అప్పుడు గుర్తుకు వచ్చింది. వాసు వచ్చి ఉంటాడేమో అని ఇద్దరూ భయ పడ్డారు.

వాళ్ళు వచ్చిన శబ్దం విని గంగ బయటికి వచ్చి పిక్‌నిక్ సామాన్లు వాళ్ళ దగ్గరి నుండి అందుకొంది. మాధురి మెల్లగా, భయం భయంగా అడిగింది "ఆయన వచ్చారా?"

"రాలేదు అమ్మగారూ! ఇంకా తిరిగి రాలేదు...ఏమీ కబురుకూడా రాలేదు!" గంగ గంభీరంగా జవాబుచెప్పి, సామాన్లు తీసుకుని లోపలికి వెళ్ళింది.

మాధురి తలెత్తి రాజేంద్ర వైపు చూసింది. ఇద్దరూ చిన్నగా నవ్వు కొన్నారు. వాళ్ళు అనవసరంగా భయ పడ్డారు.

హాల్లోకి రాగానే రాజేంద్ర లైటు వెలిగించాలని దానివైపు చెయ్యిచాపాడు. మాధురి అతన్ని చెయ్యి పట్టుకొని ఆపి, ఆ చేతిని తన చెంపలకు ఆనించుకొని గోముగా అన్నది "ఉండనివ్వండి... దాన్ని వెలిగించకండి"

"ఎందుకని ?"

"ఎందుకో, నాకు ఈరోజు చీకటి చాలా బాగుంది!"

"ఇప్పుడు బాగానే వుంటుంది. కాని కొంచెం సేపైన తర్వాత ఈ చీకటే ధైర్యాన్ని, సంతోషాన్ని తినేస్తుంది."

"ఎలా?"

"రాత్రి ఇంకా ఎక్కువైనపుడు... అంతటా నిశ్శబ్దం వ్యాపిస్తుంది. నేను నా గదిలో నీవు నీ గదిలో ... ఇద్దరమూ ఒంటరితనంలో ఉంటాము. అప్పుడు ఈ చీకటే నల్లని త్రాచుపామై నిన్ను భయపెడుతుంది"

"నేను ఒంటరిగా ఉంటానని మీరెలా చెప్పగలుగుతున్నారు?"





"వాసు ఉదయం దాకా రాలేడు"

"రాకుంటేనేం. మీరున్నారుగా తోడు"

ఆమె అతని కోటు గుండీలను ప్రేమగా తాకుతూ, వేళ్ళతో వాటిని అటు ఇటూ తిప్పుతూ అంది.

"నేనా! నేను నీకు చాలా దూరస్థుణ్ణి"

"మన మధ్య దూరం ఎక్కడిది? మీన మనసుల్లో ఎలాంటి అరమరికలు లేవు రాజూ! నిజం చెప్పాలంటే ఆయన ఎప్పుడూ దగ్గరే ఉంటున్నప్పటికీ ఎన్నో కోసుల దూరాన ఉన్నారనిపిస్తుంది. నీవు దూరాన ఉన్నా నాకు మాత్రం చాలా సమీపాన ఉన్నావనిపిస్తుంది."

"నిజమే మాధురీ! కానీ నా మనసులో మాత్రం భయం భయంగా ఉంది. వాసుకు గనక మన ప్రణయ రహస్యం తెలిసి పోయిందంటే నేను చాలా ఇరకాటంలో పడిపోతాను కదా అని ఆలోచిస్తున్నాను"

"ఛ...ఛ అలాంటి మాటలు అన కండి. ప్రేమలో పిరికితనమా? ధైర్యంగా పరిస్థితులను ఎదుర్కోవాలి"

"ఒక వేళ...అతడు మనల్ని ఇలాంటి స్థితిలో ఇంత దగ్గరగా చూస్తే...?"

"ఏమీ భయపడకండి. ఆయన మనల్ని ఏమీ చేయలేరు. ఆయనలో అంత ధైర్యం లేదు. అంతేకాదు మీరు నన్ను ప్రేమిస్తున్న దృశ్యం చూస్తే ముందు అసూయతో కాలిపోతాడు. బహుశ అప్పుడు ఆయన కూడా ప్రేమిం చడం అంటే ఏమిటో నేర్చుకొంటారేమో"

"అయితే అతనిలో నిజంగా ప్రేమించే హృదయం లేదా ?"

"అలాగే అనుకోండి !"

"ఆ రోజు మధించిన గుర్రాన్ని కొర డాతో కొట్టి వశపరచుకొన్న దృశ్యం గుర్తువస్తే...అబ్బ...మనసు వశం తప్పి, శరీరం అంతా భయంతో గడగడ వణుకు తుంది."

కొన్ని క్షణాలు గడిచిన తర్వాత ఆమె కిల కిల నవ్వి అన్నది. "ఆయన గుర్రాన్ని వశపరచుకోవటం మాత్రం ఎరుగుదురు. స్త్రీని వశం చేసుకోవడం ఎరుగరు. ప్రేమ అంటే ఏమిటి? కోరిక లంటే ఏమిటి ? ఎదుటివాళ్ళలో ఎలాంటి కోరికలు పురి విప్పి నాట్యం చేస్తున్నాయి? ఈ విషయాలన్నీ ఎరుగరు. దేవుడు ఆయనకు ప్రేమించే హృదయం ఇచ్చాడని మాత్రం నేను విశ్వసించలేకున్నాను"

ఈ మాటలని ఆమె తన గది వైపు వెళ్ళబోయింది. రాజేంద్ర ఆమె చెయ్యి పట్టుకొని ఆపుతూ అడిగాడు "ఎక్కడికి?"

"బట్టలు మార్చుకొని ఇప్పుడే వస్తాను."

"కాఫీ అయినా ఇప్పిస్తావా లేదా ?"

"మీరూ బట్టలు మార్చుకోండి... నేనిప్పుడే గంగతో..."

"గంగతో వద్దు. నీ బంగారు చేతులతో...!"

"అయితే కొంచెంసేపు వెయిట్ చేయాల్సి వుంటుంది."

"అలాగే యువర్ ఆనర్ !"

రాజేంద్ర ఆమె చెయ్యి విడిచిపెట్టాడు. ఆమె త్వరగా తన గదిలోకి వెళ్ళి పోయింది.

రాజేంద్ర చిన్నగా ఏదోపాటపాడుతూ దీపం వెలిగించాలని బల్ల వైపు నడి చాడు. ఈ రోజు సంతోషాతిరేకం వల్ల అతని నోటి నుండి అప్రయత్నంగానే పాట వెలువడుతోంది.

గదిలో దీపం వెలిగించగానే అతడు బిత్తరపోయాడు. ఎదుట గదిలో ఒక మూలగా, గోడ వైపు ముఖం తిప్ప

కొని ఎవరో ఈజీఛైయిర్‌లో పడుకొని ఉన్నారు. రాజేంద్ర క్షణంలో అక్కడి పరిస్థితిని అర్థం చేసుకున్నాడు. ఈజీ ఛైయిర్‌లో వాసును చూసి అతడు అకస్మాత్తుగా పులిని చూసినట్లుగా నిశ్చేష్టుడయ్యాడు. ఎవరో ఒక్కసారిగా పది కడవల నీళ్ళు మీద కుమ్మరించినట్లుగా చెమటతో తడిసిపోయాడు.

రాజేంద్ర ముఖం తెల్లగా పాలిపోయింది. కళ్ళు కిందికి వాల్చాడు. సిగ్గు, అవమానం, శరీరంలోని శక్తినంతటినీ లాగివేశాయి.

ఏ విషయంలో అయితే భయపడుతున్నాడో అదే జరిగింది. ఒక్క క్షణంలో అతడు స్నేహితుని దృష్టిలో దిగజారిపోయాడు. ఎవరో ఎత్తైన కొండమీదకు తీసికొని వెళ్ళి అకస్మాత్తుగా కిందికి నెట్టినట్లుగా అతడు భయపడ్డాడు.

కొన్ని నిమిషాలు మౌనంగా గడిచాయి. వాసు తన స్థానం నుండి లేచాడు. అతడు మెల్లగా నడిచి వచ్చి రాజేంద్ర ఎదుట నిలబడ్డాడు. పెదాలపై అతి ప్రయత్నం మీద చిరునవ్వును తెచ్చుకొని అన్నాడు— "మిత్రమా! నీవు ఏమీ భయపడవద్దు. మాధురి చెప్పింది నిజమే! నేను గుర్రాన్ని మాత్రం వశం చేసుకోగలను. కానీ మనుషుల్ని వశం చేసుకోలేను. నాలో ఆ శక్తిలేదు. అందుకు అవసరమైన చాకచక్యం లేదు. నా గుండె ఒక బండరాయిగా మారిపోయింది. అవును. నాకు మీ ఎదుటికి వచ్చే అర్హత ఎక్కడిది? నాకు మాత్రం నా స్నేహంపట్ల ఎంతో గౌరవ భావం ఉంది. నేను మూడు సంవత్సరాల నుండి చేయలేని పనిని నా మిత్రుడు కొన్ని దినాల్లోనే చేసి చూపించాడు. నిజం చెప్తున్నాను. నన్ను నమ్ము. నీవంటే నాకెలాంటి అసహ్య భావంలేదు. పైగా మీ యిద్దరిపట్ల నాలో సానుభూతి యింకా ఎక్కువయింది."

వాసు మాట్లాడే ప్రతి మాట విషబిందువుగా మారి అతని చెవుల్లో దిగుతోంది. రాజేంద్ర ఎక్కువసేపు ఆ మాటలు వింటూ, ఆ బాధను భరిస్తూ అక్కడ ఉండలేకపోయాడు. అతను వడిగా అడుగులు వేస్తూ తన గదికి వెళ్ళాడు. దారిలో మాధురి గది ఉంది. ఆమె గదిలో నుండి మధురంగా, మెల్లగా పాడుకుంటున్న పాట వినిపిస్తోంది. ఇంతక్రితమే రాజేంద్రపై పిడుగులా పడిన ఆపద విషయం ఆమెకు బొత్తిగా తెలియదు. అందుకే మత్తుగా, హాయిగా, మధురంగా తన్మయత్వంలో పాడుతోంది.

గదిలో వెలుగు ఏర్పడక ముందు మాధురి తనతో పలికిన మాటలు రాజేంద్ర చెవుల్లో మారు మోగుతున్నాయి. ఆ క్షణంలో వాసు హృదయంలో రగులుతున్న జ్వాలను గురించి తలచుకొంటేనే అతని రక్తనాళాల్లోని రక్తం అంతా గడ్డ కట్టినట్లయిపోయింది.

అతడు తక్షణమే ఆ చోటును వదిలి వెళ్ళిపోవాలని నిర్ణయించుకొన్నాడు. అతడు తన సూట్‌కేస్ తెరచి గదిలో అక్కడక్కడ పడివున్న బట్టలు తెచ్చి సర్దుకున్నాడు.

తాను వెళ్ళిన తర్వాత ఈ యింట్లో ఏం ఘోరం సంభవిస్తుందో? ఆ సంగతి అనుకుంటేనే భయంతో అతని రోమాలన్నీ గగుర్పొడిచాయి. ఒకవేళ వాసు కోపాతిరేకంతో బల ప్రయోగం చేస్తే...! ఉన్నట్లుండి అతని కండ్ల ముందు మదించిన గుర్రాన్ని వాసు లోబరచుకొన్న దృశ్యం




కండ్లముందు మెదిలింది.

అతడింకా బట్టలన్నీ పెట్టెలో సర్దనే లేదు. అంతలో ఎవరో వెనుకనుండి వచ్చి అతని చెయ్యి పట్టుకున్నారు. అతడు భయంతో ఉలిక్కిపడి అటువైపు తిరిగాడు. వాసు అతని చేతి మణికట్టును తన చేతిలో గట్టిగా పట్టుకొని ఉన్నాడు. ఇద్దరూ ఒకర్ని ఒకరు తీక్షణంగా చూసుకున్నారు. వాళ్ళ కండ్లల్లో ఏమే భావాలు మెదిలాయో వాళ్ళ హృదయాలకే తెలియాలి.

''నీవు మిత్రునిగా యిక్కడికి వచ్చావు....ఇప్పుడు శత్రువుగా యిక్కడనుండి పోనివ్వను'' వాసు బరువైన హృదయంతో, బాధ నిండిన స్వరంతో అన్నాడు.

''ఇందులో మిత్రత్వం, శత్రుత్వం ఏముంది ? నాకు యిష్టం కలిగింది వచ్చాను. వెళ్లాలనిపించింది వెళ్తున్నాను'' తన చేతిని ఒక్క ఉదుటున విడిపించుకొని రాజేంద్ర అన్నాడు.

''మంట రగిలించి వెళ్తున్నావు.దానిని ఆర్పే వాళ్ళెవరు ?''

రాజేంద్ర వాసు మాటలు విని ఆశ్చర్యంగా అతనివైపు చూశాడు. వాసు తన మాటలు కొనసాగిస్తూ అన్నాడు-

''నేనంటున్నది మాధురిగురించి. ఆమె మనస్సులో ప్రేమ అనే నిప్పు రవ్వను రగిలించావు. దానిని మధ్యలో యిలా వదిలివేసి వెళ్ళిపోతావా ? ఇది నీకు న్యాయమా ?''

''మిత్రమా! నేను నీకు భయపడి పారిపోతున్నానని అనుకొంటున్నావా ? సిగ్గుపడి, మొహం దాచుకొని పారిపోతున్నాననిభావిస్తున్నావా! అలాంటిదేమీ లేదు. నేను చేసిన దానికి ఏమీ విచారించడం లేదు. పశ్చాత్తాప పడటం లేదు. నా ఈ ప్రవర్తన నీలో నిద్రాణమై ఉన్న కోరికలను మేల్కొలిపి ఉంటుందనీ, ఇక ముందు అయినా నీవు ఎదుటివాళ్ళ జీవితాలతో చెలగాటం ఆడటం మానుకొంటావని ఆశిస్తున్నాను''

ఈ మాటలని రాజేంద్ర తన సూట్ కేస్ చేతిలోకి తీసికొని బయటకి అడుగు వేయబోయాడు. వాసు చటుక్కున అతని చెయ్యి పట్టుకొని——

''ఏమిటి నీ మొండితనం? నీ పట్టుదల వదిలి పెట్టవా ?'' అని పెద్దగా అన్నాడు.

వాళ్ళిద్దరూ పరస్పరం వాదులాడుకుంటున్న సమయంలో మాధురి ఆ గదిలో అడుగు పెట్టింది. ఆమెను చూచి యిద్దరూ సిగ్గు పడ్డారు.

మాధురి కూడా వాళ్ళిద్దర్నీ ఒకచోట ఏదో విషయంపై తీవ్రంగా మాట్లాడుకుంటున్న సమయంలో చూసి ఆశ్చర్యపోయింది. వాసు ఎప్పుడు వచ్చాడు, ఎలా వచ్చాడు? అనే విషయం ఆమెకు ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. అంతలో అక్కడి గంభీర వాతావరణాన్ని మారుస్తూ వాసు ఆమెతో అన్నాడు——

''మాధురీ ! నీవైనా చెప్పు... నేను వద్దంటున్నా మొండి చేస్తున్నాడు''

''ఏమని ?'' ఆమె ఇంకా ఆశ్చర్యం ప్రకటిస్తూ బిత్తరపోయి చూస్తూ అన్నది.

''అలిగి వెళ్ళిపోవడానికి సిద్ధం అవుతున్నాడు. నేను లేకుండా రోజంతా గడపటం చాలా కష్టంగా ఉందట. నీవే చెప్పు. నేను వెళ్ళకుండా ఇంట్లో ఎలా ఉండగలను? అక్కడ కోచ్‌మన్‌కు చాలా సీరియస్‌గా ఉందాయె''

''ఇప్పుడతనికి ఎలా ఉంది ?''





"పాపం...దురదృష్టవంతుడు...చని పోయాడు" అతడు గంభీరంగా సమాధానం చెప్పాడు.

ఈమాట వినగానే ఇద్దరి హృదయాలు క్షణం పాటు ఆగాయి. వాళ్ళ గుండెలు పిడికిలిలో పట్టుకొని పిండినట్లుగా ఉంది. అదే సమయంలో ముంగిట్లో కట్టివేసి ఉన్న గుర్రం పెద్దగా సకిలించింది. దాని సకిలింపులో ఒక వింత క్రూరత్వం ప్రతిధ్వనించింది. వాసు ఉదాసీనభావంతో గంభీరంగా అన్నాడు–

"ఈరోజు ఈ పెంపుడు జంతువు తనను ఎంతో ప్రేమించి, పోషించిన వ్యక్తి ప్రాణాలకే ముప్పు తెచ్చింది"

"కాఫీ రెడీగా ఉంది" మాధురి నెమ్మదిగా ఈ మాటలు చెప్పి బయటికి వెళ్ళి పోయింది. వాసు రాజేంద్ర చేతిలోని సూట్‌కేస్‌ను బలవంతంగా లాగి ఒక పక్కగా పెట్టాడు. అతని భుజంపై చేతితో తట్టి "పద...కాఫీ తాగుదాం!" అన్నాడు.

రాజేంద్ర అన్యమనస్కంగా, వివశుడై నిద్రలో నడుస్తున్నవాడిలా నడిచి వాసు వెంట బాల్కనీలోకి వచ్చాడు. మాధురి ముందుగానే వచ్చి అక్కడ కూర్చుని కాఫీ కలుపుతోంది. ఇద్దరూ కుర్చీల్లో కూర్చున్నారు. వాసు బలవంతపు నవ్వు పెదాలపై తెచ్చుకొని అన్నాడు—"రాజీ నీ కోపాన్నీ, తాపాన్నీ మొత్తంగా మూట కట్టి ఆ చెరువులో పారవెయ్యి. నేను ప్రమాణం చేసి చెప్తున్నాను. నిన్ను ఇక ఒంటరిగా వదిలి వెళ్ళను"

రాజేంద్ర మౌనంగా కప్పు అందుకుని కాఫీ తాగసాగాడు. మాధురి రెండో కప్పు భర్తకు అందిస్తూ అడిగింది.

"మీరు ఎప్పుడు వచ్చారు?"

"ఇప్పుడే వస్తున్నాను."

మళ్ళీ వాళ్ళ ముగ్గురి మధ్య మౌనం తాండవించింది. మాధురి తనలో అనుకుంటోంది–

'రాజేంద్ర కావాలనే ఇలా చేస్తున్నట్టున్నాడు. లేకుంటే అతనికి ఇక్కడ నుండి పారిపోవాల్సినంత కష్టం ఏమి వచ్చిందని?' ఈ ఆలోచన వల్లనే ఆమె రాజేంద్ర మౌనానికి అంత ప్రాధాన్యత ఇవ్వలేదు.

ఒక్క గుక్కలో కాఫీ కప్పు ఖాళీచేసి రాజేంద్ర లేచి నిలబడి, అక్కడి నుండి వెళ్ళడానికి సిద్ధం అయ్యాడు. అతన్ని ఆపాలని వాసు చాల ప్రయత్నించాడు. కాని అతని ప్రయత్నం ఫలించలేదు. రాజేంద్ర ఎవరితోనూ ఏమీ చెప్పకుండా పెద్దగా అంగలు వేస్తూ కిందకు దిగాడు. అక్కడ ఉన్న గంగతో ఏమో చెప్పి తలవంచుకొని బయటికి నడిచాడు.

గంగ కాఫీ కప్పులు తీసికొని పోవాలని పైకి వచ్చినప్పుడు వాసు ఆమెను అడిగాడు— "ఏమన్నాడు? నీతో రాజేంద్ర?"

"రాత్రికి అన్నం వద్దు అని చెప్పి వెళ్ళారు"

వాసు మౌనంగా ఉండిపోయాడు. గంగ అక్కడి కప్పులు, గిన్నెలు తీసికొని వెళ్ళిపోయిన తర్వాత అతడు మాధురిని మెల్లగా అడిగాడు—

"ఈ రోజంతా ఏమేం చేశారు?"

"మేమా!" ఆమె అప్రాదమస్తకం వణికింది.

"అంటే! నా ప్రశ్నలో వేరే ఉద్దేశం ఏమీ లేదు. అతన్ని రోజంతా ఒంటరిగా ఉంచి బోరు కొట్టించలేదు కదా అంటున్నాను. అంతే!"

"లేదు...ఒంటరిగా లేదు, ఇద్దరమూ కలిసి భోజనం చేశాము. ఇప్పుడు కలిసే కాఫీ తాగాము కదా!"

''అంతేనా! కలిసి భోంచేయడమేనా! ఎక్కడికైనా షికారు తీసికొని పోయి ఉంటే బాగుండేది కదా!"

"ఆయన మధ్యాహ్నం నిద్రపోయారు. నేనేమో...!"

"నీవు...ఏం చేశావు ?"

''మీరనడం చాల బాగుంది. ఆయనను నేను షికారుకు ఎందుకు తీసికొని పోతాను?"

"అదే మీ ఆడవాళ్ళకు ఎంత చెప్పినా అర్థం కాదు! మంచిది. నీవు వంట తయారు చెయ్యి. నేను అతన్ని బ్రతిమి లాడి తీసికొని వస్తాను."

''ఆయన రాకుంటే... ?"

"ఎందుకు రాడు? నేనుగా స్నేహితుని స్వభావం బాగా ఎరుగుదును." వాసు అమె మాటల్ని లెక్క చేయకుండా రాజేంద్రను వెతుకుతూ యిల్లు దాటి వెళ్ళాడు.

చెరువు గట్టు వెంబడి చాల దూరం వెళ్ళినప్పటికి అతనికి రాజేంద్ర కనిపించ లేదు. అకస్మాత్తుగా చెరువు గట్టున నీళ్ళు కదలిన శబ్దం అయ్యింది. ఎవరో నీళ్ళలో రాయి వేస్తే కలిగే శబ్దం అది. ఆ రాయి వల్ల నీళ్లు బాగా కదిలి అలలు వృత్తా కారంలో నలువైపులా వ్యాపిస్తున్నాయి. అతడు వెంటనే అటువైపు తిరిగి చూశాడు రాజేంద్ర ఒడ్డున ఉన్న పడ వకు వీపు ఆనించి కూర్చొని ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

"నువ్వు యిక్కడున్నావా ? నేను చాల భయపడ్డాను సుమా!" వాసు అతన్ని చూసి అన్నాడు.

"ఎందుకు ? నేను చెరువులో దూకి ఆత్మహత్య చేసుకొంటాననుకున్నావా ?"

"ఛ...ఛ...నీకు ఏమైంది? ఈరోజు యిట్లాంటి మాటలు అంటున్నావు ?"

వాసు రాజేంద్ర దగ్గర కూర్చున్నాడు. రాజేంద్ర ముఖం మరో వైపుకు తిప్పు కున్నాడు. ఒడ్డున ఉన్న చిన్న రాళ్లను ఒకటొకటిగా చెరువులో విసురుతున్నాడు.

కొంచెంసేపు యిద్దరూ మౌనంగా కూర్చున్నారు. రాజేంద్ర ఆగి ఆగి నీళ్ళలో వేస్తున్నాడు. రాయి నీళ్ళలో పడగానే డుబుక్కుమనే శబ్ద వస్తోంది. తర్వాత ఆ ప్రదేశమంతా నిశ్శబ్దం అవ రిస్తోంది. కొంచెంసేపయిన తర్వాత రాజేంద్ర తనలో తాను మాట్లాడుకొంటు న్నట్లుగా అన్నాడు— "నేను రేపు వెళ్తు న్నాను"

"నన్ను ఏటి మధ్యలో వదిలిపోతు న్నావా? ఇలా చేసి నా మనసు క్షోభ పెట్టాలనే వచ్చావా ?"

"వాసూ! నేను వివశుణ్ణి... నేను యిక్కడికి రావడం వల్ల మన యిద్దరి మధ్య ఇలాంటి సమస్య ఉత్పన్నమవు తుందనీ, జీవించడం దుర్భరమవుతుందనీ ఊహించలేదు"

"నీవు ఎందుకలా అంటున్నావు రాజీ? నేను నీకు ఎంతగా ఋణపడి ఉన్నానో నీకు తెలియదు. నీవు నాలో నిద్రాణమై యున్న ఆశలను మేల్కొలిపావు. రస హీనమైన నా జీవితంలో మాధుర్యం నింపావు. కొన్ని రోజులనుండి మాధురిలో చాల మార్పు రావడం గమనిస్తున్నాను. నేను నీకు ధన్యవాదాలు చెప్పనేలేదు"

రాజేంద్ర పరిశీలనగా వాసు కండ్ల లోనికి చూశాడు. అతని ప్రతి మాటలో నమ్మకం, విశ్వాసం నిండి ఉన్నాయి.

వాటిలో కొంచెం కూడా కృత్రిమత్వంలేదు. ప్రతిమాట హృదయపు లోతుల్లో నుండి వచ్చినట్లుగా ఉంది. ఒక భర్త...తన భార్య విషయంలో ఇలాంటి మాటలు అనగలడని అతడు బొత్తిగా ఊహించ లేదు. అందుకే అతనికి ఏమీ అర్థం కావడం లేదు.

వాసు కండ్ల నిండా నీళ్ళు నిండాయి. రాజేంద్ర కొంత కోపం, కొంత సాను భూతి కలిసిన స్వరంతో అతనితో ఇలా అన్నాడు—

"తమ భార్యలపట్ల తగిన శ్రద్ధ, ప్రేమ చూపని భర్తల గతి చివరకు ఇంతే అవు తుంది. తమ భార్యల భావాలను, కోర్కె లను చిగురించక ముందే అణచి వేసే కఠిన మనస్కులకు, భార్యలను నిరా శలో తపింపచేస్తూ నిప్పుల కుంపటిలాంటి శయ్యలపైన పరుండజేస్తూ, వేదనా జ్వాలల్లో వాళ్ళ జీవితాలను సర్వనాశనం చేస్తూ, నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించేవారికి ఒకే శిక్ష విధింప బడాలి ఆ శిక్ష... ఆ శిక్ష వాళ్ళు ఎప్పుడు అనుభవిస్తా రంటే..." అతడు ఒక నిమిషం మౌనంగా ఉండి మళ్ళీ అన్నాడు—

"భార్య ఎప్పుడయినా తెలిసినవాణ్ణి గానీ, నౌకర్ను గానీ లేవదీసుకొని పారి పోయినప్పుడు''

అతడు చివరి మాటలు ఎంతో నిదా నంగా, ఎదుటి వ్యక్తిపై ప్రభావం కలి గించే విధంగా అన్నాడు. ఆ మాటలు వాసు గుండెలపై పాకుతున్న తాచు పాముల్లా పని చేశాయి. కను రెప్పల మీదుగా జారి ప్రవహిస్తున్న కన్నీటిని బలవంతాన ఆపుకొంటూ అతడు గద్గద



స్వరంతో సమాధానం యిచ్చాడు—

"నీవు నిజం చెప్తున్నావు రాజూ! కానీ ఈ విషయంలో నేను వివశుణ్ని!"

"వివశుడివా! అంటే నీవు వివశుడి వయ్యావా! ఎటువంటి? నేను ఈమాట నీ నుండి చాలి ఆలస్యంగా వింటున్నాను"

"రాజూ! స్త్రీ, పురుషుల్ని ఏకం చేసేవి,వాళ్ళమనసులను నిత్య నూతనంగా ఆకర్షణతో, అనురాగంతో నింపివుంచేవి త్యాగాలు చేయించేవి, ఈర్ష్యను కలిగిం చేవి కేవలం 'ప్రేమ' సున్నిత భావనలే అని నేను ఈ నాటి వరకూ నమ్మేవాణ్ణి. కాని... కాని అదంతా అబద్ధం... అంతా మిథ్య అని ఈ దినం తెలుసుకొన్నాను. స్త్రీ, పురుష సంబంధం మనసుకు సంబం ధించిన బంధం కాదు. అది కేవలం శరీర పరస్పర సంబంధంతో ముడిపడి ఉంది. యవ్వనం, శారీరక సౌందర్యం లోని పరస్పర ఆకర్షణ తప్ప మరేమీ కాదు. కామాన్ని తృప్తి పరచుకోవడమే ప్రధాన లక్ష్యం. కోరికలు పాములై బుసలు కొడుతూంటే వాటిని శాంతి పరచటం, తద్వారా తాత్కాలిక తృప్తిని పొందడం మళ్ళీ కోరికలు నిద్రలేవడం... శరీరాన్ని... మనసును ఉద్రేకంలో ఊపడం... ఇలాగే ఈ కోరికల చక్రం తిరుగుతూ ఉంటుంది. కామదాహం తీరు తుంది. కానీ శాశ్వతంగా కాదు. మానవ జీవితం అంటే ఇంతే! ప్రేమ, గీమ అంతా వట్టిది. అలాంటి శాశ్వత అను బంధం ఎక్కడా లేదు, ఎవరిమధ్యాలేదు."

"ఇది ప్రకృతి ధర్మం వాసూ! మనలో కలిగే ప్రతి కోరికనూ తృప్తిపరచ వల సిందే. అదే శాంతికి మూలం. ఆ తృప్తి లోనే, ఆ శాంతిలోనే మానవ జాతి వికాసం, సంతోషం ఇమిడి ఉన్నాయి. ఈ మానసికానందం వల్లనే మానవ

జీవితం ముందుకు సాగుతోంది. ఒకవేళ కోరికలు తీరకపోతే మానవునికి పురోగతే ఆగిపోతుంది. అతడు జడపదార్థంలా అయిపోతాడు. కోరికలతో, అభిలాషలతో కూడి ఉన్నదే జీవితం అంటే. అవి లేకుంటే అది జీవితమే కాదు. ప్రేమంటే జీవితం పట్ల, జీవించడంపట్ల ఉన్న ఆకర్షణే. మరేమీ కాదు."

"నిజమే! కానీ ఎన్నో కోరికలుండీ.. అవి తీరే వీలులేక.. రెక్కలుండీ ఎగిరే శక్తిలేక చుట్టూ ఇంద్ర ధనుస్సులాంటి రంగుల జీవితం వ్యాపించి ఉండి కూడా కాళ్లు, చేతులు కట్టివేయబడి ఉంది...ఇదీ నా పరిస్థితి. నువ్వే చెప్పు రాజీ !.... నన్నేం చెయ్యమంటావో...?"

తన మిత్రుని జీవితంలో దాగిన రహస్యాలు, మనసులో అణిగి ఉన్న బాధ ఇప్పుడు పొంగి అతని పెదాల దాకా వచ్చిందని, రాజేంద్ర గ్రహించాడు. అతడు తన మిత్రునికి ఏదో చెప్పాలనుకున్నాడు. కానీ అతని పెదాలు ఎండిపోయాయి... చెప్పదలచుకున్న మాటలు గొంతులోనే ఉండిపోయాయి. అతని మాటలు...అతని వేదన...అతని జీవితంలోని రహస్యం అన్నీ కలిసి కన్నీరుగా మారి అతని కండ్లలో నిండిపోయాయి. కొన్ని నిమిషాలు తర్వాత ఆ కన్నీరు చెంపల మీదుగా జారి కింద పడింది. ఇంతకంటే అతడేమీ చేయలేని చెప్పలేని స్థితిలో ఉండి పోయాడు.

కొన్ని నిమిషాలు గడిచాయి. రాజేంద్ర మిత్రుని భుజంపై చేయివేసి సానుభూతి, ప్రేమ నిండిన స్వరంతో అన్నాడు-

"నాతో నీ మనసులో దాగి ఉన్న బాధ చెప్పవా?"

"ఎలా చెప్పను! నా నోటితో చెప్పలేకపోతున్నాను."

"జీవితంలో ఎన్నో రహస్యాలు. భార్యల దగ్గర దాచేవి ఉంటాయి. కాని స్నేహితుల దగ్గర మాత్రం కాదు. నన్ను మిత్రునిగా భావించకుంటే శత్రువుగా భావించయినా సరే ఆ రహస్యం ఏమిటో చెప్పు."

"వినగల శక్తి నీలో ఉందా?"

"మిత్రుని బాధను విని సహించగల శక్తి లేకుంటే ఇక నా బ్రతుకు ఎందుకు?"

"అయితే నీవు ఒక మాటివ్వాలి. నన్ను ఈ సమస్యల నడి సముద్రంలో వదిలి మాత్రం వెళ్ళవద్దు"

రాజేంద్ర అభయం ఇస్తున్న వాడిలా అతని చెయ్యి పట్టుకున్నాడు. అతని దగ్గరికి జరిగాడు.




రాత్రి సమయం. ప్రకృతిలో నిశ్శబ్దం రాజ్యం చేస్తోంది. గాలి బొత్తిగా వీచడం లేదు. దూరాన కప్పల బెకబెకలు వినిపిస్తున్నాయి. రాజేంద్ర, వాసు చెరువు గట్టున వెల్లకిలా పడుకొని నీలాకాశాన్ని చూస్తున్నారు. ఆకాశంలో చిన్న, పెద్ద తారకలు విసిరిన వలలాగా వ్యాపిస్తున్నాయి. ఇద్దరూ మౌనంగా ఉన్నారు. ఇద్దరూ ఏదో దీర్ఘాలోచనలో

క్షీణమై ఉన్నారు.

ఇంతకాలం స్నేహితుని మనసులో దాగి ఉన్న రహస్యం విన్న రాజేంద్ర మనసు వికలమైంది. ఒళ్ళంతా ఎవరో కొన్ని వేల సూదులు గుచ్చినట్లు. తనలో బొత్తిగా శక్తి లేనట్లు, అతనికి అనిపించింది. తానేమి విన్నాడో, ఎక్కడ ఉన్నాడో అనే విషయాలు కూడా మరచిపోయాడు. అతడు మనసులో అనుకున్నాడు—"ఇది వాస్తవమేనా! యదార్థం కల్పన కంటే యింత భయంకరంగా ఉంటుందా?"

ఈరోజు వరకు వాసు ఈ బాధలో తానే కాలుతూ ఉన్నాడా? జీవితంలో ఒక భర్త తన భార్యతో చెప్పలేని రహస్యాలు కూడా ఉంటాయా! ఇలాంటి ప్రశ్నలెన్నో అతని మస్తిష్కంలో ఉదయించి అతని మనసును కల్లోలపరుస్తున్నాయి. అతనికి ఊపిరి ఆడనట్లుగా అనిపిస్తోంది. అతడు ఎంతో కష్టంమీద మెడ తిప్పి ఒకసారి వాసును చూశాడు. అతడు వాళ్ళ ముందున్న చెరువులాగే మౌనంగా, ప్రశాంతంగా ఉన్నాడు. ఆకాశం వైపు రెప్ప వాల్చకుండా చూస్తూ ఉన్నాడు.

ఉన్నట్టుండి ఎవరో పిలిచిన శబ్దం విన్పించింది. ఇద్దరి ఆలోచనలకు అంతరాయం కలిగి ఒకేసారి లేచి నిలబడ్డారు. చేతిలో టార్చిలైటుతో ఎదురుగా మాధురి నిలబడి ఉంది. ఆమె వాళ్ళనే పిలుస్తోంది.

ఇద్దరు స్నేహితులు కిమ్మనకుండా తలలు వంచుకొని ఇంటివైపు నడిచారు. మాధురి ముందు నడుస్తోంది. వాళ్ళిద్దరూ ఆమె వెనకే నడిచి వస్తున్నారు. తమ ప్రణయ రహస్యం తెలిసిపోయిందేమో? ఆ విషయం మీదనే యిద్దరూ వాదించుకున్నారేమో? అని ఆమె ఆలోచిస్తూ లోలోపల భయపడుతూ నెమ్మదిగా నడుస్తోంది.

అన్నం తింటున్నప్పుడు కూడా ముగ్గురూ మౌనంగా ఉన్నారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. నవ్వలేదు. వాదించుకోలేదు. మౌనంగా కర్తవ్యం నిర్వర్తిస్తున్నవారి లాగా తింటున్నారు. ముగ్గురూ ఒకర్ని చూసి ఒకరు భయపడుతున్నారేమో అన్నట్లు కనిపిస్తున్నారు. అన్నం విషం లాగా బలవంతంగా వాళ్ళ గొంతులు దాటి లోపలికిపోతోంది.

రాజేంద్ర అన్నం తిన్న వెంటనే తన గదికి వెళ్ళిపోయాడు. మాధురి గుండె దడదడ కొట్టుకుంటోంది. ఆమెకు యిప్పుడు ఒంటరిగా భర్త ఎదుట ఉండాలంటే భయమేస్తోంది. భర్త కూడా లేచి తన గదికి పోతే బాగుండునని ఆమె మనసులో అనుకుంటోంది. కానీ అలా జరగలేదు. అతడు ఒక పత్రిక అందుకొని దగ్గరలోనే ఉన్న ఈజీ ఛెయిర్‌లో కాళ్ళు చాచి కూర్చున్నాడు. మాధురి కొంచెంసేపు ఏం చేయాలో తోచక అక్కడే నిలబడింది. తర్వాత మెల్లగా లేచి పక్కగదిలోకి వెళ్ళాలని ముందుకు అడుగు వేసింది. అంతలో ఉన్నట్టుండి వాసు పిలిచాడు "మాధురీ!" తన పేరు పిలవడం విన్న మాధురి ఆశ్చర్యపడింది. ఆగి భర్త వైపు చూసింది. ఆమె ఆశ్చర్యపోవడం గమనించిన వాసు నెమ్మదిగా అడిగాడు—

"ఏంటి విశేషాలు?"

"ఏమున్నాయి?"

ఆమె చాలా సిగ్గు పడింది.

తన భయాన్ని దూరంగా పారద్రోలాలని చూస్తోంది.

"బాగున్నావా? ఈ దినం ఎందుకో

కాస్త విచారంగా కనిపిస్తున్నావే!''

"లేదే! మీరు మౌనంగా ఉన్నారు. నేను కూడా...!"

"రాజేంద్రకు పాలు పంపావా?"

"ఇవ్వమని గంగతో చెప్పాను"

"అన్ని విషయాలు స్వయంగా చూస్తూ ఉండు. అతడు మామూలు అతిథి కాడు. నాకు అత్యంత ప్రియమైన స్నేహితుడు"

ఆమె మౌనంగా ఉండిపోయింది.

క్షణం ఆగి అతడు మళ్ళీ అన్నాడు- "గంగ మరిచిపోతుందేమో! నీవే వెళ్ళి యివ్వకూడదూ!" అని మళ్ళీ పత్రిక చదవడంలో లీనమయ్యాడు. ఆమె లేచి బయటికి నడిచింది. గంగ పాల గ్లాసు పట్టుకొని రాజేంద్ర గదివైపు పోతూంది. మాధురి ఆమె చేతిలోని గ్లాసు అందుకొని తానే అతని గదివైపు నడిచింది. ఆమె చాలా సేపటినుండి అతనితో ఏకాంతంగా మాట్లాడాలని అవకాశం కోసం ఎదురు చూస్తోంది.

కాని అవకాశమే దొరకలేదు. గదిలో కొద్దిగా వెలుతురు ఉంది. రాజేంద్ర మంచంపై పండుకొని గది పైకప్పును తదేక దృష్టితో చూస్తున్నాడు. అతడు మాధురి గదిలోకి రావడం చూడలేదు. మాధురి ఏదైనా శబ్దం చేసి తన రాకను తెలియచేయాలని ముందు అనుకొన్నది. కాని ఏదో ఆలోచించుకొని ఆ పని చేయ లేదు. బల్లపైన గ్లాసు పెట్టడంలో చిన్న శబ్దం అయింది.

"ఎవరూ...?" అతడు శబ్దం విని ఉలిక్కిపడ్డాడు.

"నేను... మాధురిని"

"మాధురీ... నీవా? నీవు యిక్కడకి ఎందుకు వచ్చావు?"

"మీ కోసం పాలు తెచ్చాను."

"గంగ లేదా? ఈ రోజు పాలు తాగను."

"ఎందుకని? నా చేయి తగిలింది కనుకనా??"

"కాదు మాధురీ! మనస్కరించడం లేదు"

"ఆ విషయమే నేను అడగాలను కొంటున్నాను. ఉన్నట్టుండి మీకు ఏమైంది."

"ఏమీ కాలేదు. ఊరకనే.. ఎందుకో మనసంతా బరువుగా ఉదాసీనంగా అయి పోయింది?"

"ఎందుకని?"

"ఏమో.. ప్రత్యేక కారణమంటూ ఏదీలేదు."

"మీరు నాముందు ఏదో దాస్తున్నారు"

"మనసులోని భ్రమ, అకారణంగా ఏర్పడిన ఒక భయం...అంతే!"

"ఏమిటది?" ఆమె రాజేంద్రకు చాలా దగ్గరగా వచ్చి అతడు చెప్పబోయే విషయం వినాలని చాల ఆత్రపడుతోంది. ఆమె గుండె చాలా వేగంగా కొట్టుకో సాగింది.

"నీ ప్రేమ కేవలం కపట నాటక మేమో అని ఆలోచిస్తున్నాను" రాజేంద్ర మాటలు ఆమెమనసుకు చమ్కీ దెబ్బల్లా తగిలాయి. ఆమె చరా చరా బయటకి వెళ్ళిపోయింది. అలా వెళ్ళడంలో ఆమె కాలు బల్లకు తగిలి పాలగ్లాసు కింద పడింది. పాలన్నీ నేలపై ఒలికిపోయాయి ఆమె ఒక చూపు కింద పడిన పాలవైపు, మరో చూపు రాజేంద్రవైపు చూసి చటుక్కున తల తిప్పుకొని అక్కడ నుండి వెళ్ళిపోయింది. రాజేంద్ర ముఖంపై చిరునవ్వు కన్పించింది. ఆమె బయటకి



వెళ్ళగానే గదిలో దీపం ఆరిపోయింది. గదినిండా అంధకారం ఆవరించింది. కాలం గడిచిపోతోంది. రాత్రి చిక్క-బడుతోంది. కిటికీ తెరిచి ఉంది. బయట చెట్లమీదుగా నడిచి చల్లని గాలులు వీస్తూ మధుర సంగీతం వినిపిస్తున్నాయి. రాజేంద్ర కండ్లు మూతపడటం లేదు. చీకట్లో పడుకొని ఉన్న అతని మనో పటలంపై జరిగిపోయిన సంఘటనల



గతపు చిత్రాలు ఒకదాని తర్వాత ఒకటి కనిపిస్తున్నాయి. అతని కంట్ల ఎదుట తాను, వాసు మిలిటరీ ట్రెయినింగు కాలేజీలో కలిసి చదివిన దినాలు జ్ఞప్తికి వచ్చాయి. ఇద్దరూ చాలా ఆప్త మిత్రులుగా ఉండేవాళ్ళు. ట్రెయినింగ్ కాగానే ఇద్దరినీ వేర్వేరు డివిజన్లలో నియమించారు. తాను మద్రాసుకు వెళ్లాడు. వాసు సరిహద్దుకు పంపబడ్డాడు. రాజేంద్రకు అతని జీవితంలోని అతి ముఖ్య రహస్యం ఈరోజే తెలిసింది... అతని చెవుల్లో దుఃఖపూరితమైన మిత్రుని మాటలు ఇంకా మారుమోగుతున్నాయి. అతడు తన జీవితగాథనంతటినీ, ఇంత కాలం ఎవరికీ చెప్పకుండా దాచిన రహస్యాన్ని రాజేంద్రకు చెప్పాడు.

యుద్ధం జరుగుతోంది. వీళ్ళ కంపెనీని శత్రు సైన్యం చుట్టు ముట్టింది. పదిమంది భారతీయ జవాన్లు బందీలుగా చిక్కారు. వాళ్లు ఒక కొండ గుహలో బంధింప బడ్డారు. లావుపాటి ఇనుప కడ్డీలతో చేసిన ఒక చిన్న ద్వారం, పైభాగాన వెలుతురు రావటానికి ఒక చిన్న కిటికీ. అది కూడా ఇనుప కడ్డీలతో బిగింపబడి ఉంది.

ఆ కిటికీ గుండా వచ్చే వెలుతురును బట్టి వాళ్ళకు రాత్రిం బవళ్ళు తెలుస్తుం డేవి. వాళ్ళకు అన్నము, నీళ్ళు నామ మాత్రంగా ఇచ్చేవారు. ఆ చీకటి గుహలో వాళ్ళు మృత్యు ఘడియలు లెక్కిస్తూ



కాలం గడిపుతున్నారు.

ఒకనాడు వాళ్ళందరూ ఓ సాహస కార్యానికి పూనుకొన్నారు. గోడకు కన్నం వేయడం మొదలుపెట్టి రెండు దినాల్లో పని పూర్తి చేశారు. ఒక మనిషి పాములాగా పాకుతూ బయటికి పోగల్గిన మార్గం తయారు చేశారు.

మూడో రాత్రి బయటకు వెళ్ళిపోవాలని ప్లాను సిద్ధం చేశారు. వరుసలో వాసు అయిదవ వాడు. అంతటా నిశ్శబ్దం ఆవరించి ఉంది. పరిస్థితి అనుకూలంగా ఉందని గ్రహించి వాళ్ళు మెల్లగా తల బయటకు పెట్టి నాలుగు వైపులా చూశారు. ఆ ప్రదేశమంతా నిశ్శబ్దం రాజ్యం చేస్తోంది. దూరాన ఇద్దరు సిపాయిలు పహరా ఇస్తున్నారు. వాసు మెల్లగా లేచి నిలబడ్డాడు. కింద గుహలో ఉన్న సహచరులకు సాయం చేశాడు. చిన్నగా పాకుతూ కొంచెం దూరం వెళ్ళాడు. ఒక రాయి కిందపడి శబ్దం అయింది. చటుక్కున వంగి పొదల చాటున నేలపై బోర్లా పడుకొన్నాడు. కాపలావాళ్ళు తమలో తాము ఏమిటో మాట్లాడు కొంటున్నారు. వాసు చిన్నగా పాకుతూ ముందుకుపోతున్నాడు. కొంత దూరం వెళ్ళిన తర్వాత లేచి పరుగు లంకించు కొన్నాడు. దురదృష్టవశాత్తు కాలుజారి కింద పడ్డాడు. దబ్బుమని శబ్దం అయింది. కాపలావాళ్ళు వెంటనే పరిస్థితిని గ్రహించారు. ఒకడు గాలిలోకి తుపాకీ పేల్చాడు. రెండవవాడు సెర్చిలైట్ వేసి పరిశీలించి చూస్తున్నాడు.

సెర్చిలైటువెలుగు తనవైపు వస్తున్న కొద్దీ వాసు శరీరం స్వాధీనం తప్పు తోంది. చావు అతి సమీపంలోకి వస్తు న్నట్లు అనిపిస్తోంది. తప్పించుకొనే మార్గమేదీ లేదు. ఏం చేయాలి? లైటు వెలుతురు అతని ముందుగా పక్కకు వెళ్ళింది. అతడు ధైర్యం కూడగట్టుకొని శక్తి కొద్దీ పరుగెత్తసాగాడు. సెర్చిలైటు కాంతి అతని మీద పడుతోంది. వెంటనే తుపాకీ కాల్పుల శబ్దం విన్పించింది. అతని చుట్టూ తుపాకీ గుండ్లు వడగండ్ల లాగా వచ్చి పడుతున్నాయి. అతడు చటుక్కున నేలమీద పడుకొన్నాడు.

కాల్పుల శబ్దం ఆగిపోయింది. వాసుదేవ్ తన శరీరాన్ని బలవంతంగా ఈడ్చుకొంటూ పొదలచాటుకు వెళ్ళాడు. అదృష్టవశాత్తు అతని సహచరులు ఆ పొదచాటునే దాగి ఉన్నారు. పహరా వాళ్ళు తమ దగ్గరకి రాకముందే వాళ్ళు గాయాలతో ఉన్న వాసును తీసుకొని నదిలో దిగారు. ఆ గాఢాంధకారంలో ఈదుతూ నదిని దాటి అవతలి గట్టుకు చేరారు.

వాసుదేవ్ ప్రాణాలయితే దక్కాయి కాని అతనికి చాలా పెద్ద గాయాలు తగిలాయి. ఒక తుపాకి గుండు అతని తొడ గుండా దూసుకొని వెళ్ళింది. క్యాంపులో తాత్కాలిక చికిత్స చేయబడింది. వెంటనే అతన్ని ఆపరేషన్ నిమిత్తం హాస్పిటలుకు పంపారు. గుండు తీసివేయబడింది. ఆపరేషన్ జయప్రదంగా జరిగింది. గాయం మానేంత వరకు అతను రెండు నెలల పాటు హాస్పిటలులో ఉండవలసి వచ్చింది.

అతడు హాస్పిటలు నుండి డిశ్చార్జి అయి వస్తున్న రోజు డాక్టరు అతనికి షేక్‌హాండ్ యిస్తూ అన్నాడు—

"వాసుదేవ్ యు ఆర్ రియల్లీ ఎ లక్కీ ఫెలో!"

"అంతా మీ దయ డాక్టర్! లేకుంటే





నేను బతికే వాణ్ణికాదు."

"అలా అనవద్దు వాసుదేవ్! నేను నా ధర్మం నెరవేర్చాను. అంతే ప్రాణం రక్షించేవాడు ప్రాణం తీసేవాడు ఆ భగవంతుడే. మంచిది. నీవు యిక్కడ నుండి వెళ్ళిపోతున్నావు. వేళ్ళేముందు నీకో ముఖ్య విషయం చెప్పలనుకొంటున్నాను"

"ఏమిటది?"

"నీవు ఒక బాధ్యత కలిగిన మిలిటరీ ఆఫీసరువు. నిన్ను అంధకారంలో అమాయకత్వంతో ఉంచడం నాకు యిష్టం లేదు."

"ఏమిట డాక్టర్ మీరనేది ? నాకేమీ అర్థం కావడం లేదు."

"నీకు ప్రాణ దానం చేయగలిగానే కానీ,నీ ఆనందాన్ని హరించవలచివచ్చింది. అందుకు నేనెంతో విచారిస్తున్నాను."

"డాక్టర్...?"

"అవును...వాసుదేవ్ ! నీప్రాణలు కాపాడటం కోసం విధిలేక నేనీపని చేయవలసి వచ్చింది. గుండు లొడలో చాలాలోతువరకు వెళ్ళింది.

"అయితే...?"

"ఆపరేషన్ సమయంలో నీ శరీరంలోని అతి ముఖ్యమైన ఒక నరం కోయవలసి వచ్చింది. దానిని మళ్ళీ అతికించడం సాధ్యం కాలేదు"

వాసుదేవ్ బిత్తరపోయి డాక్టర్ వైపు చూస్తూ ఉండిపోయాడు.

డాక్టరు ఏమి చెప్పాలనుకొని, దానిని ఎందుకు చెప్పలేకపోతున్నాడో అతనికి అర్థంకాలేదు. అంతలోనే డాక్టరు నెమ్మదిగా తాను చెప్పదలచుకొన్న మాటలు చెప్పాడు.

"వాసుదేవ్!నీవు యిప్పుడు పుంసత్వం లేనివాడివి. నీవు స్త్రీతో సుఖించటానికి అనర్హుడవు". ఈ మాటలు విన్న వాసుకు ఎవరో పెద్ద సమ్మెటతో తలపై కొట్టినట్లయింది. అతడి శరీరం అంతా కంపించింది. వెంట్రుకలన్నీ నిక్కపొడుచుకున్నాయి. యవ్వనప్రాయపు తన కోరికలనన్నింటినీ ఎవరో బలవంతంగా గొంతు పిసికినట్లు అనిపించింది. ఎవరో ఒక పెద్ద మంచుగడ్డను అతని తలపై ఉంచినట్లు, అతని శరీరం అంతా మొద్దుబారిపోయినట్లు అయింది. అతడు తల వంచుకొని మౌనంగా హాస్పిటలు దాటి బయటికి వచ్చాడు.

అతని దుఃఖాన్ని, అతని నిస్సహాయత ను తెలుసుకొన్న రాజేంద్ర షాక్ తిన్నట్లయ్యాడు. అతనికి తనపట్ల, తన ప్రవర్తన పట్ల అసహ్యం కలిగింది. మాధురి అభిప్రాయాల పట్ల కూడా అతనికి కోపం, అసహ్యం ఏర్పడ్డాయి. తాను తన మిత్రుని వీపులో పదునైన కత్తితో పొడిచాడు. తానెంత నీచమైన పని చేశాడు? తానొక మానవత్వం ఉన్న మనిషేనా? అన్న అనుమానం అతనికి కలగసాగింది.

వాసులో ఎంత ధైర్యం ఉంది! అతడు నిజంగా దైవ సమానుడు. అతడు తన భార్యకు వ్యతిరేకంగా ఆమెను నిందిస్తూ ఒకమాట కూడా అనలేదు. కాని మాధురి ఆమె అతన్ని ఓ బండరాయిగా భావిస్తూంది. ఆమె తన కర్తవ్యాన్ని ... తన ప్రేమను ఎంత త్వరగా మరిచిపోయింది. అతనికి వాసు అన్న మాటలు మాటి మాటికీ జ్ఞపికి వస్తున్నాయి.

"నేను అంతా గ్రహించాను. ప్రేమలో ఏమీలేదని తెలుసుకొన్నాను. ప్రేమకు మూలం కాముకత్వం తప్ప మరేమీ కాదు. కామం లేని ప్రేమ వట్టి మోసం...... అబద్ధం"

అతడు రాత్రంతా ఈ ఆలోచనల్లోనే గడిపాడు. నిద్రపట్టక ఎప్పుడు తెల్ల వారుతుందా అని ఎదురు చూస్తూ గడిపాడు. వెంటనే ఆ చోట్ని వదిలిపెట్టి వెళ్ళాలనీ, ఇంకెపుడూ వాళ్ళకు తన ముఖం చూప కూడదనీ అనుకున్నాడు.

అతడు రాత్రికి రాత్రే పారిపోవాలని కూడా అనుకొన్నాడు. కాని దుఃఖ పూరితమై, దీనంగా ఉన్న వాసు ముఖం గుర్తుకు వచ్చి అతని పాదాలు ఆగి పోయాయి.

ఈసారి మాత్రం అతను తన స్నేహి తుణ్ణి మోసం చెయ్యదలుచుకోలేదు.



"రాజా! ఏమిటి నువ్వు చేస్తున్న పని ?"

''వాసూ! ఇక నాకు వెళ్ళడానికి అనుమతి యివ్వు!"

"నీకేమైనా పిచ్చెక్కిందా? నీవు వెళ్ళే వీలు లేదు"

వాసు అతని చేతుల్లో ఉన్న బట్టలు తీసికొని అలమరలో పెడుతూ మళ్ళీ అన్నాడు–

''నీకు జ్ఞాపకం ఉందా? నీవు నాకు ఇచ్చిన మాట అప్పుడే మరచిపోయావా?"

''ఏమని ?"

''నన్ను సమస్యల సుడి గుండంలో వదిలి వెళ్ళనని"

"నేనే సుడిగుండంలో చిక్కుకొని అల్లాడుతున్నాను. ఇక నీకేమి సహాయం చేయగలను?"

"అలా అనకు. వరదలో కొట్టుకొని పోతున్న వారికి చిన్న గడ్డిపోచ కూడా ఒక పెద్ద ఆధారం అవుతుంది"

"నీకు తెలియదు వాసూ ! ఇక నేను ఇక్కడ ఉండటం మీ యిద్దరికీ శ్రేయ స్కరం కాదు"

"అని నువ్వనుకొంటున్నావు రాజా ! కానీ నేనలా అనుకోవడం లేదు నా మనసులో ఉన్న మాట చెప్ప మంటావా ?"

"ఏమిటి ?"

"రెండు రోజుల్లో నీ సాహచర్యం ఫలితంగా మాధురి జీవితం ఎంతో మారి పోయింది. మీ యిద్దరి హృదయాల్లో దాగి ఉన్న ప్రేమ పొంగి పొర్లింది. కళకళ లాడుతున్న ఈ సుందర వనాన్ని మళ్ళీ పాడు చేస్తావా? ఇలా చేయడం వల్ల నీకేం ప్రయోజనం?"

"నువ్వు...నన్ను ఉండమని బల వంతం చేస్తున్నావా?"

"అవును. నేనే అంటున్నాను. మాధురి లోకం దృష్టిలో నా భార్యే. కాని ఆమె జీవితాన్ని చిరకాలం రసహీనంగా ఉంచటం నాకు సాధ్యం కావటం లేదు. ఆమె, నువ్వు కలిసి సుఖజీవనం గడుపు తుండాలని నేను కోరుకొంటున్నాను. మీ ఇద్దరూ నవయవ్వనంలో ఉన్నారు. మీరు ఇంతకు పూర్వమే ఒకర్నొకరు ప్రేమించుకొన్నారు. భగవంతుడు మీ ప్రేమను కొనసాగించాలి. అందులోనే నాకు కూడా ఆనందం లభిస్తుంది"

"కానీ ... వాసూ! ఇది చాలా విచిత్రంగా ఉంది. ఇలా చేయడం వల్ల




నీలో ఈర్ష్య, బాధ కలుగవా ?"

"బాధ... ఇక నాకు జీవించినంత కాలం అనుభవించడానికి మిగిలింది ఈ బాధ ఒక్కటే ! అలాంటప్పుడు నిర్దోషి అయిన ఆమెను కూడా నేను ఈ విరహ జ్వాలల్లో నిరంతరం కాలిపోయేటట్లు ఎందుకు చేయాలి?"

"అయితే నీవే స్వయంగా ఆమెను పాపం చేయమని ప్రోత్సహిస్తున్నావా ? నీవు...నీ కళ్ళ ఎదుట యిలా జరుగుతుంటే చూస్తూ...?''

"పాపమో పుణ్యమో ఆ భారమంతా నాదే! ఆమెకు వాటితో ఏమీ సంబంధం లేదు''

''వీల్లేదు...ఇలా జరగడానికి వీల్లేదు. నువ్వు బలవంత పెట్టి నా ద్వారా ఆమెను ఈ అక్రమ సంబంధానికి, పాప కార్యానికి ప్రోత్సహింతటం ఏమీ బాగా లేదు. అలా జరగడం అసంభవం''

"అయితే రాజూ ! నా మాట ఒకటి వింటావా? ఆమె నన్ను వదిలి పెట్టి ఎవరో పరాయివానితో లేచిపోతే బాగుంటుందా? అప్పుడు నేను ఎవరికైనా నా ముఖం చూపించగలనా! ఆమె ఇతరులకు నా జీవితంలో దాగిన ఈ రహస్యాన్ని బట్టబయలు చేసి నన్ను అపహాస్యానికి గురి చేసే... ఆ అవమానం భరించలేక నేను ఆత్మహత్య చేసికొంటే ?''

అతని మాటలు విన్న రాజేంద్రకు ఏమీ తోచలేదు. అతను పెద్ద ఇబ్బందిలో పడ్డాడు. జవాబివ్వలేకపోయాడు. చేతులు నులుముకొంటూ, దీర్ఘంగా ఆలోచిస్తూ కిటికీ దగ్గరికి వెళ్ళాడు.

అప్పుడే తెల్లవారింది. అతడు ఆకాశం వైపు చూస్తూ నిలబడ్డాడు. అతని మనసంతా అశాంతిగా, అల్లకల్లోలంగా ఉంది. వాసు వచ్చి అతని వెనక నిలబడ్డాడు. అనునయిస్తున్న ధోరణిలో ఇలా అన్నాడు—"ఆమె ఎవరితోనైనా పారిపోవడం కంటే, నీ దానిగా ఉండటం ఎంతో మేలు. నువ్వు చేసే ఈ మేలు నేను జీవిత పర్యంతమూ మరచిపోను''

''మరోసారి బాగా ఆలోచించుకో వాసూ!'' అతడు స్నేహితుని వైపు తిరుగుతూ అన్నాడు.

''అంతా ఆలోచించే నీతో ఈ మాటలు చెప్తున్నాను"

''అయితే నాకొక మాటివ్వాలి''

''ఏమని?''

''మా ప్రేమ మార్గంలో కంటకంగా మారననీ... తనను అసహ్యించుకొంటున్నట్లు గానీ, ద్వేషిస్తున్నట్లుగా నీ మాధురికి తెలియ నివ్వననీ''

''అసహ్యించుకోవడమా ? నేనామెను యిప్పటివరకూ గాఢంగా ప్రేమిస్తున్నాను ఇకముందు కూడా అలాగే ప్రేమిస్తాను"

"ఆమె ఎక్కడ ఉంది ?'' రాజేంద్ర అడిగాడు.

"నిద్రపోతూంది. నువ్వు వెళ్ళి ఆమెను నిద్ర లేపు. నేను షికారు వెళ్ళేందుకు గుర్రాల్ని సిద్ధం చేయిస్తాను''

''ఆమెను నీవే వెళ్ళి లేపకూడదూ?!"

''వద్దు బ్రదర్...నీవే వెళ్ళు" వాసు నవ్వుతూ అని బయటికి నడిచాడు.

అతని నవ్వులో దాగి ఉన్న విషాదాన్ని రాజేంద్ర గమనించాడు. ఇతడు చాలా విచిత్రమైన మగాడిలా కనిపిస్తున్నాడు. తన భార్యను బుద్ధి పూర్వకంగా పాపకూపంలోకి తోసి, తర్వాత తన మనశ్శాంతిని వెదుక్కొంటున్నాడు. ఒకవేళ అతడు తనను పరీక్షించడానికి

ఇదంతా చేయడంలేదు గదా! రాజేంద్రకు ఏం చేయాలో తోచడం లేదు. ఇక్కడికి రావడం వల్ల ఇంత పెద్ద చిక్కు సమస్య ఎదురవుతుందని అతడు ఎప్పుడూ ఊహించలేదు.

అన్యమనస్కంగా అతడు మాధురి నిద్రపోతున్న గది వైపు అడుగులు వేశాడు. వరండాలో అమర్చిన పూల గుత్తులలో నుండి ఒక గులాబీని తెంచి చేతితో పట్టుకున్నాడు. మాధురి తన పడక పైలేదు. అతడు గదిలో నలువైపులా చూశాడు. బాత్‌రూమ్ తలుపు తెరచి ఉంది. ఆమె ఇప్పుడే అందులోకి వెళ్ళి ఉంటుందని అతడు గ్రహించాడు. అతడు పరదా చాటున నిలబడి ఆమె ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాడు.

కొంచెం సేపయిన తర్వాత బయటికి వచ్చింది. టవలుతో ముఖం తుడుచుకుంటూ అద్దం దగ్గరికి వెళ్ళి తలదువ్వుకో సాగింది. రాజేంద్ర శబ్దం చేయకుండా వెళ్ళి ఆమె వెనక నిలబడ్డాడు. తన చేతిలో ఉన్న గులాబి ఆమె జడలో పెట్టబోయాడు. అద్దంలో అతని ప్రతిబింబాన్ని చూసిన మాధురి ఉలిక్కిపడి వెనుదిరిగి చూసింది. ఆశ్చర్యంగా అడిగింది.

"ఓహ్! మీరా!... ఈ సమయంలో... ?"

గులాబీ పువ్వు రాజేంద్ర చేతిలో నుండి జారి నేలమీద పడింది. మాధురి భయం భయంగా నాలుగు వైపులా చూసి వంగి ఆ పువ్వును అందుకోబోయింది. అదే సమయంలో రాజేంద్ర కూడా వంగాడు. ఇద్దరి చేతులూ ఒకేసారి పువ్వును పట్టుకొన్నాయి. ఇద్దరి శరీరాల్లో విద్యుత్తు ప్రవహించినట్లయింది. ఆమె భయంతో వణికింది. మాధురి చెయ్యి వదులు అయింది. రాజేంద్ర పువ్వును అందుకొని ఆమెవైపు చెయ్యి చాపుతూ అన్నాడు.

"నీవు అంగీకరిస్తే ఈ పువ్వు నీ జడలో పెట్టాలనుకొంటున్నాను'' మాధురి సిగ్గుతో తల వంచుకొంది. సిగ్గు, భయం కలసి ఆమె నోటికి తాళం వేశాయి. రాజేంద్ర ఆమె సందేహిస్తుందని గ్రహించి కింది వైపుకు చూస్తూ అన్నాడు–

"మీ ఆయన నీ కోసం నిరీక్షిస్తున్నాడు."

"ఎక్కడ?"

"కింద.. ముంగిట్లో.. గుర్రపు స్వారీ చేయాలట"

"నాతో ఈ విషయం చెప్పలేదే!"

"చెప్పలేదు. కాని నిన్ను పిలుచుకొని వెళ్ళడానికే నన్ను పంపాడు'' వాసు కింద ఉన్నాడని తెలిసిన ఆమె నిశ్చింతగా నిశ్వాస వదిలింది. ఆమె మళ్ళీ అద్దంలో ముఖం చూసుకొంటోంది. రాజేంద్ర రెండడుగులు ముందుకు వేసి ఆమె జడలో గులాబీ పువ్వు తురిమాడు.

"రాత్రంతా ఎలా గడిపారు?" మాధురి కింది పెదవిని పంటితో నొక్కుతూ మెల్లగా అడిగింది.

"ఏమని చెప్పమంటావు? నవ్వుతూ గడిపాననా? ఏడుస్తూ...గడిపాననా?'' రాజేంద్ర చివరి మాటలు నెమ్మదిగా ఆగి ఆగి అన్నాడు. మాధురి చిన్నగా నవ్వి అన్నది–"ఇక పగలంతా ఎలా గడుపుతావు?''

"పగలు కూడా నీతో కలిసే గడుపుతాను''

"నేను మీ వెంట రాకపోతేనో?"

"వాసు ఒక్కడే వెళ్తాడు"




"మరి మీరు ?''

"నేను...నేనా! నీవు లేకుండా నేను వెళ్ళలేను''

ఈ మాటలు విన్న ఆమె మౌనంగా అద్దంలో తన రూపం చూసుకోసాగింది. అతడు అలాగే నిలబడి ఆమెనే చూస్తూ ఉన్నాడు. కిందనుండి గుర్రాల అరుపు వినిపించింది. ఇద్దరూ ఉలిక్కిపడి ఒకర్నొకరు చూసుకున్నారు. రాజేంద్ర ఆమె దగ్గరికి జరిగి అన్నాడు-

''ఏమి నిర్ణయించావు ?"

"మీరు పదండి! నేను బట్టలు మార్చుకొని వస్తాను''

మరి కొద్దిసేపట్లో వారు ముగ్గురూ గుర్రాలపై స్వారీ చేస్తూ, చెరువు గట్టు వెంబడి సాగిపోతున్నారు. సూర్యుడింకా ఉదయించలేదు. చల్లగా వీచే గాలులు వారి మనసులను తేలికపరిచాయి. గుర్రాల కళ్ళాలు పట్టుకొని పోతూ, చుట్టూ ఉన్న అందమైన దృశ్యాలను చూస్తూ ఆనందంతో పరవశించిపోతున్నారు. వాళ్ళు తమ తమ ఆలోచనల్లో, తమ ఊహల్లో లీనమై ఒకర్నొకరు గమనించకుండా ఒకరితో ఒకరు మాట్లాడకుండా ముందుకు సాగిపోతున్నారు. గ్రామం వదిలి చాలా దూరం వచ్చారు. వాసు వాళ్ళకు చాలా దూరం ముందుకు సాగిపోయాడని గమనించిన మాధురి ఆశ్చర్యపోయింది. వాళ్ళిద్దరూ ఏవేవో ఆలోచనల్లో లీనమై ఉండటం మూలంగా, వాసు వాళ్ళిద్దరినీ వెనక వదిలి ముందుకు సాగిపోయాడు.

ఆమె దృష్టి మరల్చి రాజేంద్ర వైపు చూసింది. గాలికి చెదరిపోతున్న ముంగురులను సరి చేసుకుంటూ అన్నది "మీరు వెళ్ళలేదా?"

"ఎక్కడికి?"

"ఆయన వెంట...స్వారీ చేస్తూ...!"

"నిన్ను ఒంటరిగా వదిలా! ఎలా వెళ్ళ మంటావు?"

"ఎందుకో గాని...ఈరోజు నాకు ఒంటరిగా ఉండాలనిపిస్తోంది."

"అయితే సరే!" అని రాజేంద్ర కళ్ళెం లాగి గుర్రాన్ని పరుగు తీయించాడు. మాధురి అతన్ని పేరు పెట్టి పెద్దగా పిలిచింది. ఆపాలని ప్రయత్నించింది కానీ అతడు ఆమె పిలుపు అందనంత దూరంగా వెళ్ళిపోయాడు.

కొంచెం సేపట్లో అతడు వాసు దగ్గరికి చేరాడు. అతని పక్కనే గుర్రాన్ని నడిపిస్తూ అన్నాడు—"నీవు ఎందుకు ఇంత దూరం వచ్చావు?''

"ఒక జింకను చూశాను...ఎక్కడ మాయమైందో ఏమో! కనిపించలేదు" వాసు తుపాకి భుజానికి తగిలించుకొంటూ జవాబు చెప్పాడు. తర్వాత అతడు ఒంటరిగా వచ్చాడని గమనించి అడిగాడు. ''మాధురి ఏదీ?"

''వెనక వస్తున్నట్లుంది''

"నీవు ఆమె వెంట వచ్చి ఉన్నట్లయితే బాగుండేది. ఒంటరిగా భయపడుతుందేమో!"

"ఎందుకు భయపడుతుంది?" రాజేంద్ర నెమ్మదిగా అన్నాడు.

''ఎంతైనా స్త్రీ కదా! నీవు ఇక్కడే ఉండు. నేను అడవి లోపలికి వెళ్ళి జింకను వెదుకుతాను. ఆమె వచ్చేంత వరకు నిరీక్షిస్తూ ఉండు. తిరిగి వచ్చేటప్పుడు కలుసుకుందాము."

ఈ మాటలని వాసు గుర్రం వేగాన్ని పెంచి రెండు నిమిషాల్లో కనుమరు



గయ్యాడు. రాజేంద్ర గుర్రాన్ని వెనక్కు మళ్ళించాడు. మాధురి కోసం ఎదుట చూడసాగాడు. కొంచెం సేపటికి ఆమె కూడా గుర్రాన్ని పరుగు తీయిస్తూ

ఆయాస పడుతూ అక్కడికి వచ్చింది. రాగానే అన్నది—''భలే పని చేశారే? నన్ను ఒంటరిగా వదిలి పెట్టి వచ్చారు!"

"ఒంటరిగా ఉండటానికి ఇష్టపడుతున్నాను అని నీవే అన్నావుగా"

''మీరు నామాట బాగా విన్నారా!"

"ఏమన్నావు."

''ఒంటరితనం కోరుతున్న మాట నిజమే! కాని మీతో కలిసి."

"అదా సంగతి...అందుకే నేను ఆగాను."

''ఈరోజు మీకు ఏమైంది?"

"ఏమిటి?"

''చాలావిచిత్రంగా ప్రవర్తిస్తున్నారు. కొంచెం ముభావంగా కనిపిస్తున్నారు''

"అలాంటిదేమీ లేదే! చాలా దినాల తర్వాత గుర్రపు స్వారీ చేశాను కదూ! అందుకని''

"అయితే మీ కంటె నాకు బాగా స్వారీ తెలుసంటారు!'' అని ఆమె కొన్ని క్షణాలు ఆగి అతన్ని ప్రశ్నించింది.

''ఆయన ఎక్కడికి వెళ్ళారు?''

''అదిగో...ఆ అడవిలోకి. జింకను వేటాడాలని వెళ్ళాడు" రాజేంద్ర దూరాన ఉన్న అడవికేసి చూపిస్తూ జవాబిచ్చాడు.

''ఊ...!" ఆమె ముక్కు చిట్లిస్తూ అన్నది-

"యదార్థాన్ని విడిచిపెట్టి కల్పనా లోకం అను బంగారు లేడి వెంబడి పరుగు తీస్తున్నారు''

''అదీ ఒక విధంగా మంచిదే అయింది. మనం కలిసి ఫ్రీగా మాట్లాడుకొనే వీలు కల్గింది''

''ఇదీ ఒక కలయికేనా! ప్రతి చిన్న



చప్పుడు వెనుక ఏదో పెద్ద ప్రమాదం రాబోతున్నట్లుగా అనుక్షణం భయ పడుతూ గడుపుతున్నాము"

"నిజమే మాధురీ! కాని ఏ బంధమూ లేని సంపూర్ణ స్వేచ్ఛాయుత జీవితంలో కూడా ఏమీ ఆనందం లేదు. ఎక్కడ కొంచెం భయం దాగి ఉంటుందో అక్కడే ఎక్కువ ఆనందం కలుగుతుంది"

"సరే ఆపండి. ఈ అనవసరమైన వాదన. నేను మాత్రం బాగా అలసి పోయాను బాబూ! నా ఒళ్ళంతా హూనం అయింది" ఆమె తన గుర్రాని అతనికి దగ్గరగా తెస్తూ అన్నది.

"ఇప్పుడు ఇంకా ప్రారంభ దశలోనే ఉన్నాము. నీవేమో అలసి పోయానంటు న్నావు. ముందు ముందు ఇంకెన్ని శ్రమలు అనుభవించాలో!"

"మీరు జీవితమనే అర్థంలో ప్రారంభ దశ అని అంటున్నారు. నేను చెప్తున్నది గుర్రపు స్వారీ గురించి"

"ఓహో! ప్రేమ విషయంలో అలసి పోయావేమో అని నేను భావించాలే! మంచిది. నీకు నిరీక్షణ తప్పదు"

"ఎవరి నిరీక్షణ?"

"నీ భర్త కోసం నిరీక్షణ!" రాజేంద్ర భర్త శబ్దాన్ని నొక్కి పలుకుతూ అన్నాడు. ఆ మాట మాధురి గుండెల్లో ముల్లులాగా గుచ్చుకొందని అతడు గమనించాడు.

కొంచెం సేపు యిద్దరూ మౌనం వహించారు. తర్వాత రాజేంద్ర ఆమెతో అన్నాడు-

"వేటగాడైన నీ భర్తను చూస్తుంటే నాకు జాలి వేస్తోంది"

"ఎందుకని?"

"తన స్వంత 'సంపదను' యిక్కడ వదిలిపెట్టి దొరకని జంతువు కోసం పరుగు తీశాడు"

"మీపైన ఉన్న నమ్మకం వల్ల అలా చేశారు."

"అవును! నాకు ఏమని ఆదేశం ఇచ్చి వెళ్ళాడో నీకు తెలుసా?"

"ఏమన్నారు?"

"మాధురి ఒంటరిగా ఉంటే భయ పడుతుంది. కాస్త తోడుగా ఉండు అన్నాడు."

"అందుకేనా! మీరు నన్ను ఒంట రిగా వదిలిపెట్టి పారిపోవాలని అనుకొంటు న్నారు." ఆమె చిరుకోపం ప్రదర్శిస్తూ అన్నది.

"అనుకోవడంలేదు కాని ... చివరకు మీరన్నట్లే అవుతుందేమో!"

"అయితే మీరు కూడా నన్నొదిలి వెళ్ళిపోతారా?"

మాధురీ! ఎందుకో చెప్పలేను గానీ ఏవేవో ఆలోచనలు నన్ను మాటిమాటికి కలత పెడుతున్నాయి"

"ఏమిటా ఆలోచనలు?"

"నేనేదో ఘోరపాపం చేస్తున్నానని పిస్తుంది. నాకు ఆతిథ్యం ఇచ్చి, నన్ను ఎంతో ఆదరించిన ఇంటిలోనే దొంగతనం చేస్తున్నానేమో అనిపిస్తోంది."

మాధురి అతని మాటలు విని అతని వైపు తీక్షణంగా చూసింది. అతడు ఇంకా ఏమో మాట్లాడాలనుకొన్నాడు. అంతలోనే ఆమె గుర్రాన్ని ముందుకు నడిపించి, కాలి బాట మీదుగా ముందుకు సాగిపోయింది. కొంచెంసేపటి వరకు అతడు ఆమె వైపే చూస్తుండిపోయాడు. ఆమె చాలా దూరం వెళ్ళి చెట్టు చాటున కనుమరుగు కాగానే అతడు కూడా అదే కాలిబాటవైపు గుర్రాన్ని పరుగు తీయిం

 

చాడు.

అదే క్షణంలో ఒక పెద్ద కేక ప్రకృతిలో మారుమోగింది. గుర్రంపై కూర్చొని ఉన్న రాజేంద్ర ఆ కేక విని ఆపాదమస్తకం కంపించాడు. వేగంపెంచి మాధురి వెళ్ళిన వైపు వెళ్ళాడు.

ఆమె కేక యింకా చెవుల్లో మారు మోగుతోంది. ఆమెకు అకస్మాత్తుగా ఏమి సంభవించిందో అని అతని మనసు ఆందోళనపడింది. అతడు కొంచెం దూరంలో నిలబడి ఉన్న మాధురి గుర్రాన్ని చూశాడు. మాధురి నేలపై అపస్మారక స్థితిలో పడివుంది. ఆమె కింద పడిపోవ డానికి కారణం ఏమై వుంటుందా అని అతడు ఆలోచిస్తున్నాడు. అంతలోనే కొంచెం దూరంలో చెట్టుపైకి ఎగ బాకుతున్న పొడవైన పాముపై అతని దృష్టి పడింది. రాజేంద్ర చటుక్కున గుర్రం మీద నుండి కిందకి దిగాడు. మాధురి తలను చేతుల్లోకి తీసికొని ఆమెను పేరుపెట్టి పిలుస్తున్నాడు. ఎంత పిలిచినా స్పృహ రాకపోయేసరికి ఆమెను చేతుల్లోకి తీసుకొన్నాడు. ఆమె ఒకవేళ పాము కాటు వేయడం వల్ల స్పృహ కోల్పోయిందేమో అన్న ఆలోచనలో అతడు ఆమెను గుర్రంపై తన ముందు కూర్చుండబెట్టుకున్నాడు. గుర్రాన్ని యింటివైపు వేగంగా పరుగుతీయించాడు. మాధురి గుర్రం కూడా అతని వెనకే వచ్చింది.

ఇంటికి చేరిన తర్వాత కూడా ఆమెకు స్పృహ రాలేదు. రాజేంద్ర గంగ సాయంతో ఆమెను కిందికి దించాడు. ఆమెను ఆమె గదికి తెచ్చి మంచంమీద పడుకోబెట్టాడు. గంగను నీళ్ళు తెమ్మని చెప్పి పంపాడు. ఆమె శరీరంలో ఎక్కడైనా పాము కాటు వేసిన గుర్తులు కనిపిస్తాయేమో అని ఆమె చేతులు, కాళ్ళు పరిశీలనగా చూస్తున్నాడు. చీరను కొంచెం పైకి జరిపి ఆమె కాళ్ళను, పిక్కలను పరిశీలించాడు. ఆమె శరీరాన్ని పరిశీలించి చూసిన అతనికొక సందేహం వచ్చింది. అతడామె తలను రెండు చేతులతో పట్టుకొని అటు యిటు ఊపుతూ తన నోరు ఆమె చెవి దగ్గరికి పోనిచ్చి మెల్లగా పిలిచాడు "మాధురీ" !

ఉన్నట్టుండి మాధురి రెండు చేతులూ కదిలాయి. అవి అతని కంఠాన్ని పెనవేశాయి. ఆమె కండ్లు ఇంకా మూసుకొనే ఉన్నాయి. రాజేంద్ర భయ పడ్డాడు. కంగారుగా ఆమె వైపు చూడ సాగాడు. మాధురి తన బాహువుల్లో అతని మెడను ఇంకా బంధించింది. మెల్లగా కండ్లు తెరచి, అతన్ని చూసి నవ్వ సాగింది.

"అమ్మ దొంగా ! అయితే నీవు నిజంగా..."

"అపస్మారక స్థితిలో ఉన్నాను... మీ శరీర స్పర్శవల్ల స్మారకం వచ్చింది"

"అంతా అబద్ధం...... నీవు నన్ను ఆట పట్టించాలని ఇలా చేశావు"

"ఇలా చేయకుంటే మీ రాతి గుండె ఎలా కరుగుతుంది ? నన్నింత దూరం మోసుకొని ఎవరు తెస్తారు ?"

"అయితే నీవు నాకు పరీక్ష పెట్టా వన్న మాట ?"

"ప్రేమాయణంలో ఇలాంటి పరీక్షలు ఎదురు కావడం సహజమే !"

"నేనేమో నిన్ను పాము కరిచిందని అనుకొన్నాను"

"కరిచివుంటే చాలా బావుండేది. రోజూ వుండే ఈ గొడవలు, మన పాపాలూ అంతమయ్యేవి"

"ఏం గొడవలు ?"

"మీరు విచారించడం, ఆయన కోప పడడం, నేనేమో లోలోపల బాధపడుతూ ఉండటం...ఇవన్నీ ఎప్పుడూ అంత రిస్తాయో!"

"అవును. అన్నీ ఎప్పుడు...?"

రాజేంద్ర మాటలు ముగియకముందే తలుపు దగ్గర ఏదో అలికిడి అయింది. ఇద్దరూ ఎడంగా జరిగారు. మాధురి మళ్ళీ కళ్ళు మూసుకొని అపస్మారక స్థితిలో ఉండిపోయింది. రాజేంద్ర అటువైపు తిరిగి చూశాడు. గంగ చేతిలో నీళ్ళ గ్లాసుతో గదిలోకి వస్తూంది.

రాజేంద్ర గంగ చేతిలోని గ్లాసును అందుకొని మాధురి ముఖంపై నీళ్ళు చల్లాడు. మాధురి మెల్ల మెల్లగా కళ్ళు తెరిచింది. ఆమె గంగ వైపు బిత్తర చూపులు చూస్తూ, ఆమెను గుర్తుపట్టే ప్రయత్నం చేస్తున్నట్టుగా కనిపించింది. రాజేంద్ర నీళ్ళ గ్లాసును గంగకు యిచ్చి వేడి 'టీ' తీసుకొని రమ్మని చెప్పాడు.

గంగ బయటికి వెళ్ళగానే మాధురి లేచి దిండును ఆనుకొని కూర్చుంది. నీటి బిందువుల వల్ల ఆమె ముఖంలో నూతన కాంతి, ఓ తేజం ప్రస్ఫుటించాయి. చిరు నవ్వులు చిందిస్తున్న ఆమె పెదాలు అప్పుడే మంచు బిందువులలో స్నానం చేసిన అరవిరిసిన మల్లెమొగ్గల్ని జ్ఞప్తికి తెస్తున్నాయి. మాధురి అతన్ని తువ్వాలు కావాలని అడిగింది. అప్పుడే రాజేంద్ర చూపులు కింది ఆవరణ వైపుకు మర లాయి. వాసు అప్పుడే అక్కడికి వచ్చి గుర్రాన్ని గుంజకు కట్టివేస్తున్నాడు. రాజేంద్ర చకితుడై తాను చేయాల్సిన పని మరచి అటువైపే, చూస్తుండి పోయాడు. మాధురి అతన్ని ప్రశ్నించింది—

"ఏమిటి ? అలా చూస్తున్నారు?"

"ఏమీ లేదు. వాసు ఇంకా రాలేదే ! కారణం ఏమిటా అని ఆలోచిస్తున్నాను"

"అడవిలో జింకను వెంబడిస్తున్నారేమో!"

రాజేంద్ర ఆమె పక్కనే మంచంమీద కూర్చుని ఆమె ముఖాన్ని తుడవసాగాడు.

మాధురి కళ్ళు మూసుకొని అతని స్పర్శవల్ల కలుగుతున్న ఆనందాన్ని అనుభవిస్తోంది.

రాజేంద్ర చెవులు వాసు అడుగుల చప్పుడు వైపే కేంద్రీకరింపబడి ఉన్నాయి. అతడు ఊపిరి బిగపట్టి వణుకుతున్న చేతులతో ఆమె ముఖం తుడుస్తున్నాడు. అప్పుడే వాసు వరండాలోకి వచ్చాడు. కాని గదిలోకి రాకుండా పరదా చాటున నిలబడ్డాడు. రాజేంద్ర ఈ సంగతి గమనించాడు. కాని మాధురికి మాత్రం చెప్పలేదు.

అతడామె ముఖాన్ని తుడుస్తూ తక్కున ఆగిపోయాడు. అతని చెయ్యి వణికింది. ఈ విషయం గమనించిన మాధురి కళ్ళు తెరవకుండానే చేతితో అతని మణికట్టు పట్టుకొని అడిగింది—

"ఏమిటి? ఏమైంది?"

"పొరపాటున నీ నుదుటి బొట్టును తుడిచాను!"

"అయితే ఏం మునిగిపోయింది?"

"అది నీ మాంగల్యం. పతివ్రత్యానికి చిహ్నం కదా!"

"మాంగల్యం! నీవు దీన్ని మాంగల్యం అంటున్నావా! నన్ను అడుగు, నేను దాన్ని గురించి వివరంగా చెప్తాను. ఈ తిలకమే మూడేళ్ళ నుండి, వెన్నెల రాత్రుల్లో నన్ను దహింప చేసింది. ఈ




తిలకమే వెన్నెల రాత్రుల్లో విరహాగ్ని జ్వాలల్లో మల మల మాడ్చింది. చుక్కల మసక వెలుగులో కోరికలను చంపుకొని మంచంపై అటుయిటుదొర్లించింది. ఇలాంటి నిరర్థకమైన తిలకం ఉండటం కంటే తుడిచి పెట్టుకొనిపోవడమే మంచిది. రాజూ! నిజం చెప్తున్నాను. నా పాపిటి యిప్పుడు కూడా ఖాళీగా ఉంది. నా నుదురు సార్థకమైన తిలకం కావాలని కోరుకొంటోంది. నా శరీరంలోని అణు వణువు జీవన సహచరుని కోసం ఆరాట పడుతోంది. రాజూ! నీవు నీ చేతితో నా నుదుట తిలకం దిద్దవా! నా పాపిటలో కుంకుమ చల్లవా?"

రాజేంద్ర వింటూ కూర్చున్నాడు. ఆమె చెప్పుకొంటూ పోతోంది. ఆమె పిచ్చిదానిలా తానేమి మాట్లాడుతుందో తనకే తెలియని రీతిలో ఏమేమో అంటోంది. పరదా కదలడం రాజేంద్ర చూశాడు. అతడు తన చేతితో మాధురి నోరు మూసి, ఆమెను మాట్లాడకుండా ఆపాడు. ఆమెను రెండు చేతులతో ఎత్తి సరిగా కూర్చోబెడుతూ అన్నాడు—

"ఇదిగో! గంగ టీ తెచ్చింది. రెండు గుక్కలు తాగు. ప్రాణం తేలిక పడు తుంది" గంగను చూసి మాధురి ఎంతో నీరసం ప్రకటించింది.

ఆమె గంగ వైపు ఆశ్చర్యంగా చూడ సాగింది.

పరదా ఇంకా అలాగే ఊగుతోంది. వాసు వెనక్కు తిరిగి హాలు వైపు పోతున్నాడు. అతడు వెనక్కు తిరగటం రాజేంద్ర చూశాడు. అతడు కూడా ఏదో ఆలోచిస్తూ వాసు వెనకే హాలు వేపు నడిచాడు. అతడు మాధురిలో తన పట్ల ఉన్న ప్రేమను ప్రకటింప చేసి, దానికి ప్రతిక్రియగా వాసులో కలిగే మార్పులను పరిశీలించాలనుకొన్నాడు.

వాకిట్లో శబ్దం కాగానే వాసు చటుక్కున వెనుదిరిగి చూశాడు. రాజేంద్ర ద్వార బంధం పట్టుకొని నిలబడి అతని వైపే చూస్తున్నాడు. వాసు ముఖంలో దుఃఖము, కోపము కలిసి ఉన్నట్లనిపిస్తోంది. అతడు కొంచెం సీరియస్‌గా ఉన్నాడు. అతడు ముఖం పక్కకు తిప్పుకొంటూ ఆగి ఆగి అన్నాడు—

"మాధురికి పాము కరిచిందని గంగ చెప్పింది...నిజమేనా?"

"ఆమను కరవలేదు. కానీ నిన్ను చూస్తుంటే పాము నీ మనసును కాటు వేసిందనిపిస్తోంది."

"రాజా!" అతడు కోపంతో రెచ్చిపోయి అరిచాడు. అతని వైపు తిరిగి తీవ్రంగా చూశాడు. రాజేంద్ర అక్కడే నిలబడి ఏమీ జరగనట్లే నిర్భయంగా, నిశ్చలంగా చిరునవ్వు నవ్వుతున్నాడు. మిత్రుడు చాలా కోపంగా ఉన్నాడని గ్రహించి అన్నాడు-

"నేను నీతో అప్పుడే చెప్పలేదా! నీవు నన్ను కోరికైతే కోరావు కానీ, ఆ కోరిక ప్రకారం జరుగుతుంటే చూసి భరించలేవు అని. అందుకే నన్ను వెళ్ళనివ్వు. నన్నీ విచిత్ర నాటకంలో నటింప చేయవద్దు."

"కాదు రాజూ! అలాంటిదేమీ లేదు... మనసు చాలా సున్నితమైనదే కాదు. విచిత్రమైనది కూడా! ఎంత ప్రయత్నిం చినా అప్పుడప్పుడు ఎదురు తిరుగుతుంది; ఇకపై ఇలా జరగదు. నామాట నమ్ము"

కొంచెం సేపు ఇద్దరూ ఒకర్నొకరు చూస్తూ గడిపారు. తర్వాత వాసు

అడిగాడు—"ఇప్పుడు తన కెలా ఉంది?"

"విచారించాల్సిన పనేం లేదు...పాము కాటు వట్టి సాకు మాత్రమే!"

"అంటే...!"

"ప్రేమికులు చేసే తమాషాలలో ఒకటి." రాజేంద్ర మెల్లగా అని అతని వీపు తట్టి తన గదిలోకి వెళ్ళాడు. వాసు అవాక్కయిపోయి విగ్రహంలా అక్కడే నిలబడిపోయాడు.



ఆకాశం మేఘావృతమై వుంది. గాలి బొత్తిగా వీచడం లేదు. చెట్ల ఆకులు కూడా కదలడం లేదు. అంతటా నిశ్శబ్దం, గాంభీర్యం ఆవరించి ఉంది. రాజేంద్రకు నిద్ర పట్టడంలేదు. అతనికి ఎంతో ఇబ్బందిగా ఉంది. విసుగుతో అటు ఇటు పొర్లుతున్నాడు.

నల్లగా, భయంకరంగా ఉన్న రాత్రి ఏదో రాబోయే తుఫానుకు సూచనగా ఉంది...అతని కండ్ల ఎదుట వాసు ముఖాకృతి కనిపించింది...అతడు ఎంత విచారంగా ఉన్నాడు!

అతడు పరదా చాటున ఉండి, తన భార్య పరపురుషునితో ప్రేమ కలాపాలు సాగిస్తుంటే చూసి కూడా కదలలేదు, మెదలలేదు, నోరు విప్పలేదు...అతడు తన బాధను గరళంలా మింగాడు...అతనిలో ఎంత ధైర్యం ఉంది! అతడొక విచిత్రమైన భర్తలా ఉన్నాడు. అతడు ప్రయత్నపూర్వకంగా లోతైన నుయ్యిలో దూకుతున్నాడు. ఏ పురుషుడైనా ఆత్మహత్యా సదృశ్యమైన ఇలాంటి పని చేస్తాడా? అతనికి వాసుదేవ్ అన్న మాటలు గుర్తుకు వస్తున్నాయి—రాజూ! నీవు నాకు ఈ ఒక్క ఉపకారం చేసిపెట్టు ఆమె ఎవడో పరాయివాడితో లేచిపోవడం దాని ఫలితంగా నేను అందరిలో నవ్వుల పాలు కావడం, అవమానాలకు గురి కావడం...నాకు ఇష్టంలేదు. అలా జరిగే కంటే ఆమె నీదానిగా ఉండిపోతేనే బాగుంటుంది అని నా అభిప్రాయం. అలా జరగడం వల్ల మీరు నాకు చాలా మేలు చేసిన వాళ్ళవుతారు. నాకు సంతోషం కల్గించిన వాళ్ళవుతారు...

వాసు మాటలు జ్ఞప్తికిరాగానే రాజేంద్ర బాధతో విలవిలలాడిపోయాడు. ఈరోజు వాసు వివశుడై ఉన్నాడు. అందుచేతనే అతడు తన భార్యకు భయపడుతున్నాడు; లేకుంటే...ఒక మదించిన గుర్రాన్ని తన వశం చేసుకోగల్గిన వ్యక్తి భార్యమీద అధికారం చలాయించ లేడా? చలాయించగలడు. కాని ... కాని... ఎందుకిలా ఆలోచిస్తున్నాను. అతడు అన్న మాటలు నిజమే. ప్రేమ అనేది వట్టి బూటకము. దానికి మూలం కామం తప్ప మరేమీ కాదు. అతడు ఆమెలో చెలరేగుతున్న కామాన్ని తృప్తిపరచలేని అసమర్థుడు కనుకనే అంతమంచి వాణ్ణి, నిర్మల హృదయంగల వ్యక్తిని మాధురి మోసం చేస్తోంది. ఈ ఆలోచనల్లో అతడు చిక్కుకొనిపోయాడు దిండు కింద ఉన్న సిగరెట్ పెట్టెతీసి,ఒకసిగరెట్టు వెలిగించాడు. నిదానంగా పొగ వదులుతున్నాడు. కిటికీకి కట్టి ఉన్న తెర తొలగించాడు.అంతలో ఎవరో




తలుపు నెట్టుతున్నట్లు అనిపించింది. మొదట అంతగా పట్టించుకోలేదు గాని, తర్వాత మళ్ళీ తలుపు తడుతున్న శబ్దం వినిపించడంతో లేచి నిలబడ్డాడు. ఎవరో అతన్ని పేరుపెట్టి మెల్లగా పిలుస్తున్నారు: ఆ స్వరం మాధురిది. ఆమె తలుపు తెరవమంటోంది.

రాజేంద్ర లైటు వెలిగించాలనుకొన్నాడు. కాని ఏదో భావం తటుక్కుమని ఆ ప్రయత్నం మానుకొన్నాడు. కొంచెం సేపు ఆగి, మెల్లగా గడియ తీశాడు. తలుపు తెరుచుకోగానే మాధురి లోపలికి వచ్చింది. రాజేంద్ర ఆమెను ఏమీ ప్రశ్నించకముందే ఆమె చటుక్కున తలుపు మూసింది. గదిలో మళ్ళీ నిశ్శబ్దం ఆవరించింది. ఇద్దరూ భయం భయంగా ఒకళ్ళ ముఖాన్ని ఒకరు చూస్తూ నిలబడ్డారు.

"ఏమిటి సంగతి... ఇలా వచ్చావు.. కుశలమే కదా ?" రాజేంద్ర ఆశ్చర్యపోతూ అడిగాడు.

"కుశలమే.. ఏమి పాలుపోక ఊరకనే వచ్చాను."

"ఊరకనే వచ్చావా ?" రాజేంద్ర ఆమె మాటల్నే మళ్ళీ పలికాడు.

"అవును. ప్రేమికులు ఎన్నో సాహకార్యాలు చేయాల్సి ఉంటుందని మీరే అన్నారు."

"నిజమే... కాని ఇలా భయపడా మాత్రం కాదు!"

"భయపడుతూనా...? విరహంలో, బాధలో కుమిలిపోతూ కృశించి పశించడమేనా మీ ఉద్దేశంలో ధ్యేయంగా ఉండటం అంటే !"

ఆమె జవాబు విని రాజేం[ద్ర] మౌనం వహించాడు. ఆ చీకటిలో కూ[డా] అతను ఆమె కండ్లలో ఒక విచిత్రమో కాంతిని [చూ]శాడు. ఆ కాంతి మనసులో పొంగి [పొ]ర్లే ఉద్రేకాలకు ప్రతీకగా కండ్లలో [గు]లాబీలు పూయిస్తుంది.

అతడు మంద్రస్వరంలో అడిగాడు [వా]ళ్ళు ఏం చేస్తున్నాడు?"

"హాయిగా నిద్రపోతున్నారు."

"ఓహో"

అతడు ఎందుకో బిడియపడుతు[న్న]ట్లుగా, ఏదో చేయరాని పని చేస్తు[న్న]ట్లుగా కనిపిస్తున్నాడు. అర్ధనిమీలిత [రె]ప్పలై, మత్తుగా ఉన్న మాధురి కండ్ల[లో]కి చూస్తున్నాడు. ఒళ్ళంతా ఆవహించి[న] ఉద్రేకం మూలంగా సుకోమలమైన భుజాలు పొంగి ఉన్నాయి. ఆ భుజాలు [చూ]డు తన రెండు చేతుల్లో పొదివి పట్టు[కొ]ని, దగ్గరికి లాక్కోవాలని అతనిలో [తీవ్ర]మైన కోరిక కలుగుతోంది. ఆ కోరిక త[న]ణ్ణి పిచ్చివాణ్ణి చేస్తోంది. తనలో చెల[రే]గుతున్న ఈ తుఫానును ఎలా ఆపాలో [తె]లియని అయోమయ పరిస్థితిలో చిక్కుకొన్నాడు. తన మనసులోని కోరికను వ్యక్తం చేయలేదు. ఆమెను తనకు దగ్గరగా లాక్కొని, తన రెండు బాహువుల్లో ఆమెను పొదివి పట్టుకొని చిన్నగా అన్నాడు–

"చాలా ఉక్కపోస్తోంది... తలుపు తెరవమంటావా ?"

"ఊహూ"... వద్దు అన్నట్లుగా ఆమె తల ఊపింది. అతని బాహుబంధాల్లో నుండి విడిపించుకొని వెళ్ళి కిటికీ రెక్కలు కూడా మూసింది. రాజేంద్ర లోలోపల చాలా భయపడుతున్నాడు. భయంవల్ల అతని శరీరం గడగడ వణుకుతోంది. అతడు పెద్ద ఇరకాటంలో పడ్డాడు. భావోద్రేకపు వరద నీటి



నియమాల కట్టను తెంచుకొని ప్రవహి
సుంది.. దానిని ఆపాలని ప్రయత్ని
చడం వెర్రితనమే. అయితే ఆ వరదలో
కొట్టుకొనిపోవడం కూడా సిగ్గులేనితనం,
అధః పతనం అవుతుంది. అతనికి ఏం
చేయాలో తోచడంలేదు. మాధురి వెళ్ళి
అతని మంచంపై పడుకొంది.

రాజేంద్ర తలుపు తెరచి తొంగి
చూశాడు. దూరంగా గోడ వెంబడి
నడిచి వస్తున్న ఒక నీడ అతనికి కని
పించింది. అతని సందేహం నిజమైంది.
ఆ నీడ మరెవరో కాదు. వాసు తన గది
వైపు నడచి వస్తున్నాడు.

రాజేంద్ర మనసు మొద్దుబారి నట్ల
యింది. అతడు వెంటనే తలుపు
మూశాడు. తలుపు దగ్గరే నిలబడి దానికి
చెవి ఆనించి బయట శబ్దాన్ని వినాలని
ప్రయత్నిస్తున్నాడు. తనతో ఎన్నో
మాటలు చెప్పినప్పటికీ, ఎన్నో ఉదార
భావాలు ప్రకటించినప్పటికీ వాసు
ఇలా చేస్తాడని అతడు ముందే ఊహిం
చాడు.

భర్త అనేవాడు ఎంత నిస్సహాయు
డైనా, నిర్లజ్జాపరుడైనా, ఉదార హృదయు
డైనా తన కండ్ల ముందు భార్య పరాయి
వాళ్ళతో తిరుగుతుంటే సహిస్తూ
మౌనంగా ఉండటం అనేది అసహజమే
ను, అసంభవం కూడా! "ఎవరైనా
న్నారా బయట?'' మాధురి తల
ఎ అతన్ని అడిగింది అతడు తలు
పు చెవి ఆనించి నిశ్శబ్దంగా వింటూ
ఉన్నా ఆమెకు అనుమానం కలి
గింది.

వరూ లేరు ... ఒట్టి భ్రమ...
అంతే

రాజేంద్ర ఆగి ఆగి సమాధానం యిచ్చాడు.

ఆమె నిర్వయంగా నిట్టూర్పు విడిచి మళ్ళీ మంచంపై పడుకొంది. ఆమె పరి



స్థితిని రాజేంద్ర గ్రహించాడు. అతడు ఆమె దగ్గరకు వచ్చి ఆమె పక్కన కూర్చున్నాడు. చెదరిన ఆమె ముంగురులను, ప్రేమగా యధాస్థానంలో ఉంచుతున్నాడు. అతని చెవులు మాత్రం బయట ఏమి శబ్దం అవుతుందో వినాలి అన్న కుతూహలంతో ఉన్నాయి. అతడు మళ్ళీ లేచి కిటికీ దగ్గరకు వెళ్ళి నిలబడి వాసు అడుగుల చప్పుడు వినాలని ప్రయత్నం చేస్తున్నాడు. వాసు బయట కిటికీ దగ్గర నిలబడి వాళ్ళ మాటలు వింటున్నాడని అతనికి సందేహం కలిగింది. ఈ భయం మూలంగా అతడు తన చేతి వేళ్ళు విరుస్తూ అక్కడే మౌనంగా నిలబడ్డాడు.

ఉన్నట్లుండి ఎవరో తనను పట్టుకొన్నట్లు అనిపించి గడగడ వణికాడు. కొంచెం తేరుకొన్న తర్వాత వెనకనుండి మాధురి రెండు చేతుల్లో తనను పెనవేసుకొందని గ్రహించాడు. ఆమె మెత్తని చేతుల వెనుకవైపు నుండి వచ్చి అతని ఛాతీని హత్తుకొన్నాయి. రాజేంద్ర ఆ చేతులను తొలగించలేదు. వాటిని తన రెండు చేతులతో పొదివి పట్టుకొని అలాగే నిలబడ్డాడు. మెత్తగా, వెచ్చగా ఉన్న ఆమె శరీర స్పర్శ మూలంగా అతనికి ఒక విధమైన శాంతి లభించింది.

''రాజీ...... !'' మాధురి పెద్ద నిట్టూర్పు వదిలి మెల్లగా పిలిచింది.

''ఊ...... !''

"ఇక్కడ నిలబడి ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావు ?''

''నది మహా వేగంతో పొంగుతూ వస్తోంది.నేనేమో దప్పికగొని ఉన్నాను... కాని ముందుకు అడుగువేసి నీళ్ళు తాగే ధైర్యం లేదు... అడుగులు ముందుకు పడటం లేదు"

"ఇంకా అనుమానాలు, ఆలోచనలు ఎందుకు రాజీ !? ముందుకు అడుగులు వేసి,తనివిదీరా నదిలోని నీళ్ళు తాగు... నీ దప్పికంతా తీర్చుకో. నది నీ పాదాల దగ్గరకు వచ్చి తనను ధన్యం చేయమని ప్రాధేయపడుతోంది''

"నిజమే అందుకొరకు నేను కిందకు వంగవలసి ఉంటుంది"

"కొంచెం అయినా వంగవా ? ఈ అలలు నీ పెదాలు స్పృశించి తరించాలని తహతహలాడుతున్నాయి.''

"కాని అలా ఎంతకాలం వరకు...?"

అతడు చటుక్కున వెనక్కు తిరిగి ఆమె రెండు చెంపలను తన చేతుల్లో ఇముడ్చుకొని అన్నాడు—" ఈ అలలు కాసా వెనక్కు వెళ్ళిపోతే అప్పుడు ఏం అవుతుంది ?" దప్పిక అలాగే ఉండిపోతుంది......నిరాశ అలాగే మిగిలి ఉంటుంది...కాని విరహ వేదన ఇంకా ఎక్కువవుతుంది.''

మాధురి అతడిచ్చిన జవాబును గురించి ఆలోచిస్తూ ఉండిపోయింది. రాజేంద్ర ఒక్క ఉదుటున వెళ్ళి కిటికీకి కట్టిన తెర తొలగించి, దాని రెండు రెక్కలు కూడా

తెరిచాడు. ఒక నీడ చటుక్కున పక్కకు జరిగి గోడను ఆనుకొని నిలబడింది. తర్వాత ఎండిన ఆకులపై ఎవరో నడిచినట్లుగా గలగల శబ్దం వినిపించింది. ఒక పురుషుడు పరుగెత్తి వెళ్ళడం ఇద్దరూ చూశారు. అప్పుడు అసలు విషయం ఇద్దరూ గ్రహించ గలిగారు. కిటికీ అద్దంలో నుండి అతడు వాసును స్పష్టంగా చూస్తున్నాడు. అతడిని ఇంత సమీపంలో చూసిన తర్వాత రాజేంద్రలో ఉన్న భయం కొంత తగ్గింది. అతడు మాధురి




వైపు తిరిగి ఆమెతో అన్నాడు- "ఇలా రా ! ఈ కిటికీలో నుండి బయట దృశ్యం ఎంత అందంగా కనిపిస్తుందో చూడు !"

"ఈ కిటికీ మూసే ఉంచండి... బయటి దృశ్యాల సంగతి ఇప్పుడెందుకు?"

"ఎందుకలా అంటున్నావు ?"

"ఎవరైనా వస్తారేమోనని..."

"వస్తే రానీ... ఏదో ఒకనాటికి ఈ భయాలన్నీ వదిలిపెట్టి ధైర్యంతో ముందుకు వెళ్ళవలసి ఉంటుంది."

"మీరు నిజం చెప్తున్నారు... రాత్రిం బవళ్ళు ఇలా విరహాగ్నిలో వేగడం, ఈ భయం, ఈ అసంతృప్తి, ఈ తృష్ణ... వీటన్నిటికీ ఫుల్‌స్టాప్ పెట్టవచ్చు"

"ఎలా ?'' రాజేంద్ర ఈ మాటలను పెద్దగా, ఆసక్తిగా అడిగాడు. బయట కొంచెం దూరాన నిలబడి ఉన్న వాసును అతడు కిటికీ అద్దంలో నుండి చూస్తున్నాడు.

''ఎక్కడికైనా పారిపోవడం ద్వారా" మాధురి రాజేంద్ర చూపుల్లో చూపులు కలుపుతూ ఒక నిర్ణయానికి వచ్చిన దానిలా అన్నది.

ఈ జవాబు వినగానే రాజేంద్ర మళ్ళీ వాసువైపు చూపులు మరల్చాడు.అంతలో ఉన్నట్లుండి ఆకాశంలో చందమామ కనిపించాడు. ఇద్దరి దృష్టి ఒకేసారి ఆకాశం వైపు మరలింది. మేఘాలు చెదిరిపోయి నీలాకాశం నిర్మలంగా కనిపిస్తోంది. వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉంది. రాజేంద్ర, మాధురి ఒకరికొకరు స్పష్టంగా కనిపిస్తున్నారు.

"అరే... ఈ చందమామ అకస్మాత్తుగా ఎక్కడ నుండి ఊడిపడ్డాడు ?"

"ఇది మన ప్రేమకు సాక్షి''

''అయితే రాజీ ! ఇక ఆలస్యం ఎందుకు ? ఈ రాత్రికే..."

"ఇంత త్వరగానా ?"

"ఇదే మంచి తరుణం. ఇద్దరం ఒకే చోట ఉన్నాము. ఇంకొంచెం సేపట్లో చంద్రుడు మేఘాల్లో దాక్కుంటాడు... ఆ చీకటిలో చెరువు దాటి వెళ్దాము"

"అదంతా సరే... ఎక్కడికి పోదాం ?''

''ఎక్కడికో ఒక చోటికి. ఇంత పెద్ద దేశంలో మనకు చోటే ఉండదా ?"

రాజేంద్ర మాధురి కండ్లలోకి పరిశీలనగా చూశాడు...

ఈ రోజు ఆమె ప్రేమకోసం ఎంతటి కష్టాన్నైనా ఎదుర్కొనడానికి సంసిద్ధంగా ఉంది. అతడు ఆమెను నెమ్మదిగా అడిగాడు—

''మరి నీవు నీ మాట మీద నిలబడి ఉంటావా ? నా వెంట వస్తావా ?"

"తప్పకుండా ... మీకేమైనా అనుమానం కలుగుతుందా ?"

"లేదు లేదు. నీ పట్ల ఎలాంటి అనుమానం లేదు. కాని నా పట్ల నాకే నమ్మకం ఉండటం లేదు. ఇంత విశాలమైన దేశం ఉంది...ఎక్కడికైనా వెళ్ళి ఉండవచ్చు... కాని డబ్బు కావాలిగా మరి !"

"రెండు సంవత్సరాలకు సరిపడే డబ్బు నా దగ్గర ఉంది. సరేనా''

"వద్దు మాధురీ ! నా స్నేహితుని నుండి నిన్ను దూరం చేయడమే చాలా తప్పు పని. దానికి తోడు అతని డబ్బును కూడా తీసుకొనిపోవడం నాకు ఇష్టం లేదు"

మాధురి మౌనంగా ఉండిపోయింది. చెయ్యి చాపి కిటికీ మూయాలని ప్రయత్నం చేస్తోంది. రాజేంద్ర ఆమె చెయ్యి

పట్టుకొని ఆమె ప్రయత్నం ఆపాడు.

"ఎందుకని?" ఆమె ప్రశ్నార్థకంగా చూస్తూ అతణ్ణి అడిగింది.

"గాలి వీచకుంటే నాకు చాలా విసుగ్గా ఉంటుంది. ఊపిరి ఆడనట్లు ఉంటుంది."

"ఎవరైనా వచ్చి చూస్తారేమో అని భయంగా ఉంది"

"ఎవరు వస్తారు? వాసు తప్ప ఇక్కడ రావడానికి మాత్రం ఇంకెవరున్నారు?"

"ఆయన్ను గురించే నేనంటున్నది"

"అతన్ని గురించి నీవేమి భయపడాల్సిన పనిలేదు! అతదొక రాతి విగ్రహం. అతనిలో సుకుమార భావాలు బొత్తిగా లేవు. అతనికి పశువులను లోబరచుకోవడం మాత్రం తెలుసు. మానవ హృదయంలోని స్పందన, అది మాట్లాడే మూగభాష తెలియదు అని నీవేగా అన్నావు"

"అది కాదు రాజీ! నా అభిప్రాయం అది కాదు... ఆయన గనక చూశారంటే మన ప్లానంతా పాడవుతుంది. నెరవేరే పని కాస్తా చెడిపోతుంది"

"అలా అనవద్దు మాధురీ! చెడిపోనున్న పని నెరవేరుతుంది అను"

"ఎలా?"

"వాసు మన మాటలు వినాలనీ, మనం ఇలా ప్రేమ కలాపాలు సాగిసుంటే చూసి మనల్ని పట్టుకోవాలనీ నేను కోరుకుంటున్నావు."

అతడు కిటికీ అద్దంలో నుండి పరిశీలనగా బయట ఉన్న వాసుదేవ్‌వైపు చూస్తూ అన్నాడు.

"ఏమిటి మీరేదో వింతగా మాట్లాడుతున్నారు?"

"సరిగానే మాట్లాడుతున్నాను! అతని వెన్ను లోపోటు పొడవటం నాకు ఇష్టం లేదు. అతడు తన కండ్ల ముందే తన ప్రేమకు కట్టబడుతున్న సమాధిని చూడాలని కోరుకొంటున్నాను. చూసి మనిద్దరినీ తన చేతుల్తో కలపాలని ఆశిస్తున్నాను."

"అలా ఎక్కడైనా, ఎప్పుడైనా జరగడం చూశారా? ఆయన గనక చూశారంటే మనం ఉట్టికి, స్వర్గానికి మధ్య ఊగులాడుతుంటాము."

"ఇక్కడి నుండి పారిపోయినా జరిగేది అంతే కదా!"

"నా అభిప్రాయం అది కాదు... ఆయన ఎదుటికి వచ్చి అయన చూస్తుంటే పారిపోగలిన సాహసం నాలో లేదు."

"మాధురీ...!" అతడు ఏదో ఆలోచిస్తూ అన్నాడు—

"మనం ప్రేమకోసం ఎంతటి కష్టాలైనా ఎదుర్కోవడానికి తయారుగా ఉండాలి. ఆ కష్టాలు వాసు రూపంలో వచ్చినా సరే ఎదుర్కొనడానికి సంసిద్ధంగా ఉండాలి"

అతడు ఈ మాటలు అంటుండగానే వాసు చీకటిలో నుండి ముందుకు వచ్చి కిటికీ దగ్గర నిలబడ్డాడు. ఇప్పుడు అతడు రాజేంద్రకు చాలా సమీపంలో ఉన్నాడు. అతని ముఖంపై విచారం, అతని నొసటిపై చెమట బిందువులు అతని అంతరంగాన్ని కలచివేస్తున్న బాధకు ప్రతీకగా ఉన్నాయి.

మాధురి అతన్ని చూసి కెవ్వున కేక వేసింది. దూరంగా జరిగి తలుపు దగ్గరికి పరుగుతీసింది. రాజేంద్ర ముందుకు వెళ్ళి ఆమెను పట్టుకోవాలని ప్రయత్నించాడు. కాని ఆమె దొరకకుండా బయటికి పారిపోయింది. వెళ్తూ వెళ్తూ ఆమె – వాసు




రాజేంద్రతో అన్నమాటలు విన్నది "మీరు మీ ప్రేమను సఫలం చేసుకొనేందుకై నన్ను మీ దారినుండి తప్పించాల్సిన పనిలేదు. నేనే స్వయంగా తప్పుకొంటాను"

ఆమె ఇక పై వినలేకపోయింది. బెదురుగా, భయంగా, చెమటలు కక్కుతూ దడదడలాడుతున్న గుండెతో తన గదికి వెళ్ళింది. ఇద్దరిమధ్య పెద్ద జగడం జరిగిందేమో, మాటలు రేగాయేమో అనుకొంది. కాని ఆమెకు ఏమీ వినిపించలేదు. ఆమె లోపలి వైపు తలుపు గడియవేసి వెళ్ళి మంచంపై పడుకొంది. భయంవల్ల ఆమె మెదడు మొద్దుబారినట్లయింది. ఆమె కండ్ల ముందు, కొరడాతో గుర్రాన్ని కొడుతున్న వాసు రూపం మాటిమాటికీ మెదలుతోంది.

గదిలో చిక్కని చీకటి వ్యాపించి ఉంది. క్షణంలో అంతా తారుమారైంది. ఇలా జరుగుతుందని ఆమె బొత్తిగా ఊహించలేదు. ఆమె రెండు చేతులతో ముఖాన్ని కప్పుకొని తన శరీరంలోని వణుకును ఆపాలని వ్యర్థప్రయత్నం చేస్తోంది. వాసు కోపంగా తలుపు పగలకొట్టి తన మీదవచ్చి పడుతున్నట్టు భ్రమతో ఆమె భయపడసాగింది.

ఉన్నట్టుండి తలుపు గట్టిగా కొట్టిన శబ్దం అయింది. ఆమె ఊహ నిజమైంది. బయట వాసు నిలబడి ఉన్నాడు. అతడు తలుపు గట్టిగా తడుతున్నాడు. మాధురిని పేరుపెట్టి పిలుస్తున్నాడు. ఆమెలో లేచి వెళ్ళి తలుపుతీసే శక్తిలేదు. అతని ఎదుటికి వెళ్ళి నిలబడగలిగిన ధైర్యంలేదు. ఊపిరి బిగబట్టి చేతుల్లో ముఖం దాచుకొని, మౌనంగా అలాగే పడుకొని ఉంది.

గదిలోనుండి ఏమీ సమాధానం రాకపోవడంతో వాసు వెళ్ళిపోయాడు. ఆ ప్రదేశంలో మళ్ళీ మౌనం వ్యాపించింది. దానికి తోడు గదంతా చీకటి కమ్మి ఉంది. ఎక్కడో దూరాన కీచురాళ్ళ శబ్దం వినిపిస్తోంది. ఆమె మనసు అశాంతితో నిండిపోయింది. ఆమెలో ఆలోచించే శక్తి నశించింది. పిచ్చిదానిలా అయిపోతోంది. అలాగే తెల్లవారకుండా ఉండాలనీ,తాను ఎప్పటికీ చీకటిలో దాగి ఉండిపోవాలనీ ఆమె మనసులో కోరుకొంటోంది.




రాత్రిపై నిశ్శబ్దం రాజ్యం చేస్తోంది. అప్పుడప్పుడు వీచే పిల్లతెమ్మెర చెట్ల ఆకులను చక్కిలిగింతలు పెడుతోంది. మళ్ళీ అదేమౌనం,అదే ఏకాంతం అంతటా వ్యాపించింది! అర్ధరాత్రి దాటింది.బయటి వాతావరణంలో కొద్దిగా చలిప్రవేశించింది. కాని వాసుదేవ్ గృహంలో మాత్రం ఒక విచిత్రమైన నిప్పు రాజుకొంటోంది. అది ఆరిపోయే మార్గం ఏదీ కనిపించడంలేదు. ఆ నిప్పులో మూడు హృదయాలు మాడిపోతూ మసి అవుతున్నాయి.

రాజేంద్ర కిటికీ రెక్క తెరచి బయటికి తొంగి చూశాడు.మేఘాలు చంద్రుణ్ణి కప్పివేశాయి. మళ్ళీ అంతలోనే పక్కకు తొలిగాయి. అతడు ఏదో నిర్ణయానికి వచ్చినవాడిలా తల ఊపాడు. చేతిలో ఉన్న జాబును కవర్లో పెట్టి మూశాడు.

అతడు ఒక చేతిలో కవరు పట్టుకొని రెండవ చేతితో సూట్ కేస్ పట్టుకొన్నాడు. ఆ నిశ్శబ్ద నిశీధిలోనే అతడు ఆ చోటు వదిలి వెళ్లాలనే నిర్ణయానికి వచ్చాడు.

అతడు మనసులో కోరుకున్నట్లుగానే వాసు,మాధురి పరస్పరం ఎదురయ్యారు. వాస్తవ పరిస్థితి గ్రహించారు. మాధురి తన భర్తకు తెలియకుండా, తెరచాటున ఏ ప్రేమ కలాపాలు సాగించాలని ఆశిస్తోందో అవి వాసుకు ముందే తెలుసనీ, ఆమె తృప్తి కోసం, ఆమె ఆనందంకోసం అతడు తన గుండెను రాయి చేసుకొన్నాడనీ, ఆమె గ్రహించడం జరిగింది.

అతడు మెల్లగా అడుగులు వేస్తూ గది దాటి బయటికి వచ్చాడు. ఆకాశంలో మేఘాలు దట్టంగా వ్యాపించాయి. అందువల్ల చీకటి దట్టంగా ఉంది. అతడు చప్పుడు కాకుండా నడుస్తూ వెళ్లి వాసు గది ముందు ఆగాడు. గది తలుపులు మూసి ఉన్నాయి. కాని కొద్దిగా తెరచుకొని ఉన్నందువల్ల లోపల గడియ పెట్టలేదని తెలుస్తోంది. అతడో క్షణంసేపు అక్కడే నిలబడ్డాడు. చేతిలోని కవరును సందుగుండా లోపల వేసి, వేగంగా నడుస్తూ వరండా దాటి ముంగిలిలో ప్రవేశించాడు. మాధురి గది తలుపు మూయబడి ఉంది. అతడామెను కలిసి మాట్లాడాలని అనుకోలేదు. అందువల్ల మౌనంగా అడుగులు వేస్తూ ముంగిలిదాటి బయటికి వచ్చాడు.

చెరువు గట్టుకు వెళ్ళిన రాజేంద్రకు తానొక పంజరంలో నుండి బయట పడినంత స్వేచ్ఛగా, హాయిగా ఉంది. అతడు చాలా దినాల తర్వాత హాయిగా స్వేచ్ఛావాయువుల్ని పీల్చాడు. వచ్చే ముందు వాసునుకలిసి వీడ్కోలుచెప్పి రాలేకపోయినందుకు అతనికి మనసులో బాధగాఉంది. కాని విధిలేని పరిస్థితిలో అతడలా వచ్చేశాడు. ఇంతకంటే అధికంగా తన స్నేహితుని జీవితంతో ఆటలాడటం అతనికి ఇష్టంలేదు.

అతడు సూట్ కేస్ పడవలో పెట్టి తన ముందు విశాలంగా వ్యాపించివున్న చెరువులోని జలరాశివైపు నిరాశగా చూశాడు. జీవితం చాలా తుచ్ఛమైనదిగా అనిపించింది. చుక్కాని లేని గాలి తాకిడికి అలలపై అటూ ఇటూ ఊగుతూ, ముందుకు పోతూ ఉండే ఆ చిన్నపడవకు, తన జీవితానికి పోలిక ఉన్నట్టు అనిపించింది. అతనికి ఉన్నట్టుండి వాసుదేవ్ జ్ఞప్తికి వచ్చాడు. స్నేహితుని నిస్సహాయ పరిస్థితి గుర్తుకు రాగానే, రాజేంద్రకు ఏడుపు ముంచుకొని వచ్చింది. ఆ రాత్రి వేళ, ఆ ఏకాంత ప్రదేశంలో అతని కన్నీటిని ఎవరూ చూడలేదు. అతడు ఇప్పటివరకు తనకు ఇష్టం లేని ఒక నాటకం వేస్తున్నాడు. ఈ దినం రంగస్థలం నుండి దిగి పారిపోయివచ్చాడు. అతని గుండెపై ఉన్న ఒక పెద్ద బరువు తొలగిపోయింది.

అతడు పడవకు కట్టిన తాడు విప్పుతున్నాడు. అంతలో ఎవరో పరిగెత్తుతూ వస్తున్న శబ్దం వినిపించింది. అతడు తల పైకెత్తి చూశాడు. ఎవరో అతని వైపే వేగంగా పరిగెత్తి వస్తున్నారు. అతడు పడవ దిగి వస్తున్న వ్యక్తికేసి పరిశీలనగా చూస్తున్నాడు. అతని భయం ఎక్కువైంది. అతడెంతో, ఉత్సుకతతో ఊపిరి బిగపట్టి వస్తున్న వ్యక్తి కోసం ఎదురు చూడసాగాడు.

ఇప్పుడు మాత్రం అతని ఊహ పూర్తిగా తారుమారైంది. వస్తున్న వ్యక్తి




వాసు కాదు. మాధురి అతన్ని త్వరగా చేరాలని వేగంగా పరుగెత్తి వస్తూంది. రాజేంద్రకు తలపై ఎవరో పెద్ద సుత్తెతో దెబ్బకొట్టినట్లయింది. మాధురి దూరాన ఉండగానే అతడు అన్నాడు- "మాధురీ నువ్వా !"

"అవును. నేనే" ఆమె ఆయాసపడుతూ జవాబిచ్చింది. రాజేంద్ర ఆమెకేసి తీక్షణంగా చూశాడు. ఆమె బట్టలు మార్చుకొని, చేతిలో ఒక చిన్న బ్రీఫ్‌కేసుతో వచ్చింది. ఆమె నిర్ణయం గ్రహించడానికి రాజేంద్రకు ఎక్కువసేపు పట్టలేదు.

"ఈ సమయంలో నీ విలా రావడం ఏమీ బాగాలేదు" అతడామెతో అన్నాడు.

"నేను రాకుంటే నీవు ఈ రాత్రే ఇక్కడ నుండి పారిపోవాలనుకున్నావు కదూ !"

"అవును మాధురీ ! పగటి వెలుగులో నేను వాసుకు ఇక నా ముఖం చూపించలేను"

"మరి నేను... ?"

"నీవు...నీవు అతని ప్రాణానివి. ఎవరూ తన ప్రాణాన్ని వదులుకోరు. తిరస్కార భావంతో చూడరు. పొరపాటు అనేది అందరికీ సహజం. అది మహాపరాధం ఏమీ కాదు !"

"కాదు రాజీ ! ఇక నేనిక్కడ ఉండటం అసంభవం. నీవు కూడా నన్ను తిరస్కరిస్తే నేను ఆత్మహత్య చేసుకొంటాను"

"మాధురీ... ! నేనీ విషయంలో నిస్సహాయుణ్ణి, నీవు ఇంటికి తిరిగివెళ్ళు. అందులోనే నీకు క్షేమం ఉంది"

"నా క్షేమం ఎక్కడ ఉందో నాకు బాగా తెలుసు. మీరింత త్వరగా ఎలా మారిపోయారో అర్థం కావడం లేదు"

"మాధురీ ! పరిస్థితులు మనిషిని తెలియని రీతిలో మార్చివేస్తాయి. భావాలకు బానిసలమై మనం ఎన్నో తప్పులు చేస్తుంటాము. ఇప్పటికైనా జాగ్రత్తపడటం మంచిది. నేను ఇతరుల సంసారంలోని ఆనందాన్ని దోచుకొని నా ఒడి నింపుకోవాలని కోరుకోవడం లేదు. అలా చేస్తే నా హృదయం జీవిత పర్యంతము రంపపు కోత అనుభవించాల్సి వస్తుంది."

"అయితే మీరు చేసిన ప్రమాణాలన్నీ మరచి ప్రేమకు విముఖులై హాయిగా ఉండగలరా ?"

"మాధురీ!" అతడు బొంగురుబోయిన కంఠంతో పెద్దగా అరిచాడు. ఆమె వైపు కొన్ని క్షణాలు మౌనంగా చూస్తూ ఉండిపోయాడు. తర్వాత మళ్ళీ అన్నాడు- "పరిస్థితుల్ని అర్థంచేసుకో మాధురీ ! మనం అగాధంలోకి దిగిపోతున్నామనిపిస్తోంది. అక్కడ నుండి మళ్ళీ పైకి రావడం అసంభవం అవుతుంది."

"ఆ విషయాలను గురించి నేనేమీ చింతించను. మీరు నా వెంట ఉంటే చాలు ఎంత పెద్ద కష్టాన్నైనా, ఎంతటి అవమానాన్నైనా భరించగలను."

"అవమానం కొనితెచ్చుకుంటూ ఇలా చేయడం ఎందుకు ?"

"మీ ప్రశ్నకు జవాబు కావాలంటే నా హృదయంలోకి తొంగి చూడండి. మీరు తప్ప ఇక్కడ ఇంకెవరూ లేరు!"

"అని నేను ఎలా నమ్మడం ?" రాజేంద్ర ఆమె వైపు నుండి ముఖం పక్కకు తిప్పుకొని అన్నాడు. అతడు చెరువు వైపు చూస్తున్నాడు. తన మాటలకు మాధురి బాధతో విలవిలలాడిందని అతడు గ్రహించాడు.

"అయితే నన్ను మీరు ఇలా భావించే ప్రేమించారన్న మాట. ఈ మాటలు అనాలనే నాపై ప్రేమ ఉన్నట్లు నటించారా ?" అంటున్న మాధురి పెదాలు వణికాయి. ఆమె మాటల్లో కోపం నిండి ఉంది.

రాజేంద్ర ఒక రాయి తీసి చెరువులో విసిరాడు. "ఈ రోజు నీ ఇల్లును, నీ భర్తను, నీ సంపదను, నీ సర్వస్వాన్ని నాకోసం వదిలి వస్తున్న నీవు మరో దినం నాకంటే గొప్ప ఆకర్షణ శక్తిచే, గొప్ప వ్యక్తిచే ఆకర్షింపబడి నన్ను కూడా వదలి వెళ్ళడంలో ఆశ్చర్యం ఏముంది ?"





"మీరు కేవలం నన్ను పరీక్షించాలని ఈ విధంగా మాట్లాడుతున్నారు. లేనిపోని విషయాలు కల్పిస్తున్నారు. అవునా ?"

"కల్పితాలేమున్నాయి యిందులో?"

"ప్రేమ, కపటం, ఆకర్షణ అంటూ ఏమేమో అంటున్నారు !"

"మాధురీ! ప్రేమ అనేది వట్టి కల్పన అని, అంతకంటె మరేమీకాదని నేనిప్పుడు గ్రహించాను. వియోగ బాధను అనుభవిస్తున్న హృదయాలు ప్రేమను ఆశ్రయిస్తాయి. కాని ఈ ప్రేమ వాళ్ళను ఒక నాడు తప్పక మోసం చేస్తుంది."

"మీరుయింతకుముందు ఎప్పుడూ ఇటువంటి అభిప్రాయాలు వెలిబుచ్చలేదే?"

"అప్పట్లో అజ్ఞానంలో ఉన్నాను."

"రెండు నిమిషాలు ఆయన దగ్గర కూర్చొగానే జ్ఞానోదయం కలిగిందన్న మాట."

"నీవు సరిగా కనిపెట్టావు. అతని నిస్సహాయతే నా కండ్లు తెరిపించింది. నీవే చెప్పు, ప్రేమకు పాత్రుడు కానంతటి పెద్ద లోపం అతనిలో ఏమున్నది ? అలవాట్లలో, మర్యాదలో...ఆఖరుకు శరీర సౌందర్యంలో కూడా వాసు నాకంటె

ఉన్నతుడు. కాని ఈ దినం నీవు తన్ని తిరస్కరించి నావెంట రావడానికి సంసిద్ధ మయ్యావు. ఇదంతా ప్రేమ కోసం కాదు. ఐశ్వర్యం కోసం, ఆనందం కోసం, శరీర వాంఛను తీర్చుకోవడం కోసం. ఎవరు చెప్పగలరు- ఒక దినం నన్ను కూడ ఇలాగే తిరస్కరించి..."

"రాజీ!" ఆమె పెద్దగా అరచింది. అతని నోరు మూయాలని ప్రయత్నం చేసింది. అతని మాటలు యింకా వినగలిగిన శక్తి, సాహసం ఆమెలో లేవు. రాజేంద్ర మౌనంగా ఉన్నాడు. ఆమె కన్నీరునిండిన కండ్లతో దూరాన అయోమయంగా, అస్పష్టంగా ఉన్న ప్రకృతిని చూస్తోంది.

"అవును మాధురీ ! ఏదో ఒకనాడు నీవు నన్ను కూడా వదలి మరొకరితో పారిపోతావు" అతను ఆగి ఆగి అన్నాడు.

మాధురి కండ్లముందు గాఢాంధకారం వ్యాపించింది. ఆమె మెదడు పనిచేయడం మానేసింది. ఆమె ఒక పెద్ద కొండ శిఖరంపై నిలబడి ఉంది. తానిప్పుడేం చేయాలి? ఇంతదూరం వచ్చిన తర్వాత వెనక్కి తిరిగిపోవడం తనకు సాధ్యమయ్యే పనేనా ?

ఆమె మౌనంగా ఉంది. రాజేంద్ర ఆమెవైపు చూస్తూ ఆమె ముఖంలో మారుతున్న రంగులను పరిశీలిస్తున్నాడు. మాధురి కండ్లు అశ్రుపూరితాలైనాయి. అవి కండ్లలోనే నిలచి ఉన్నాయి. ఆమె కింద నేలపై ఉన్న బ్రీఫ్‌కేసును తీసుకొని అటు ఇటు చూడసాగింది.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" మౌనాన్ని భంగపరుస్తూ రాజేంద్ర అన్నాడు.

"ఇప్పుడిక ఆలోచించడానికి మాత్రం ఏం మిగిలింది నాకు ?" ఎంతో నిరాశగా అంది.

"చాలా ఉంది. ప్రపంచం నీవు అనుకొన్నంత సంకుచితమైనదేమీ కాదు"

"ప్రపంచం చాలా విశాలమైనదే. కాని మనిషే చాలా తుచ్ఛుడు. ఈ సంగతి నేను ఈ రోజే తెలుసుకొన్నాను" అని ఆమె అతనివైపుకు చూడకుండానే చెరువు గట్టు వెంబడి ముందుకు నడవసాగింది. ఆమె కొంచెం దూరం వెళ్ళిందో, లేదో రాజేంద్ర పిలుపు ఆమెను ఆపింది. అతడు ఆమె దగ్గరకు వచ్చి అడిగాడు—

"ఎక్కడికి పోతున్నావు?"

"అదృష్టం ఎక్కడికి తీసుకపోతే అక్కడికి"

"అదృష్టమా లేక గమ్యం తెలియని కాళ్ళా?"

"మీ యిష్టం, ఎలాగైనా అనుకోండి. నిరాశలో మునిగిన వ్యక్తికి తన గమ్యం ఏమిటో తనకే తెలియదు"

"నీవే కాదు, మరొక వ్యక్తి కూడా నిరాశలో మునిగి ఉన్నాడు. నీవువానును గురించి ఆలోచించావా ?"

"నేను సర్వం కోల్పోయినదాన్ని. ఇప్పుడు ఇతరులకు యిచ్చేందుకు నా దగ్గర ఏం మిగిలింది ?"

"ప్రేమ !"

"ప్రేమా !?" వ్యంగ్యం ధ్వనిస్తున్న స్వరంతో అన్నది- "ప్రేమ విరహంలో ఉన్నవాడిని మభ్యపెట్టే ఒక బూటకపు ఆధారం అని ఇప్పుడే కదా అన్నారు ! దానిపై ఆధారపడటం అంటే ఆత్మవంచన తప్ప మరేమీ కాదు.

"నీవంటున్నది నిజమే !"

"చాలా విచిత్రంగా ఉంది కదూ! ఒక వైపు ఆయన నా జీవితాన్ని రసవిహీనం చేసి నన్ను అగ్నిపరీక్షకు గురిచేస్తున్నారు. మరోవైపు మీరు నా ప్రేమను




పరిహసిస్తున్నారు!''

''అదికాదు మాధురీ! నన్ను తప్పుగా అర్థం చేసుకోవద్దు."

''తప్పుగా అర్థం చేసుకొంటే మాత్రం ఏం మునిగిపోతుంది ? వెళ్ళండి, పడవ సిద్ధంగా ఉంది. ఇప్పుడు మీకు, నాకు ఏం సంబంధం ఉందని మీరు నన్ను ఆపుతున్నారు ?" ఆమె ఈ మాటలని ముందుకు నడచింది.

రాజేంద్ర ఒక్క ఉదుటున ఆమె దగ్గరకు వెళ్ళి ఆమె రెండు భుజాలు పట్టుకొని ఊపుతూ అన్నాడు ''నా మాట విని వెనక్కి తిరిగి వెళ్ళు!'

అతని మాటలకు బదులుగా మాధురి తిరిగి ఏమీఅనలేదు. అతనివైపు కోపంగా చూస్తూ అతన్ని విదిలించి పక్కకు జరిగింది. ఆమె పెదాలు ఏమేమో అనాలని కదులుతున్నాయి. కాని మాటలు కంఠం దాటి రాలేకపోతున్నాయి. మాధురి ముందుకు సాగిపోవాలనే ప్రయత్నంలో ఉంది. రాజేంద్ర ఆమెను మళ్ళీ ఆపుతూ అన్నాడు-''మాధురీ! నిన్ను ఆపే శక్తి, చనువు నాలో లేవని నాకు తెలుసు. కాని దుఃఖంలోను, నిరాశలోను పూర్తిగా మునిగిన వ్యక్తియొక్క అంతిమ లక్ష్యం ఏమిటో నాకు బాగా తెలుసు."

"మీరు నా నిర్ణయాన్ని ఊహించగల్గడం నా అదృష్టం."

"చూడు మాధురీ! ఆకాశంలో నల్లని మేఘాలు వ్యాపించి ఉన్నాయి. ఈ మేఘాలెంత భయం గొల్పేవిగా ఉన్నాయో చూడు ! కాని అవి వర్షించి తేలిక పడిన తర్వాత ఆకాశం నిర్మలం అవుతుంది. అక్కడ ఇంతకు ముందు ఏమీ లేదనీ, ఏమీ జరగ లేదనీ అనిపిస్తుంది. మనిషి మనసు కూడా ఈ ఆకాశం వంటిదే. దాంట్లో ఎన్నో భావాల తుఫానులు చెలరేగుతుంటాయి. మనసును కలచివేసే ఎన్నోదుఃఖాలమేఘాలు ఆవరిస్తుంటాయి. కుంభవృష్టి కురుస్తుంది. కాని ఎంతో భయంకరంగా కనిపించిన తుఫాను కాస్తా ఎంతో ఆహ్లాదకరంగా మారిపోతుంది. నీ భర్త చాలా ఉదార హృదయుడు. అతని మనసులో ద్వేషం, అసూయ, కోపం వంటి తుఫానులు ఎక్కువసేపు నిలిచి ఉండవు. అతడు నీకేమీ దుఃఖం కలిగించడు. మాధురీ! నీకు నేను ప్రత్యేకంగా వివరించి చెప్పనక్కర్లేదు. నీవు పరమ శత్రువుగా భావించి ఎవర్నయితే వదిలిపోతున్నావో, అతడు నిజంగా ఒక దేవత. ఈ చెరువు గట్టునే ఒక రాత్రి అతడు నాతో ఏమన్నాడో తెలుసా?"

''ఏమన్నారు?''

''మాధురి నిన్ను ప్రేమిస్తోంది. అందుకు నేను విచారించడం లేదు. పైగా సంతోషిస్తున్నాను. నేను జీవితంలో ఆమెకు ఇవ్వలేని సుఖాన్ని, సంతోషాన్ని నీవు ఇవ్వగలవు. ఆమెకా ఆనందాన్ని ప్రసాదించమని నిన్ను కోరుతున్నాను'' అంటూ ప్రాధేయపడ్డాడు''

''ఆయన మనం ప్రేమ కలాపాలు సాగిస్తుంటే చూశారా?"

"ఆ రోజు కోచ్‌మన్ చనిపోయిన రోజు అతడు పట్నం నుండి వచ్చి హాలులో ఉండి మన మాటల్ని విన్నాడు. నీవు కాఫీ చేయాలని వెళ్లావు. నీవు అతణ్ణి చూడలేదు, కాని నేను చూశాను"

''మీరు నాతో ఈ సంగతి ఎందుకు చెప్పలేదు?''

"ఎలా చెప్పేది? నాకు ఏం చేయాలో పాలుపోలేదు. అతడు, నేను - ఇద్దరం విపక్షులమని గ్రహించాను."

మాధురి మౌనంగా ఉంది. ఆమె దీర్ఘాలోచనలో మునిగి ఉంది. రాజేంద్ర ఆమె భుజంపై చేయి వేస్తూ అన్నాడు-

"మాధురీ! జీవితంలో కొన్ని నిగూఢ రహస్యాలుంటాయి. వ్యక్తి వాటిని తన భార్యతో కూడా చెప్పుకోలేడు. కాని స్నేహితుడితో చెప్పుకోగలడు."

"ఏమిటంత రహస్యం?" మాధురి ఉత్సుకత చూపుతూ అడిగింది.

"అతనికి సంబంధించిన ఈ రహస్యాన్ని ఎవరికీ చెప్పనని నేను వాసుతో ప్రమాణం చేశాను. కాని ఆ ప్రమాణాన్ని కూడ కాదని నీతో ఆ రహస్యం చెప్తున్నాను."

"చెప్పండి" ఆ రహస్యం ఏమిటో వినాలని ఆమె చాలా ఆతురత పడుతోంది.

"నిన్నొక స్త్రీగా కాదు ఒక స్నేహితురాలిగా భావించి చెప్తున్నాను"

"చెప్పండి. సందేహిస్తున్నారెందుకు?"

"మాధురీ...! నీ భర్త...నీభర్త... మగతనం లేని వాడు"

రాజేంద్ర నుండి ఈ మాటలు వినిపించగానే ఆమెకు నెత్తిన పిడుగు పడ్డట్లు అనిపించింది. ఆమె చేతిలో ఉన్న బ్రీఫ్‌కేస్ జారి కిందపడింది. దభాలున కింద కూలబడి ముఖాన్ని మోకాళ్ళ మధ్య పెట్టుకొని కూర్చొంది.రాజేంద్ర ప్రక్కనే నిలబడి ఆమెను చూస్తూ ఉండిపోయాడు.

రాజేంద్ర ఆమె ఎదుట ఏమీ దాచలేదు. వాసుదేవ్ సైన్యంలో పని చేయడం శత్రువులకు బందీగా దొరకడం...జైలు నుండి పారిపోవడం... తుపాకి గుండు తగిలి ఆపరేషన్ జరగడం, మొదలైన సంఘటనలన్నీ. తాను అదే చెరువు గట్టున విన్న విషయాలన్నీ వరుసగా చెప్పాడు. మాధురి అన్నీ విన్నది. ఆమె తన ఉనికినే మరచిపోయింది. ఆమెకు కొన్ని వందల విషసర్పాలు తనను చుట్టుకొన్నట్లు,అవి తనరక్తాన్ని పీలుస్తున్నట్లు అనిపించింది. ఆమెకు తనివిదీరా ఏడ్చి, ఏడ్చి సొమ్మసిల్లి పోవాలనిపిస్తోంది. కాని ఏడ్పుకూడా ఆమెకు దూరంగా పారిపోయింది. ఆమె కండ్లలో కన్నీరు కరువైంది. ఈ దుఃఖభారాన్ని ఎలా తేలిక పరచుకోవాలో ఆమెకు తోచలేదు.

గడచిపోయిన సంగతులు ఆమె కండ్ల ముందు వరుసగా కనిపించి అదృశ్యమవుతున్నాయి. అయ్యో! తన భర్త ఎంత వివశత్వంలో వున్నాడు! ఎంత బాధను దిగమింగి జీవిస్తున్నాడు! తాను ఆయన పట్ల ఎంత నిర్దయగా ప్రవర్తించింది. తాను ఆయన మనసు లోతుల్లో ప్రవేశించి ఆయన బాధను గ్రహించే ప్రయత్నంగాని, దాన్ని పంచుకునే ప్రయత్నం గాని చేయలేదు. పైగా తన భావాలను, తన కోర్కెలను తీర్చుకోవాలనితాపత్రయపడి ఆయన గౌరవ ప్రతిష్టలతో ఆడుకొనేందుకు సిద్ధపడింది. తానెంత ఘోర పాపానికి తలపడింది. తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదు.

ఉన్నట్టుండి ఆమె రాజేంద్ర మాటలు విని ఉలిక్కిపడింది. తల పైకెత్తి చూడాలనుకొంది. కాని ఆ సాహసం చేయలేకపోతోంది. తన పాపాల ప్రతిబింబం కనిపించే ఆ అద్దాన్ని చూచే ధైర్యం ఇప్పుడామెలో లేదు. అతడు పడవవైపు ముందుకునడుస్తూ ఆమెతో వెనక్కి వెళ్ళమని చెప్తున్నాడు.మాధురి మోకాళ్ళ మధ్య నుండి తలపైకెత్తి చూసేసరికి అతడు మౌనంవహించాడు. ఇద్దరూ ఒకర్నొకరు చూసుకొన్నారు. అతడు వీడ్కోలు చెప్పి

 

పడవ ఎక్కాడు.

మాధురి దీనంగా, తన సర్వస్వం కోల్పోయినదానిలా, విచారంగా అతని వైపు చూస్తూ ఉండిపోయింది. ఆమె ఒక్కసారి గూడా అతనితో ఆగమని చెప్పలేదు. రాజేంద్ర పడవ ఎక్కి ఆవలి తీరం వైపు సాగిపోతున్నాడు. అప్పటి వరకు మాధురి హృదయంలో అణగివున్న తుఫాను పొంగిపొర్లింది. వెక్కివెక్కి ఏడ్చింది. ఆమెఅలా అక్కడ కూర్చొని ఎంత సేపు ఏడుస్తూ గడిపిందో ఆమెకే తెలియదు. ఆకాశంలో క్రమ్ముకొన్న కారుమేఘాలు చెదరిపోయ్యాయి. దూరాన ప్రకాశవంతంగా కనిపిస్తున్న వేగుచుక్క ప్రభాతకాలపు శుభసందేశం ఇస్తోంది. ఏడ్వడం వల్ల ఆమె మనసు తేలికపడింది. కాని శరీరంలో మాత్రం ఏదో తెలియని బాధవల్ల, అలసటవల్ల నీరసంగా ఉంది. ఆమె లేచి బ్రీఫ్‌కేస్ చేతిలోకి తీసుకొంది. చెరువువైపు తదేకంగా చూస్తూనిలబడింది. చాలాదూరం... కంటికి కనిపించనంతదూరం నల్లని జలరాశి మాత్రం కనిపిస్తోంది. రాజేంద్ర వెళ్ళిపోయాడు. దూరం...చాలా దూరం. తన జీవితానికి అందనంత దూరం వెళ్ళాడు. అతడిక ఎప్పటికీ తిరిగిరాడు. ఆమె పమిటతో కన్నీరు తుడుచుకొని లక్ష్య రహితంగా ఆ చెరువుగట్టు వెంబడి నడుస్తోంది. ఏం చేయాలో పాలుపోవడం లేదు. ఎక్కడికి వెళ్ళాలి?ఒకదారి తప్పిన బాటసారిలా లక్ష్యం తెలియక తిరుగుతోంది. ఆ సమయంలో చెరువులోని అలల గుసగుస శబ్దం ఆమె చెవుల్లో ఏదో అమూల్య సందేశం ఇచ్చింది. "మాధురీ! నిన్ను నీ ప్రయత్నం నుండి ఆపగల్గిన శక్తి నాలో లేదు-దుఃఖంలోను, నిస్పృహలోను ఉన్న వ్యక్తి యొక్క అంతిమ లక్ష్యం ఏమిటో అది కూడా నాకు బాగా తెలుసు. అయినా నీవు వెనక్కు తిరిగి ఇంటికి వెళ్ళిపోవడం మంచిది. నీ భర్త యిప్పటికీ నీకోసం ఎదురు చూస్తూ ఉన్నాడు.''

ముందుకు పోనున్న ఆమె పాదాలు తక్కున ఆగాయి. ఆమె వెనక్కు తిరిగి వేగంగా ఇంటివైపు నడుస్తోంది.

ఆమె వెళ్ళినప్పుడు ఇల్లుఇంతకుముందు ఎలా ఉందో అలాగే నిశ్శబ్దంగా ఉంది. ఆమె వెళ్ళేటప్పుడు ఎవరూ చూడలేదు. చీకటి క్రమంగా చెదిరిపోతోంది.

ఆమె అడుగులో అడుగు వేస్తూ, మెల్లగా తన గదివైపు పోతోంది. వాసు గది తెరిచే ఉంది. ఆమె లోపలికి తొంగి చూసింది. అతడు తన పడకపై లేడు. ఏదో ఆలోచన వచ్చి ఆమె ఒళ్ళంతా కంపించింది. ఆమె అడుగు లోపలికివేసి, మళ్ళీ పరిశీలనగా చూసింది. అతడు బాల్కనీలో కుర్చీలో కూర్చొనిఉన్నాడు. ఆ మసక వెలుతురులోనే, చెరువు వైపు చూస్తూ ఉన్నాడు.

ఆమె గదిలో ప్రవేశించింది. మెల్లగా అడుగులు వేస్తూ వెళ్ళి అతని వెనక నిలబడింది. అతడు నిశ్చలంగా శిలా విగ్రహంలా కూర్చొని ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

మాధురి అక్కడే నిలబడి చాలాసేపు అతన్ని చూస్తూ ఉండిపోయింది. ఆమె అతణ్ణి క్షమాపణ వేడాలని వచ్చింది. కాని అతని ఎదురుగా వెళ్ళి నిలబడే సాహసం ఆమెలో లేదు. వాసు అలాగే దూరాన ఉన్న క్షితిజం వైపు చూస్తూ ఉండిపోయాడు.

మాధురి ధైర్యం కోల్పోయింది. ఆమె

ఏడుస్తూ వెళ్ళి వాసుదేవ్‌ను గట్టిగా హత్తుకొంది.ఆమె ఏడుస్తూ మాట్లాడుతోంది—

"నన్ను మన్నించండి. నేను పాపం చేశాను. నమ్మక ద్రోహం చేశాను. నాకు మీ ఇష్టం వచ్చిన శిక్ష విధించండి. ఆనందంగా అనుభవిస్తాను. కాని మీరు నన్నిలా ఏడిపించవద్దు! మీరిలా మౌనంగా ఉండవద్దు. పిచ్చిదాన్నయిపోతాను. మీ పాదాలు పట్టుకొంటాను. ఏమైనా మాట్లాడండి! మీరిన్ని రోజులు మీ మనసులోని బాధ నాతో ఎందుకు చెప్పలేదు? మీ మనశ్శాంతి కోసం, మీ నిస్సహాయతకోసం ఈ క్షణికమైన, తుచ్ఛమైన సుఖాన్ని త్యజించలేనా ? నేను మిమ్మల్ని నవ్వులపాలు చేస్తానా ? అలా చేస్తానని మీరెందుకు భావించారు ? నేను మిమ్మల్ని యిప్పటి వరకు అర్థం చేసుకోలేదు. మీమంచితనాన్ని గుర్తించలేదు"

ఆమె ఆగకుండా ఏడుస్తూ ఏమేమో మాట్లాడుతోంది. శ్వాస పీల్చుకోవడానికి మధ్యలో కొద్ది క్షణాలు ఆగి వాసు వైపు చూసింది. అతడింకా గంభీరంగా, ఏదో దీర్ఘాలోచనలో మునిగి ఉన్నాడు. అతని కండ్ల నుండి ప్రవహించే కన్నీళ్లు చెంపల మీదుగా కారుతూ కింద పడుతున్నాయి.

అతని చేతిలో నుండి ఉండగా చుట్టిన ఒక కాగితంజారి కింద పడింది. మాధురి వెంటనే దాన్ని అందుకొని చదివింది. అందులో ఇలా రాసి ఉంది-

ప్రియ మిత్రమా !

ఉదయం నీవు నిద్ర లేచేసరికి నేను కనిపించను. అప్పటికి చాలా దూరం, నీకు కనిపించనంత దూరం, నీవు పిలిస్తే వినిపించనంత దూరం వెళ్లి ఉంటాను. మాధురి కూడా నా లాగే చేసుందేమో ! నన్ను వదిలి నా వెంట వస్తుందేమో అని నాకు సందేహం కలుగుతోంది.ఎందుకంటే ఆమె అనుక్షణం నా అడుగుల సవ్వడిని గమనిస్తోంది. కాని మిత్రమా! ఒక విషయంలో మాత్రం నన్ను విశ్వసించు. నేను నీ సుఖాన్ని హరించి మాత్రం దూరంగా పారిపోవడంజరగదు.అస్థిరంగా ఉన్న సంతోషాన్ని నీకు తిరిగి ఇప్పించేందుకు నా శాయశక్తులా ప్రయత్నం చేస్తాను. నీవు నీ జీవిత రహస్యం నాకు చెప్పినప్పటి నుండి ఆ విషయాన్ని వివరంగా మాధురికి చెప్పాలని చాలాసార్లు ప్రయత్నం చేశాను. కాని నా నోరు ఆ విషయాన్ని చెప్పలేకపోయింది. నీవు ఆమెజీవన సహచరుడివి. నీవే ఆరహస్యం ఆమెతో చెప్పవలెనని నా ప్రార్థన. నేను ఆ విషయం ఎందుకు చెప్పాలి ? ఆమె నాకు వదిన.

మాధురికి గుండెల్లో తీవ్రమైన బాధ పుట్టి అది ఆమె నరనరాల్లో వ్యాపించింది.

ఆమె వేళ్ళతో చీటిని ఉండగా చుట్టి కసిగా విసిరి కొట్టింది. వాసు అలాగే ఆమెవైపు చూపులు మరల్చకుండానే ఏదో ఆలోచనల్లో లీనమై ఉన్నాడు. జాబు విసిరివేసిన తర్వాత ఆమె బయటకు వెళ్ళాలని రెండు అడుగులు వేసింది. అయితే ఆమె చీరకొంగు కుర్చీకి తగులుకొంది. ఆమె వెనక్కు తిరిగి చీరకొంగు విడిపించి మళ్ళీ బయటికి అడుగులు వేసింది. ఒక అడుగు వేసిందో లేదో ఆమెకొంగు మళ్ళీ కుర్చీకి తగులుకొన్నట్లు అనిపించింది. కాని ఈసారి ఆమె కొంగు కుర్చీకి తగులుకోలేదు. అది వాసు చేతిలో ఉంది. ఆమె వెనక్కి తిరిగి అతని చేతిలో ఉన్న తన కొంగును చూసి తక్షున ఆగింది.

"ఎక్కడికి పోతున్నావు?" అతడు




కరుణ, దీనత్వము నిండిన స్వరంతో అడిగాడు.

"ఎక్కడికో నాకే తెలియదు. ఇక మీకు నా పాపిష్టి ముఖాన్ని చూపించను. నేను మీకు యోగ్యమైనదానిని కాదు" బొంగురుపోయిన స్వరంతో ఆమెఅన్నది

"అయితే నేను ఎవరికోసం బతకాలి?" చేతిలోని పమిటకొంగును వదిలిపెడుతూ అతడు లేచి నిలబడ్డాడు.

మాధురి వెనక్కు తిరిగి అతన్ని చూసింది–అతని కండ్లలో స్నేహంఉంది, దుఃఖం ఉంది. కోపం బొత్తిగా లేదు. చేతులు చాచి ఆమెవైపు అడుగులు వేస్తున్నాడు.

"మీరు.." వణుకుతున్న పెదాలు ఆమె ఆశ్చర్యాన్ని, సంతోషాన్ని వ్యక్తం చేస్తున్నాయి. కొద్ది క్షణాలు ఆగి మళ్ళీ అంది "మీరు నన్ను క్షమించారా?" అవునన్నట్లుగా వాసు తల ఊపాడు. అతని కండ్లలో వింత కాంతులు నిండి ఉన్నాయి. అతని పెదాలపై కనిపిస్తున్న చిరునవ్వు నవజీవనసందేశాన్ని ఇస్తున్నది. ఆమె ఏడుస్తూ మధ్యలో నవ్వింది ఇద్దరూ ఒకేసారి రెండవ వారివైపు నడిచారు. వాసు ఆమెను తన బాహుపాశంలో బంధించి ప్రేమగా అన్నాడు "మాధురీ! రాజా నా ప్రాణస్నేహితుడు. స్నేహితుడు జీవితంలో ఎప్పుడూ మోసం చేయడు. నీవుకూడా నాకు ఒక స్నేహితురాలిగా ఉంటావా?"

మాధురి తన ముఖాన్ని అతని వక్షస్థలంపై దాచుకొంది. ఆమె వెక్కిళ్ళ మధ్యలో, రుద్ధకంఠంతో అన్నది "ఉంటాను."

వాసు ఆమె వీపును మెల్లగా నిమురుతున్నాడు. ఒక పెద్దమనిషి చిన్నపిల్లవాణ్ణి ఓదార్చినట్లుగా ఆమెను ఓదార్చాడు. ఇద్దరి కన్నుల నుండి అశ్రువులు ధారగా కారుతున్నాయి. వారి హృదయాల్లో ఇన్ని దినాలుగా అణగివున్న దుఃఖం కన్నీటిరూపంలో ప్రవహిస్తున్నదా అన్నట్లుంది.

కారుమేఘాలు పగిలాయి. వర్షం కురిసింది. కురిసి వెలిసింది. ఆకాశం నిర్మలం అయింది. మలినమైన మనసులు నిర్మలమయ్యాయి. నిర్మలమై కాంతివంతములైనాయి. జీవితం ఉన్నతాదర్శాల ఇరుసుపై స్థిరంగా నిలబడ ఉంది. క్షణికోద్రేకాలకు లొంగి పతనం కాలేదు.




మాధురి ఇంట్లో ఒంటరిగా ఉంది. గంగ పనులన్నీ పూర్తి చేసి వంటగదిలోనే విశ్రాంతి తీసుకొంటోంది. వాసు ఏదో పనిమీద చెరువుదాటి పట్నానికివెళ్ళాడు. మాధురి తన గదిలో మంచంమీద పడుకొని ఏదో నవల చదువుతోంది.

బయట ఏదైనా చప్పుడైతే చాలు ఆమె ఉలిక్కిపడి, మెడ పైకెత్తి బయటికి చూసేది. ఎవరూ కనబడకపోయేసరికి మళ్ళీ నవలలో లీనం అయ్యేది. ఇంతకుపూర్వం ఈ పెద్ద భవనంలోనే ఆమె గంటలకొద్దీ ఒంటరిగా కాలం గడిపేది. అయినా ఆమెకు ఎలాంటి భయం ఉండేది

కాదు. కాని ఇప్పుడు ఎప్పుడైనా వాసుదేవ్ ఎక్కడికైనా వెళ్తే ఆమె ఒంటరిగా ఉండలేకపోతోంది. ఏవేవో పిచ్చిపిచ్చి ఆలోచనలు ఆమె మనసును కలతపెట్టేవి. అందుకని ఆమె ఏదో ఒకపనిలో నిమగ్నమై ఉండేది. కాని మళ్ళీ వ్యాకులత ఆమెను తన పంజాలో బంధించి పీడించేది. ఆమె దిగులును ఎంతగా మరచిపోవాలని ప్రయత్నం చేస్తోందో అది అంతగా ఎక్కువవుతోంది. వాసుదేవ్ లేని సమయంలో ప్రతి వస్తువు ఆమె బాధను ఎక్కువ చేస్తోంది. ఆమె పుస్తకం చదువుతోంది కాని ఆమె చెవులు మాత్రం వాసుదేవ్ ఎప్పుడువస్తాడా అని ఎదురుచూస్తున్నాయి. అతని అడుగుల శబ్దంకోసం మాటిమాటికీ నిరీక్షిస్తున్నాయి.





గాలి వేగంగా వీస్తోంది. తలుపులు, కిటికీలు అన్నీ మూసి ఉన్నాయి. కాని ఎక్కడనుంచో టక్ టక్ మని శబ్దం వస్తూఉంది. ఆమె అలాగే పడుకొని వాసుదేవ్ కోసం నిరీక్షిస్తోంది. అతడింకా తిరిగిరాలేదు. అప్పుడప్పుడు ఆమె పుస్తకం చేతిలోనే పట్టుకొని ఏదో దీర్ఘాలోచనలో మునిగిపోయేది. నిరీక్షణలో నిమిషాలు గంటల్లాగ గడుస్తున్నాయి.

సాయంకాలం కాగానే గంగ లోపలికి వచ్చింది. మాధురి అప్పటిదాకా నవల చదవడంలో లీనమై ఉంది. శబ్దం కాగానే ఆమె పుస్తకం మీదనుండి చూపులు మరల్చి ఓరగా గంగను చూసింది. గంగ చేతిలో రెండు ఉత్తరాలు ఉన్నాయి.

మాధురి చెయ్యిచాపి ఆ రెండు జాబులను అందుకొని వాటివైపు పరిశీలనగా చూడసాగింది. రెండు జాబులు భర్త పేరుతో ఉన్నవే. గంగ టీ తెస్తానని చెప్పి వెళ్ళింది. ఆమె వెళ్ళిన తరువాత మాధురి ఉత్సుకత ఆపుకోలేక మళ్ళీ ఆ జాబుల్ని చూసింది. ఒకటి ప్రభుత్వం నుండి

వచ్చింది. రెండవ జాబుపై రాయబడిన అక్షరాలు తనకు పరిచయమైన వాటిలాగే కనిపిస్తున్నాయి, కాని అవి ఎవరివో కని పెట్టలేకపోతోంది. ఆమె మళ్ళీ అడ్రసు పరిశీలించింది. మూలన ఉన్న సంతకం రాజేంద్ర సంతకంలా ఉంది.

ఆమె చటుక్కున లేచి మంచంపై కూర్చొంది. జాబు చేతిలోనే ఉంచుకొని ఆలోచిస్తోంది. చాలా కాలం తర్వాత ఈ రోజు రాజేంద్ర నుండి జవాబు వచ్చింది. అతడు ఇక్కడి నుండి వెళ్లిపోయిన తర్వాత రాసిన మొదటి ఉత్తరం ఇదే! జాబును పట్టుకొన్న ఆమె వ్రేళ్లు వణక సాగాయి. ఆమె దాన్ని కూడా బల్లమీద పెట్టింది. మళ్లీ పందుకొని నవల చదవ సాగింది. కాని ఆమె ధ్యాస ఇప్పుడు నవల మీద నిలబడటం లేదు. ఆ జాబు ఆమె మనసులో కల్లోలం రేపింది. పుస్తకం మూసి పై కప్పుకేసి చూడ సాగింది.

ఈ జాబు మానిపోయిన ఆమె గుండె గాయాన్ని రేపింది. అణగిపోయిన ఆమె వేదనను మేల్కొలిపింది. గతం సినిమా వలె ఆమె మస్తిష్కంపై ప్రతిఫలింప సాగింది.జరిగిపోయిన దృశ్యాలు వరుసగా కండ్ల ముందు వచ్చి నిలుస్తున్నాయి. మనసంతా మొద్దుబారినట్లయింది. హృద యంలో తనకే తెలియని ఏదో బాధ ఆమెను కలచివేయసాగింది. ఆమె ఆలోచిస్తోంది. అతడెక్కడ ఉన్నాడో? ఎలా ఉన్నాడో? ఆనాటి నుండి తన స్నేహితునికి కూడా ఒక జాబైనా రాయ లేదు. వాసు మాటల మధ్యలో చాలా సార్లు అతని గురించి ఎన్నో విషయాలు చెప్పేవాడు. కాని ఆమె వాటి పట్ల అంతగా ఆసక్తి చూపకుండా పక్కగది లోకి వెళ్లేది.

ఇప్పటి మాధురికి అప్పటి మాధురికి చాలా భేదం ఉంది. అప్పుడామె తన ప్రేమ తో పదభ్రష్టురాలినయానన్న కళంకాన్ని తుడిపి వేసుకో గలిగింది. ఇప్పుడామె మనో వాక్కాయ కర్మలతో వాసుదేవ్‌ను సేవిస్తోంది. అతని సుఖ శాంతులకై దివారాత్రులు ప్రయత్నం చేసోంది. అతనికి ఎలాంటి సందేహం దురభిప్రాయం కలిగే అవకాశం ఇవ్వ కుండా అతన్ని సేవిస్తోంది.

కాని ఆనందాలు విరిసే అతని మాన సాకాశంలో అప్పుడప్పుడు నల్లనిమేఘాలు క్రమ్ముకొనేవి. వాటిలో అతని విశ్వాసం కన్నీరుదాగి ఉండేవి. అతడెన్నోసార్లు నిశ్శబ్ద నిశీథిలో మౌనంగా, ఏదో దీర్ఘా లోచనలో నిమగ్నమై ఉండటాన్ని ఆమె గమనించేది. అతనికోసం మాధురి తన కోరికలను, తన ఆశలను బలవంతంగా అణచుకొన్నది.అవును... కేవలం అతని కోసమే! స్త్రీలలో సహజంగా ఉండే, తల్లి కావాలనే ప్రగాఢ వాంఛ ఆమెలో కూడా ప్రబలంగా ఉండేది. కాని ఆమె తన మనసును చంపుకొని, ఆ కోరికను వదులు కొంది. వదులుకోక ఏం చేయగలదు?

ఇప్పుడామెలో మునుపటి చంచలత్వం లేదు. అక్కడి అడవుల్లో చెంగు చెంగున గంతులు వేస్తూ సంచరించే లేడిలా తిరుగు తుండే ఆమె ఇప్పుడు బతిమిలాడినా ఇంట్లో నుండి బయటికి రావడం లేదు. వాసు ఎంత ప్రాధేయపడినా ఆమె ఏదో ఒక సాకుతో ఇంట్లోనే ఉండిపోతోంది.

ఆమె ముఖం రోజురోజుకూ గంభీరంగా మారిపోతోంది. తన ఉద్రేకాలపై,తనలో చెలరేగే భావపరంపరపై విజయం సాధిం చేందుకు చాలా శ్రమ పడుతోందని




వాసుకు అనిపించేది. ఆమె తన ఆకాంక్షలను బలవంతంగా అణచివేయాలని ప్రయత్ని స్తోంది. ఈ ఆలోచన వాసు మనసులో ముల్లులా గుచ్చుకొనేది. ఒకవైపు నిస్స హాయత, మరోవైపు మానవ హృద యంలో సహజంగా ఉండే దయార్ద్రిత. ఈ రెండూ అతన్ని అయోమయావస్థలో ఉంచేవి.




ఆరోజు వచ్చిన ఉత్తరం ఆమెలో నిద్రాణమై ఉన్న కోరికలను మేల్కొలి పింది. చాలాకాలంగా ఆమె మానస వీణా తంత్రులు మౌనంగా ఉండిపోయాయి. వాటిని ఈ జాబు గోటితో మీటినట్లయింది ఇంతవరకు ఆమె తన అంతరంగంలో అతి ప్రయత్నంమీద అణచుకొన్న దుఃఖం మళ్లీ పొంగి వచ్చింది.

ఆమె నుండి ఒక నిట్టూర్పు వెలువడింది. ఆ వాతావరణంలో తనను తాను మరచిపోయింది. అక్కడే మౌనంగా కూర్చుని, తన మనో క్లేశాన్ని, వ్యాకులతను విస్మరించాలనే వ్యర్థ ప్రయత్నం చేస్తోంది.

మనిషి తన గతాన్ని ఎక్కడో చీకటి కోణంలో దాచి పెట్టాలనీ, జీవన కిరణాలు దానిపై పడకుండా చేయాలనీ, జ్ఞాపకాల తెర ఎప్పటికీ తొలగ కూడదనీ అనుకొంటాడు. కాని అప్రయత్నంగా ఎప్పుడో ఒకప్పుడు ఒకానొక ఆకస్మిక సంఘటన ఆ పరదాను చించివేస్తుంది. అప్పుడు మనసులో దాగిన బాధ పైకి పొంగుతుంది. గతంలోని జ్ఞాపకాల చిత్రాలు మళ్ళీ ఆ వ్యక్తి మనోఫలకంపై ప్రత్యక్షమౌతాయి. ఈ బాధ ఎంతో విచిత్రమైంది. ఈ బాధలో ఒక చిత్రమైన ఆనందం ఇమిడి ఉంది.

పొద్దు కుంకే సమయం అయింది. మాదురి ఇంకా అక్కడే పడుకొని ఆలోచిస్తోంది. రెప్ప వాల్చకుండా పైకప్పు కేసి చూస్తోంది. ఉన్నట్టుండి ఆమె కండ్ల నిండా నీరు నిండి చెంపల మీదికి జారింది. వాసు ఎప్పుడు వచ్చిందీ, తననే దీక్షగా ఎంత సేపటి నుంచి చూస్తున్నదీ ఆమె గమనించనే లేదు.

ఆలోచనల్లో లీనమై ఆమె కాలాన్ని పరిసరాలను పూర్తిగా మరచిపోయింది. వాసు మెల్లగా నడిచి వెళ్ళి కిటికీ రెక్కలు తెరిచాడు. చీకటి గదిలోకి వెలుతురు ప్రవేశించింది. చల్లగా, మెల్లగా వీస్తున్న గాలికి కిటికీ తెరలు ఊగుతున్నాయి..

మాధురి ఉలిక్కి పడి చూసింది. ఎదురుగా వాసును చూసి కొంచెం సంబాళించుకొంది. తన మనసులో రేగుతున్న తుఫాను పైకి కనిపించనీయకుండా వెంటనే లేచి కూర్చుంది. వాసు చిన్నగా నవ్వాడు. కుర్చీని మంచం దగ్గరికి లాక్కొని, దానిపై కూర్చొని ఆమెను ప్రశ్నించాడు.

"ఇంత ఆహ్లాదకరంగా ఉన్న సమయంలో నీవెందుకు తలుపులు బిడాయించుకొని కూర్చొన్నావు?"

"ఇంకేం చేయమంటారు? మీరు కూడా ఇంట్లో లేరాయె!"

"అవును ఈ రోజు కాస్త ఆలస్యం

అయింది. రాత్రి కాకముందే రాగలిగాను అందుకు సంతోషించాలి"

"అర్ధరాత్రికి రావాలనుకొన్నారా కొంపదీసి ?"

"అలాగే అనుకొన్నాను. కాని నువ్వు గుర్తుకురాగానే పరుగెత్తి వచ్చాను."

"నేను అంతగా గుర్తున్నందుకు చాల థాంక్స్" మాధురి అతని వైపు తిరిగి అని కండ్లు కిందకు వాల్చింది.

వాసు ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని ఆమెను దగ్గరికి లాక్కున్నాడు. అతడామెను పూర్తిగా దగ్గరికి చేర్చుకొనక ముందే ఆమె ఆ దినం వచ్చిన రెండు జాబులను అతనికి ఇచ్చింది. వాసు ఆమె చెయ్యి వదిలి జాబులు చదవసాగాడు.

మాధురి లేచి వెళ్ళి గంగను పెద్దగా పిలిచి టీ తెమ్మని ఆదేశించింది. ఆమె తిరిగి వచ్చేసరికి అతడు రాజేంద్ర రాసిన జాబు చదువుతున్నాడు. ఆమె అతని దగ్గరకు వచ్చి నిలబడింది, కాని ఆ జాబును గురించి అడిగే ధైర్యం చేయలేకపోయింది.

వాసు జాబు చదివి ఒక పక్కన పెట్టాడు. తర్వాత మాధురి తన జంకును కప్పి పుచ్చుతూ అన్నది-

"టీ త్రాగుతారా, కాఫీ త్రాగుతారా?"

"టీ తెమ్మని గంగతో చెప్పి వచ్చావుగా ! మళ్ళీ ఈ ప్రశ్న అడగటం ఎందుకు ?"

"చెప్పాను సరే... అయినా మీ ఇష్టం చెప్పండి."

"ఈరోజు మనం టీ తాగుదాం... ప్రతిరోజు నా ఇష్ట ప్రకారం తాగుతున్నాను. ఈ దినం నీ ఇష్టప్రకారం తాగుతాను"

ఆమె మౌనం వహించింది... అలమరా తెరచి అందులోంచి బిస్కెట్ల ప్యాకెట్టు బయటికి తీసింది. వాసు కొన్ని క్షణాలపాటు ఆమెవైపు చూస్తూ ఉండిపోయాడు. తర్వాత అన్నాడు-

"ఈ వుత్తరం ఎవరు రాశారో తెలుసా ?"

మాధురి ప్రశ్నార్థకంగా అతనివైపు చూచింది.

రాజేంద్ర రాశాడు... అతడిప్పుడు పూనాలో ఉంటున్నాడు

మాధురి ఏమీ అనకుండా మౌనంగా ఉండిపోయింది. ఒకేసారి ఎన్నో ప్రశ్నలు ఆమె మనసులో ఉద్భవించాయి, కాని అవి పెదవి దాటి పైకి రాలేదు. ఏమీ అడగలేకపోయింది. తన భయాన్ని కప్పిపుచ్చుకోవడానికై స్టాండుపై ఉన్న టవలు తీసి అతనికి అందించింది.

"నీకో మంచి వార్త చెప్పాలి"

"ఏమిటది ?" ఆమె ఉత్సకతతో అడిగింది.

"నీ స్నేహితుడు రాజు పెండ్లి చేసుకొన్నాడట" అంటూ జాబు మాధురి చేతిలో పెట్టాడు. టవలు తీసుకొని ముఖం కడుక్కోవాలని వెళ్లాడు. మాధురి శరీరం ఆపాదమస్తకం కంపించింది. ఏదో వినరాని వార్త విన్నట్లు ఆమె దేహం గడగడ వణికింది.

ఈ వార్త ఆమె అంతరంగంలో అసూయను రేకెత్తించిందా? లేదు...లేదు ఆమెకు సంతోషం కలగాలి. రాజేంద్ర జీవితం చక్కబడింది. అతడొక ఇంటివాడైనందుకు సంతోషించాలి. అతడు ఏదో ఒకనాడు భార్యను వెంటపెట్టుకొని ఈ యింటికి తప్పక వస్తాడు తన భార్యను చూపిస్తాడు.




మాధురి జాబును బైటికి తీసింది. జాబుతో పాటు ఒక ఫొటోకూడా వచ్చి కిందపడింది. ఆమె ఫొటోను చేతిలోకి తీసికొని పరిశీలనగా చూసింది. అది రాజేంద్ర, అతని భార్య కలసి తీయించు కొన్న ఫొటో !

నవవధువులా అలంకరింపబడిన అందమైన యువతి అతని పక్కన ఉంది. ఇద్దర్నీ పక్క పక్కనే చూసిన మాధురి ముఖం కొన్ని క్షణాలపాటు ఎర్రగా మారిపోయింది. ఆమె జాబుచదువుతోంది. కొద్ది పంక్తులు మాత్రమే రాయబడిఉన్నాయందులో. పెండ్లికి వాసు దంపతులను పిలవనందుకు క్షమాపణ ఉంది. చివరి పంక్తిలో మాధురిని గురుచేస్తూ ఒక్క వాక్యం రాశాడు. "ఒకవేళ దగ్గర మాధురి ఉంటే ఆమెకు నేను పంపుతున్న తన వదిన ఫొటో చూపించు" అని రాసి ముగించాడు.

ముఖం తుడుచుకొంటూ వాసు స్నానాల గదినుండి బయటికి వచ్చాడు. మాధురి అతడు రావడం చూసి వెంటనే ఫొటోను కవర్లో పెట్టింది. వాసు చిన్నగా నవ్వుతూ అన్నాడు—

"నీకెలా ఉంది?"

"ఎవరు ?"

"రాజేంద్ర భార్య"

"చాలా అందంగా ఉంది. మీ అభిప్రాయం ఏమిటి ?"

"ఒక స్త్రీని గురించి మరో స్త్రీ చక్కగా కామెంట్ చేయగలదు"

"కాని పురుషునితో సమానంగా మాత్రం కాదు"

"అంటే ?"

"మేము వాళ్ళను పైపైన చూసి వర్ణిస్తాము. మీరు వాళ్ల అంతరంగాన్ని గ్రహిస్తారు."

"కావచ్చు. అప్పటికి కూడా వాళ్ళ హృదయ రహస్యాన్ని పురుషుడు కనుక్కోలేడు."

"మీ వాదన నేను ఒప్పుకోను"

"నీవే చెప్పు... సుమారు ఐదేండ్ల నుండి మనం భార్యా భర్తలుగా కలసి ఉంటున్నాము. కాని ఈనాటి వరకు నీ మనసును అర్థం చేసుకోగలిగానా ?"

"అందుకు కారణం ఒకటే...మీరు నా మనసును అర్థంచేసుకోవాలని ఎప్పుడూ ప్రయత్నం చేయలేదు."

వాసు ఏదో అనబోయే ముందే ఎవరో లోపలికి వస్తున్న శబ్దం వినిపించడంతో మౌనం వహించాడు.

గంగ టీ తీసికొనివచ్చి ట్రే బల్లమీద పెట్టి వెళ్ళింది. వాసుదేవ్ ఏమీ మాట్లాడకుండా కూర్చొని ఉన్నాడు. మాధురి టీ కలుపుతోంది. కొన్ని నిమిషాల పాటు అక్కడ మౌనం వ్యాపించింది. వాసు రాజేంద్ర, అతని భార్య ఉన్న ఫొటోను బయటకి తీసి చూడసాగాడు. మాధురి తలవంచుకొని టీ తయారుచేస్తోంది.

"తక్షణం పూనా వెళ్ళి ఇద్దర్నీ ఇక్కడికి పిలుచుకొని రావాలనీ, కొన్ని దినాలు ఇక్కడ ఉంచుకోవాలనీ అని పిస్తోంది."

"అయితే వెళ్ళండి...!"

"ఒకణ్ణే కాదు నువ్వు కూడా నావెంట రావాలి" టీకప్పు చేతిలోకి తీసుకొంటూ వాసు అన్నాడు.

"నేనా...నేను రాను. అక్కడ నాకేం పని ఉంది ?"

"మీ వదినను చూడాలనీ, ఆమెతో కలసి మాట్లాడాలనీ లేదా?"

"లేదని నేనన్నానా ? కాని పిలవని

పేరంటంగా వెళ్ళడం బాగుండదని అలా అన్నాను."

"ఓహ్! అదీ నిజమే! అయితే నేను కూడా వెళ్ళను.

మాధురి మౌనంగా ఉండిపోయింది. వాసు వెళ్ళినా వెళ్ళకున్నా తాను మాత్రం అక్కడికి పోదు. అతన్ని వెళ్ళకుండా తానెలా ఆపగలదు? తన మనసులో రాజేంద్రను కలుసుకోవాలనే గాఢమైన కోరిక దాగి ఉందనీ, ఇప్పటికీ తన మనో ఫలకంపై అతని రూపం చెరగలేదనీ ఆమె బహిర్గతం కానివ్వలేదు.

మరునాడు వాసు బయటికి వెళ్ళిన సమయంలో మాధురి అతని గదిలోకి వెళ్ళి రాజేంద్ర ఫొటోను పైకి తీసి దాని వైపు రెప్ప వాల్చకుండా చూస్తూ ఉండి పోయింది. అతని భార్య నిజంగానే చాలా అందంగా ఉంది. వాసు ఎలాగైనా పూనా వెళ్ళి వాళ్ళను తమ ఇంటికి పిలుచుకొని వస్తే బాగుండునని ఆమె మనసులో కోరుకొంటోంది. ఒకసారి రాజేంద్రను క్షమాపణ వేడాలని కూడా ఉంది. కాని ఈ కోరికను భద్రంగా హృదయాంతరాళాల్లో దాచుకొంది. పైకి ఏమాత్రం తెలియనివ్వలేదు.

తర్వాత ఎన్నోసార్లు ఇంట్లో రాజేంద్ర ప్రస్తావన వచ్చింది కాని ఆమె దానిని కొనసాగనివ్వలేదు. ఆ మాటలు ఆమె తీరని కోరికలను, కల్లలైన కలలను జ్ఞప్తికి తెచ్చి ఆమెలోని గాయాన్ని రేపుతాయి. వాటిని విస్మరించాలని ఆమె ఎంతో ప్రయత్నం చేసి చేసి చివరకు పిచ్చిదై పోతోంది. అప్పుడప్పుడు రాజేంద్ర, అతని భార్య అక్కడికి వచ్చినట్లు, వాళ్ళకు అతిథి మర్యాదలు చేయడంలో తాను ఉక్కిరి బిక్కిరి ఔతున్నట్లు భ్రమ పడేది. కాని అది వట్టి భ్రమ అని తెలుసుకోగానే, కల చెదిరిపోగానే ఆమె ఎంతో బాధపడేది.

కొన్ని రోజుల తర్వాత రాజేంద్ర నుండి మరో జాబు వచ్చింది. భార్య కుముద్ చాల జబ్బుతో ఉందనీ, ఆమె పరిస్థితి విషమంగా ఉందనీ, అందువల్ల హాస్పిటలులో చేర్చబడిందనీ రాశాడు. అంతకంటే వివరాలేమీ లేవు.

జాబు చదివి భార్యా భర్తలిద్దరూ చాలా బాధ పడ్డారు. వాసు తన విచారాన్ని ఆమె ఎదుట వ్యక్త పరిచాడు కాని ఆమె మాత్రం బాధను పైకి వ్యక్తం చేయలేదు. వాసు పూనా వెళ్లాలని నిశ్చయించుకొన్నాడు. కాని మాధురిని ఒంటరిగా వదిలి వెళ్ళడం అతనికి ఇష్టం లేదు. వాసు వెంట వెళ్ళి ఆరిపోతున్న నిప్పును మళ్ళీ రగిలించడం ఆమెకు అసలే ఇష్టంలేదు. ఆమె తనను తాను సంబాళించుకోవాలని ప్రయత్నం చేస్తోంది. కాని మనసు ఆమె స్వాధీనం తప్పుతోంది. భయం, వణుకు వల్ల ఆమెకు రక్తం గడ్డ కట్టినట్లు అనిపించింది. శరీరం అంతా మొద్దుబారినట్లనిపించింది. ఎవరో వేలకొలది సూదులు గుచ్చుతూ తనకు స్మారకం తప్పించే ప్రయత్నం చేస్తున్నట్లనిపించింది. అయినా ప్రాణం పోతున్నదానిలా చేతనా రహితంగా అయిపోతున్నది. ఎవరో ఆమెను ఎత్తైన కొండ శిఖరం మీదికి తీసికొని వెళ్ళినట్టు, అకస్మాత్తుగా కిందికి తోసినట్లు అనిపించింది. తాను, గిల గిల కొట్టుకొని చనిపోతున్నట్లు, ఆ చావును తన కండ్లతో చూస్తున్నట్లు అనిపిస్తోంది.

జరగవలసిన దాన్ని ఎవరు తప్పించ గలరు! కొన్ని దినాల తర్వాత రాజేంద్ర పంపిన ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం వచ్చింది. కుముద్ పరిస్థితి చాలా విషమించిందని తెలుపుతూ, అతడు వాసును రమ్మని రాశాడు. వాసు మాధురిని కూడా వెంటరమ్మని పిలిచాడు కాని ఆమె ఈసారి కూడా అతని కోరికను తిరస్కరించింది.

వాసు పూనా వెళ్ళాడు. మాధురి ఒంటరిగా మిగిలిపోయింది. ఆమె మనోవ్యధ ఇంకా తగ్గలేదు. ఆమెలో వ్యాకులత ఇంకా ఎక్కువ కాజొచ్చింది. ఆమె ఇంట్లో ఒంటరిగా ఉండేందుకు భయపడుతోంది. వాసు వెంబడి వెళ్ళనందుకు పశ్చాత్తాప పడుతోంది. ఆమె మనసును రకరకాల ఆలోచనలు చుట్టుముట్టేవి – ఆమె ఏమేమి ఆలోచిస్తుందో ఆ దేవునికే తెలియాలి. ఆయన ఒక్కరే వెళ్తే, ఆయన వెంట తను లేకపోవడం చూస్తే రాజేంద్ర ఏమనుకున్నాడో? ఏమన్నాడో? కుముద్ విషయంలో తాను ఈర్ష్య పడ్డానని అనుకొన్నాడేమో! ఇలాంటి ఆలోచనలు ఆమె మెదడును కల్లోలపరచేవి. ఆమె పంజరంలో బంధింపబడిన పక్షిలా విలవిలలాడుతోంది. మనసుకు హాయిలేదు.




వాసు వెళ్ళి పది దినాలైంది. అతని దగ్గర నుండి ఎలాంటి కబురు అందలేదు. కుముద్‌కు నెమ్మది చిక్కగానే, ఇద్దర్నీ ఇక్కడికి పిలుచుకొని వస్తానని వాసు వెళ్ళే ముందు చెప్పి వెళ్ళాడు. వాళ్ళు గనక రామంటే ఆయన ఒక్కరే తిరిగి వస్తారు. ఆయన వెళ్ళినప్పటి నుండి ఒక్క జాబైనా రాయలేదు. బహుశ వాళ్ళను వెంటపెట్టుకొని రావాలనుకొని, ఉత్తరం రాయలేదేమో! ఈ ఆలోచన రాగానే ఆమెకు కొంత ఊరట కలిగింది. ఇంటిని కొత్త పద్ధతిలో చాలా అందంగా అలంకరించింది. కుముద్ ఆ ఇంటినిచూసి మెచ్చుకోవాలని, దాని యజమానురాలి సౌందర్య ప్రియత్వానికి మురిసిపోవాలని ఆమె ఆశించింది.

మరునాడు కూడా ఏమీజాబు రాలేదు. ఆమె నిరాశ పడింది. అన్నం కూడా తినలేదు. సూర్యుడు పశ్చిమాద్రి చాటున దాక్కొనబోతున్నాడు. ఉన్నట్టుండి ఆమె మనసు బరువెక్కిపోతోంది. రాత్రి కాకుంటే బాగుండునని ఆమె అనుకొంటోంది. చీకటి తెర ఆమె మనసును ఎంతో కలవరపెడుతోంది. ఆమె పగటి వెలుగును మాత్రమే ఇష్టపడుతోంది.

మనసులో భయాందోళనలు ఎక్కువవుతున్న కొద్దీ బయటి చీకటిలో వినిపించే చిన్న చప్పుడుకు కూడా ఉలిక్కిపడుతోంది. పగటి కాంతిలో అందంగా, మనోహరంగా కనిపించే దృశ్యాలను రాత్రి తన నల్లని ముసుగులో కప్పివేసినప్పుడు ఆమె కండ్లముందు పగటి సమయంలో చేసిన పాపాలన్నీ ప్రత్యక్షమయ్యేవి. అవి గుర్తుకు రాగానే ఆమె గుండె వేగంగా కొట్టుకొనేది.

నిశా సుందరి తన చీకటి ముసుగు కప్పుతుంటే మాధురి అతి ప్రయత్నం మీద ధైర్యం తెచ్చుకొనేది. మనసులో

చెలరేగే భావాల తుఫాను, మనసును కమ్మి వేస్తున్న భావ పరంపర గడచిన దినాల్ని గుర్తు చేస్తున్నాయి. ఆమె ఆ చీకటి రాత్రులలో ఎంత సేపలా బాధపడుతూ గడుపుతోందో ఎవరికీ తెలియదు. ఎవరో తన మెదడును తన పిడికిలిలో పట్టుకొన్నట్లు, దాన్ని నిర్దయగా నలిపి వేస్తున్నట్లు ఆమెకు అనిపించేది.

మధురమైన ఆ రాత్రులు, మత్తెక్కించే ఆ చెరువు తీరు, చక్కిలిగింతలు పెట్టి దేహాలను, ఆత్మలను వింత లోకాల్లో విహరింపచేసే ఆ చల్లని గాలులు, వాటిలో మిళితమై ఉన్న సుగంధం ఒకదాని తర్వాత ఒకటిగా మిణుగురు పురుగులవలె ఆమె మనోఫలకంపై తళుక్కుమని మాయం అవుతున్నాయి. ఆమె నరాలు గుంజుతున్నాయి. నాడి వేగంగా, కొట్టుకో సాగింది. పెదాలు వణుకుతున్నాయి. భయంవల్ల నొసలు చెమట బిందువులతో నిండిపోయింది.

ఉన్నట్లుండి ఆమెకు వాసు గుర్తు వచ్చాడు. ఇప్పటివరకు పిచ్చి పిచ్చిగా ఆలోచిస్తున్న ఆమెకు కొంత ఊరట కలిగింది. మౌనంగా గదిలోకి వెళ్ళింది.

చీకటి పడింది. మాధురి మంచంపై పడుకొని వాసు గురించి ఆలోచిస్తోంది. ఒంటరితనం వల్ల భయం కలుగకుండా ఉండాలని తన గదిలో గంగను తోడుగా ఉంచుకొని ఆమెతో మాట్లాడుతోంది. మాధురి చెవులు గంగ మాటలను వింటున్నాయి. కాని మనసు మాత్రం పూనాలో ఉంది.

ఇంకా రాత్రి మొదటిజాము దాటలేదు. బయట చిన్నగా వర్షం కురుస్తోంది. ఎవరో బయటి తలుపు తట్టుతున్న శబ్దం వినిపించింది. ఆమె ఉలిక్కి పడి లేచి కూర్చుంది. అప్పటిదాకా మాట్లాడుతున్న గంగ పాడుతున్న రికార్డు మీద



పిన్ను తీసినంత అకస్మాత్తుగా ఆగి పోయింది. "వెళ్ళి ఎవరొచ్చారో చూడు" మాధురి గంగతో అన్నది. గంగ బయ టికి వెళ్ళింది. ఆమె ఒక్క ఉదుటున వెళ్ళి పక్కనున్న కిటికీ తెరిచి కిందికి చూసింది. గంగ నెమ్మదిగా తలుపు దగ్గ రికి పోతోంది.

గంగ అక్కడికి వెళ్ళక ముందే కాపలావాడు వెళ్ళి తలుపు తెరిచాడు. మాధురి ఉపిరి బిగపట్టి క్రిందికి చూస్తోంది ఆమెకు వాసు స్వరం వినిపించింది. అతడు అంటున్నాడు–

"క్రొత్త అతిథిని లోపలికి తీసికొని రండి" మాధురివచ్చి పడకపై కూర్చుంది. ఆమె భర్త తిరిగి వచ్చాడు. బహుశ రాజేంద్ర, కుముద్ కూడా వెంట వచ్చా రేమో! రాజేంద్రను గురించిన ఆలోచన రాగానే ఆమె ఒళ్ళు పులకించింది. ఆమె శ్వాస బిగపట్టి వాళ్ళ అడుగుల చప్పుడు వింటోంది. ఎదురు వెళ్ళి వాళ్ళకు స్వాగతం చెప్పే సాహసం ఆమెలోలేదు.

పరదా తొలగించి వాసు లోపల అడుగు పెట్టగానే ఆమె లేచి నిలబడింది. చూపులు కలిశాయి. వాసు గంభీరంగా ఉన్న ముఖంపై చిరునవ్వు తెచ్చుకొని అన్నాడు–"మాధురీ. ఎలా ఉన్నావు ?"

"బాగానే ఉన్నాను. మీరు ఇప్పుడు వస్తున్నారా... ?"

"అవును. కొంచెం ఆలస్యం అయింది"

"దూరప్రదేశం వెళ్ళేసరికి మాట్లాడే పద్ధతి కూడా మారిపోయిందే !"

"ఎందుకని ?"

"స్వంత ఇంట్లోనే ప్రతి వస్తువును వింతగా చూస్తున్నారు"

"కాని, నిన్ను కాదు"

"అని ఎలా నమ్మడం ?"

"నీ మనసునే అడుగు"

"పొండి. మీరు మరీను"

అక్కడే నిలబడి ఉన్న గంగ వైపు చూపిస్తూ వాసును హెచ్చరిస్తున్నట్లుగా అన్నది. మాధురి తన ఓర చూపును పక్కకు మరలిస్తూ మెల్లగా అడిగింది–

"వెంట ఎవరైనా వచ్చారా ?"

"వచ్చారు. చూడు ఎవరు వచ్చారో"

మాధురి ద్వారం వైపు చూసింది. అక్కడెవరూ లేరు.

"ఆయన మీ వెంట వచ్చారా ?" ఆమె అడిగింది.

"ఎవరూ? రాజేంద్రా ? రాలేదు. అతడు రాలేదు"

"అయితే కుముద్ వచ్చిందా ?"

"ఆమె ఇంకేం వస్తుంది" అతడు గంభీర ముద్ర వహించాడు.

"ఏ మి టి ? ఆమెకు ఏమైంది ?" అప్రయత్నంగా ఆత్రంగా అడిగి భర్త ముఖంకేసి చూడసాగింది మాధురి. అతని కండ్లలో నీరు చూసి ఆమె అదే ప్రశ్నను మళ్లీ అడిగింది.

"మాధురీ! కుముద్ ఇక ఎన్నటికీ తిరిగిరాని చోటికి వెళ్ళింది" వాసు కంఠ బొంగురుపోయింది. అతడు ముఖాన్ని పక్కకు తిప్పుకొన్నాడు.

"ఆమెకు ఏమైంది ?"

అప్పుడే గంగ మామూలు దుస్తుల్లో ఉన్న ఒక స్త్రీని వెంట పెట్టుకొని, పరదా తొలగించి గదిలో ప్రవేశించింది. ఆ స్త్రీ చేతిలో ఒక పసిబిడ్డ ఉన్నాడు. ఆమె ప్రశ్నకు జవాబు అన్నట్లుగా ఆ బిడ్డ గదిలోకి తేబడ్డాడు.

ఆ స్త్రీ వేషం చూస్తే ఆమె ఒక దాది

అని తెలుసోంది. "ఈ బాబు రాజేం కుమారుడు... ఈ లోకంలో ప్రవేశించ గానే తల్లిని పోగొట్టుకొన్నాడు" వాసు అన్నాడు. మాధురికి అంతా అర్థమై పోయింది.

వాసు మళ్ళీ అన్నాడు – "నేను వెళ్ళే సరికే ఆమె ఈ లోకాన్ని వదిలి అనంత లోకాలకు వెళ్లింది. రెండు దినాల వయసున్న ఈ బాబు రాజేంద్రకు ఒక చిక్కు సమస్యగా, జవాబు తెలియని ప్రశ్నగా మిగిలిపోయాడు."

"ఆయన రాలేదా?"

"లేదు. ఈ బాబును నీ కోసం పంపించాడు. మాధురి తప్ప నాకు ఆప్తు లెవరూ లేరు. ఆమె తప్ప ఈ బాబును స్వంత బిడ్డలా పెంచే వాళ్ళెవరూలేరు' అన్నాడు"

* * *

మాధురి కండ్లలో ఇంతవరకు నిలిచిన కన్నీరు ధారగా కారింది. ఆమె మెల్లగా– ఆ దాది వైపు నడిచింది. ఆమె ఒడిలో చిన్న బాబు కాళ్ళు చేతులు ఆడిస్తున్నాడు పిల్లవాడు చాలా ముద్దుగా ఉన్నాడు. కొన్ని క్షణాల పాటు ఆమె వాడి వైపు రెప్ప వాల్చకుండా చూస్తూ ఉండి పోయింది. తర్వాత వాణ్ణి చేతుల్లోకి తీసుకొని గుండెలకు హత్తుకుంది.

ఆమెలో ఉన్న ఆర్ద్రీభావం గట్లు తెంచుకొని ప్రవహించింది. మమత జాగృతమైంది. ఆరిపోతున్న దీపం మళ్ళీ వెలిగింది. బాబును వక్షానికి ఆనించుకొని ఆమె తనను తాను మరచిపోయింది. వాసు ఆమెను పొదివి పట్టుకొని, పక్క గదిలోకి తీసుకొని వెళ్లిన తర్వాత, ఆమె ఈ లోకంలోకి వచ్చింది.

భర్తతో పాటు ఆమె గదిలోకి పోతు న్నప్పుడు ఎంతో ఆత్మతృప్తిని అనుభ వించింది. మునిగిపోతున్న తన జీవిత నావకు దూరమైన చుక్కాని మళ్ళీ దొరికినట్లు, దాని సహాయంతో తాను తుఫానులో నుండి, సుడిగుండం నుండి బయట పడినట్లు ఫీలవుతోంది. చీకటి రాత్రుల్లో ఆమె మనసును ఆవరించి, అశాంతికి గురిచేసే విచిత్ర భావాలు ఒక్కొక్కటిగా ఆమెకు దూరం కాసాగాయి. వాటి స్థానంలో నూతనో త్సాహం ఆమెను పాతాళం నుండి పైకి లేవనెత్తినట్లు, ఆకాశానికి ఎగుర వేస్తున్నట్లు అనిపించసాగింది.

ఆ ఇంట్లో ఆనందం వెల్లి విరిసింది. అసంపూర్తిగా ఉండిపోయిన కలలు నెర వేరాయి. ఆమె స్వతంత్ర విహంగంలా ఆకాశంలో ఎగురుతోంది. అంతలో ఒక శబ్దం ఆమెను ఈ లోకంలోకి తెచ్చింది. ఆ శబ్దం ఇప్పటివరకు ఆమె జీవితంలో, ఆమె పరిసరాల్లో లేని ఒక విచిత్రమైన శబ్దం. ఆ శబ్దం విని ఎవరో భుజాలు పట్టుకొని కుదిపినట్లుగా ఆమె ఉలిక్కి పడింది. కలల సముద్రం నుండి బయట పడి వాసవ జగత్తులోకి వచ్చింది.

రాజేంద్ర కుమారుడు, ఇప్పుడు తన బాబు. వాడి ఏడుపు, వాడి అరుపులు ఆమె చెవులకు సోకాయి. ఏదో మధుర సంగీతం విన్నట్లు, కమ్మని మురళీగానం విన్నట్లు ఆమె ఆనందంతో పరవశించి పోయింది. ఏదో కోల్పోయిన అమూల్య సంపదను మళ్ళీ పొందినట్లు ఆమె బాబును గాఢంగా గుండెలకు హత్తుకొంది.





నయనానందం కలిగించే సాధు జంతువుల్లో జింక ఒకటి కాబట్టే పూర్వకాలంలో రాజుల అంతఃపురాల్లో, ఉద్యానవనాల్లో యథేచ్ఛగా విహరిస్తుండేది. మునుల ఆశ్రమాల్లో కూడా వీటి సందడి హెచ్చుగా ఉండేది. ఆ జింక పుట్టుక ఎలాఉంటుంది...?



ఈ తెల్లజింక కూనకి జన్మనిచ్చేందుకు సిద్ధంగా ఉంది.

ప్రసవం పునర్జన్మతో సమానమంటారు. ప్రసవవేదనతో బాధపడుతోంది మన జింక.





తల్లి బాధపడుతుండే, నిదానంగా ముందు కాళ్ళని బహిర్గతం చేస్తూ విశాల విశ్వంలోకడుగుపెట్టబోతోంది కూన.

కూన కాళ్లు క్రమంగా బయటపడుతున్న దృశ్యం ఇది. బాధ భరించలేని జింక తన తలని చెట్టుమొదలు కేసి రుద్దుకుంటోంది పాపం!





అమ్మయ్యా! కూన కొంతవరకూ పైకొచ్చేసింది. తల్లికి బాధ తగ్గుముఖం పడుతున్నట్టుంది. కాస్త నెమ్మదించింది.

హమ్మయ్యా! జింకపిల్ల పూర్తిగా పైకొచ్చేసి, తల్లిని బాధనుండి విముక్తురాల్ని చేసింది. బిడ్డ భవిష్యత్ గురించి కాబోలు ఏదో ఆలోచిస్తున్నట్టుంది తల్లి.





దగ్గరౌతున్న పిల్లని ముద్దుగా తనలో పొదువుకుంటూ,
కూన శరీరాన్ని నాకుతూ శుభ్రపరుస్తోంది తల్లి జింక.

తల్లి ఒడిలో వెచ్చగా పాలు తాగుతున్న జింకపిల్ల.
ప్రేమానురాగాలతో ముద్దాడుతున్న తల్లి.





విశాల ప్రపంచంలోకడుగుపెట్టిన తన కూన శరీరాన్నే మాలిన్యమూ అంటరాదని కాబోలు మళ్లీ మళ్లీ శుభ్ర పరుస్తోంది.

పదకొండు నిమిషాల వయసుగల కూన ఇది. అప్పుడే తల పైకెత్తి ఆశ్చర్యంగా చూస్తోంది ప్రపంచాన్ని.





లేలేత కాళ్లతో జీవితంలో తొలిసారిగా నిలబడ్డానికి
కూన చేసే విశ్వప్రయత్నం.

నేనూ నడవగలను అన్నట్టు పుట్టిన పద్దెనిమిది నిమిషాలకే చిట్టిపొట్టి అడుగులేస్తూ, అలరిస్తున్న కూన, నేనున్నా భయంలేదని' అభయమిచ్చే జింకతల్లి.



# గజరాజుల ఆగ్రహం

హిందూమతంలో ఏనుగులకు ఎంతో ప్రాముఖ్యత వుంది. గణనాయకుడు గజాననుడు కావడమే అందుకు ప్రబల నిదర్శనం. అటువంటిది ఇటీవల సలభై అడవి ఏనుగుల మంద కక్ష కట్టినట్లు నేపాల్లో విధ్వంసకాండ జరిపింది. దాదాపు ఏడునెలల కిందట పశ్చిమబెంగాల్ అడవుల్లోంచి బయల్దేరి ఓ అయిదు కిలోమీటర్ల ప్రాంతంలోవున్న పొలాల్ని నాశనం చేసి నేపాల్లో ప్రవేశించి అక్కడో చిన్న అడవిలో పునరావాసం ఏర్పరచుకున్నాయి. మరీ చిన్నగావున్న అడవిలో అన్ని ఏనుగులు ఇమడలేక పక్కనే పైరుతో నిండిన పొలాల మీద పడ్డాయి. వాటిని పాడుచేశాక అరటితోటల్లో చొరబడి వేళ్ళతోసహా చెట్లను పీకిపడేసి దాదాపు నూటపదిహేను ఎకరాల పంటను నేలమట్టం చేశాయి తిన్నంత తినగా. అంతటితో ఆగక కాపుసారా వాసనను పసిగట్టి సారాకుండల్ని దాచిన నూటఇరవై ఇళ్ళను ధ్వంసం చేశాయి. ఈ గొడవలో ఇద్దరు మరణించారు. అంతవరకూ చూసీ చూడనట్లున్న నేపాల్ ప్రభుత్వం పరిస్థితి మరింత విషమించకుండా వుండడానికి సైన్యాన్ని పంపింది. ఏనుగుల్ని వేటాడ్డంలో ప్రవీణుడైన 'ఫ్రాంక్ పోపుల్‌టన్' రంగంలోకి దిగి నాలుగు ఏనుగుల్ని చంపేశాడు. మిగతా వాటిని భారతదేశ అడవుల్లోకి తరిమికొట్టాడు. గజ రాజుల్ని ఇలా నిలువునా కాల్చి చంపేయడం మూఢనమ్మకాలు, మతం పట్ల గౌరవం వున్న గ్రామస్థులకు నచ్చలేదు. ఇది చాలా పాపమనీ ఎన్నో దుష్ఫలితాలకు దారి తీస్తుందనీ విశ్వసించి వాటి కళేబరాలకు పూజలు చేశారు. వారి నమ్మకాలు నిజం చేయడానికా అన్నట్లు ఓ ట్రక్కు ప్రమాదంలో నలుగురు గ్రామస్థులు అక్కడికక్కడే మరణించడం తటస్థించింది. ఇది జరిగిన ఓ నెల్లాళ్ళకే మళ్ళీ అదే ఏనుగులమూక నేపాల్లోకి ప్రవేశించింది. వాటిని చంపి పాపాన్ని మూట కట్టుకోవడానికి ప్రజలొప్పుకోలేదు. ఈసారెందుకో ఏనుగులు కూడా బుద్ధిగానే వున్నాయి. వాటిని చంపడం



మాని మచ్చిక చేయడానికే నేపాల్ ప్రభుత్వం నిశ్చయించుకుని ప్రజల అభీష్టాన్ని నెరవేర్చింది.

# కలియుగ ద్రౌపది

ద్వాపర యుగంలోనేకాక ఈ కలియుగంలో కూడా ద్రౌపదులున్నారని ఈ ఉదంతం స్పష్టం చేస్తోంది. కాకపోతే

ఈమెకు భర్తలు ముగ్గురే.

కేరళ మలబార్ ప్రాంతంలో తియాజ్ అనే జాతివారిలో స్త్రీ ఎందరినైనా పెళ్ళాడొచ్చు.

ఆ విధంగానే అమ్మలు అనే స్త్రీ కరుప్పన్‌తో పాటు అతని తమ్ముళ్ళిద్దర్నీ కూడా పెళ్ళాడింది. ముగ్గురివల్లా ముగ్గురు పిల్లలు కూడా పుట్టారు.ముగ్గురన్నదమ్ములకి ఆస్తిపాస్తులుండేవి. ఉమ్మడికుటుంబం కావడం వల్ల తరచూ ఏవో గొడవలు, కొట్లాటలు జరుగుతుండేవి. ఇలా ఉంటుండగా కరుప్పన్ చనిపోయేడు.అతని వాటా



కోసం అమ్మలు, మిగిలిన ఇద్దరు భర్తలూ కొట్లాడుకున్నారు. చివరికి కోర్టుకెక్కారు. 'కరుప్పన్ విధవగా నేనే ఆస్తికి వారసురాల్న'ంటుంది. అమ్మలు.'మేమిద్దరం బతికుండగా ఆమె విధవెలా అవుతుంద'ంటారు అన్నదమ్ములు. హిందూ విడోరీ మేరేజ్ యాక్ట్ ప్రకారం భర్త చనిపోయాక పెళ్ళి చేసుకోని పక్షంలో ఆమె విధవగా పరిగణించబడుతుంది. కానీ అమ్మలు విషయంలో ఆమె భర్త చనిపోయాక కూడా ఇంకా ఇద్దరు భర్తలు బతికే ఉన్నారు. అటు విధవాకాక ఇటు పునిస్త్రీ కాక రెండు స్థాయిల్నీ అనుభవిస్తోందామె. చివరికి కోర్టువారు ఇవన్నీ పరిశీలించి ఆమె తన చనిపోయిన భర్త ఆస్తికి వారసురాలని తీర్పిచ్చేరు. దాంతో మిగిలిన ఇద్దరు భర్తలూ కూడా ఆమె నొదిలిపెట్టేశారు. అది వేరే విషయమనుకోండి.

## దయ్యం బస్సు

మనుషులకో, జంతువులకో దయ్యం పట్టిందంటే నమ్మవచ్చు కాని ప్రాణంలేని వస్తువులు బస్సులు, లారీలక్కూడా దయ్యాలు పడతాయంటే నమ్మడమెలా?

కాని బస్సుకి దయ్యం పట్టిన సంఘటన ఫ్రాన్స్‌లో జరిగింది. 1937 జూన్ 25న సాధారణంగా నిర్మానుష్యంగా వుండే రోడ్డుమీద రెండుకార్లు గుద్దుకొని ప్రమాదం జరిగింది.ఒకకారు డ్రైవరు అక్కడికక్కడే మరణించగా మరొకతను తీవ్రమైన గాయాలతో ఆస్పత్రిలో చేరాడు. స్పృహ వచ్చాక గాయపడిన డ్రైవర్ని ప్రశ్నించగా అతికష్టం మీద జరిగిన విషయాలు గుర్తుతెచ్చుకొని - అత్యంతాధునికమైన బస్సొకటి లోపల లైట్లు వెలుగుతుండగా అత్యంత వేగంతో తనవైపు దూసుకు రావడం కన్పించిందని, ఆ బస్సు డ్రైవరు లేకుండా ప్రయాణించడం చూసి మతిపోయినంత పనై ప్రమాదానికి గురి అయ్యానని చెప్పాడు. ఆ బస్సును చూసిన మరో వ్యక్తి కూడా వున్నాడు. ఆ రహదారి పక్కనే వుండే ఇంట్లో నివసించే జె. ఎస్. క్లిట్‌మేస్ ఎన్నోసార్లు ఆ బస్సును చూశాడు. బస్ ఆ దారి వెంట వెళ్ళినప్పుడు దానిలైటు వెలుతురు క్లిట్

వ్యవసాయదారుల
సచిత్ర మాస పత్రిక

# అన్నదాత

సాలు చందా రు: 18/- మాత్రమే

అన్నదాత, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్-500004.

# WANTED

**TECHNICAL EXAMINATIONS TRAINING COLLEGE**
**(Managed by Indian Technical Educational Society)**
**(RECOGNISED BY COM. UNIVERSITY)**

**1. ACCOUNTANCY 2. BANKING 3. MANAGEMENT**

**UNIVERSITY** మరియు ప్రభుత్వము వారిచే నిర్వహించు కోర్సులకు మా కళాశాలలో శిక్షణ పొందవలెను. తరువాత **BANK**లందు ప్రభుత్వ కార్యాలయములందు ఇతర సంస్థలందు **ACCOUNTANTS, CLERKS, CASHIERS, MANAGERS**గా చేరి నెలకు రు. 460-850 వరకు జీతమును పొందుటకు అర్హులు.

విద్యార్హత: **SSC or Inter or DEGREE Passed/Failed**

శిక్షణా కాలము: 2 నుండి 6 నెలలు. **Age** 17 సం॥ ఆపై యుండవలెను.

**SCHOLARSHIP** రూ. 150/-

శిక్షణా కాలమందు ఉచిత **HOSTEL** వసతి లభించును. **Mess facilities** కలవు. శిక్షణ పొందుగోరు అభ్యర్థులు **PROSPECTUS** మరియు **APPLICATION** కొరకు రూ.3/-లు **M.O.** లేక **POSTAL ORDER** పంపి పొందవచ్చును.

గమనిక: అన్ని కోర్సులకు **POSTAL** మూలముగా కూడా శిక్షణ కలదు.

**PRINCIPAL, T.E.T. COLLEGE,**
**KOYAMBEDU, MADRAS-600 107.**

మేన్ ఇంటికప్పు మీద పడేది. రాత్రి అయ్యేసరికి బస్‌లో లైట్లన్నీ వెలుగుతుండగా ప్రయాణికులు, డ్రైవరూ లేకుండా ఆ బస్ ప్రయాణం చేసేది. అది ఎక్కడ నుంచి ఎక్కడికి పోయేదో ఎవరికీ అంతు పట్టేదు. కార్ల ప్రమాదం జరిగిన రోజు రాత్రి క్లిట్‌మేన్ బస్ వెళ్ళడం చూశాడు. కొంచెం సేపటికే పెద్ద శబ్దం విన్పించి బయటికెళ్ళి చూడగా రెండు కార్లు ప్రమాదానికిగురై కన్పించాయి. క్లిట్‌మేన్ సాక్ష్యం చెప్పాక కోర్టువారు దయ్యం బస్‌వలనే ప్రమాదం జరిగిందని నిర్ణయించి కేసు కొట్టేశారు.

# చట్ట వ్యతిరేకులు

ఈ మధ్య స్పెయిన్‌లో జనరల్ ఫ్రాంకో మరణానంతరం అంతకు ముందు విధింపబడిన అనేక పరిమితులను సడలించారు. ఇంకేముంది దొరికిందే సందు కదాని అందరూ తెగ విజృంభించేస్తున్నారట. ఇప్పుడు స్పెయిన్‌లో వున్న చట్టాలను ఎవరైనా సులభంగా అతిక్రమించేయవచ్చట. అక్కడ అశ్లీలంగా వున్న నగ్న సుందరీమణుల బొమ్మలు వేసే పుస్తకాలు నిషేధించబడ్డాయి. అయినా బహిరంగంగానే అట్లాంటి పత్రికలనేకం ఈ మార్కెట్లో అమ్ముడు పోతున్నాయి. న్యూడ్ ఫొటోల ప్రచురణ నిషిద్ధమైనా ఆ పత్రికల సంపాదకులు ప్రచురిస్తారు. ఒకవేళ కోర్టువారు విచారించి జరిమానా వేస్తే జరిమానా చెల్లింపుకు బ్యాంకు హామీ ఇస్తుంది గనుక జరిమానా తప్పించుకొంటారు వీరు. ఒకవేళ సంపాదకుడికి శిక్ష పడినా పెరోల్ (మాట హామీ) మీద విడుదలై తిరిగి నూతనోత్సాహంతో తన పని ప్రారంభిస్తాడు.

అలాగే ప్రభుత్వం జర్నలిజమ్ వృత్తిని ఆరేళ్ళపాటు నిషేధించగా సుప్రీం కోర్టు ఈ మధ్య ఆ నిషేధాన్ని తొలగించింది. అదీగాక ఈదేశంలోని అనేక చట్టాలను అక్కడి పౌరులే అతిక్రమిస్తుంటారు. గర్భ నిరోధక మాత్రలమీద స్పెయిన్‌లో నిషేధం వుంది. అయినా అక్కడి స్త్రీలు చట్టాన్నంతగాపట్టించుకోరు. అబార్షన్ చట్ట విరుద్ధమైనా జనరల్ ఫ్రాంకో మరణించిన



సంవత్సరం మూడు లక్షల మంది స్త్రీలు అబార్షన్ చేయించుకున్నారు. అక్కడ విడాకులకి ప్రత్యేకంగా చట్టమంటూ లేదు. దాదాపు పది లక్షల మంది దంపతుల జీవితాలు అటూఇటూ కాకుండా ఊగిసలాడుతున్నాయి. బహిరంగంగా ముద్దు పెట్టుకోవడం నిషేధమయినా అక్కడ పదిహేను ఇరవై ఐదు ఏళ్ళలోపువారితో వివాహ పూర్వశృంగారం నెరిపేవాళ్ళు డెభై రెండు శాతం వున్నారు. స్పెయిన్‌లోని స్కూళ్లు, కళాశాలలలో పూర్వమెన్నడూ లేనంత ఒత్తిడి వుందట. మాడ్రిడ్‌లో

# తల్లిదండ్రులున్న అనాథ...!



"అమ్మ తనకెంతో అందంగా కనుపిస్తుంది. నిర్దుష్టమైన అవయవ సౌష్టవం, సౌకుమార్యం ఆమె సొత్తు. వయసుతోపాటే ఆమె అందం కూడా పెరుగుతోంది. ఆమె తన శరీరపు బిగువును, పొంకాన్ని ఏమాత్రం సడల నివ్వలేదు...అలాంటి అమ్మ తననూ, నాన్ననీ వదలి మరో చోటుకు వెళ్ళిపోయింది....ఎక్కడికి..? ఎందుకని...??
తను అన్నీ ఉన్న అనాథలా ఎందుకయింది?

మానవ మనస్తత్వాల్ని, పసివాళ్ళపై పెద్దల ప్రవర్తనా ప్రభావాల్ని చిత్రించే సుప్రసిద్ధ రచయిత కమలేశ్వర్ కథానిక 'వెదుకులాట'ను 'విపుల' ఆగస్టు సంచికలో చదివి చూడండి. ఈ కథతో పాటు మరెన్నో ఇతర భాషల ఆణిముత్యాల్లాంటి కథల్ని అందజేస్తోంది 'విపుల'.

తెలుగు, తమిళం, హిందీ, బెంగాలీ, కన్నడ, ఒరియా, మరాఠీ, గుజరాతీ, కాశ్మీరీ, అస్సామీ ఆదిగా గల అనేక భాషల కథలకు వేదిక 'విపుల'. కథలుగాక అదనంగా ఎన్నో కార్టూన్లు, విచిత్ర విశ్వ విజ్ఞానం, నవ్వించే జోకులతో పసందైన విందు 'విపుల'.

*ప్రతినెలా 1వ తేదీకి వెలువడే విశ్వకథా విపంచి.*

**విపుల**

**132 పేజీలు వెల కేవలం 125 పైసలే!**

ఒక వైద్య కళాశాలలో శవాల కొరత వల్ల ఒక సంవత్సరంపాటు అసలు శవ పరీక్ష చేయలేదట. చట్టాలలో అనేక లొసుగు లుండటంతో నేరస్తులు, దొంగ వ్యాపారాలు పగ్గె రాలు చేసేవారికి స్పెయిన్ భూతల స్వర్గంలా తయారవు తోందట.

## పుర్రెకో బుద్ధి

"నేను సైతం జనం మెచ్చు ఘనకార్య మొకటి చేశాను" అని స్టీఫెన్స్ సిటీకి చెందిన రిటైర్డు సేల్స్‌మన్ టర్నర్ పొంగుకుంటున్నాడు. ఇంతకీ అతను చేసిన ఘనకార్యమేదయ్యా అంటే వాతావరణ సూచనలు తెలియజేసే పథకాన్నొకదాన్ని కనిపెట్టడం.

కొన్ని రాళ్ళకి రాళ్ళని బట్టి వాతావరణ సూచనలు ముద్రించబడ్డ కాగితాలను కట్టి వాటన్నిటినీ చెట్లకి వేలాడ



దీశాడు. రాయిని బట్టి దానికి కట్టి వున్న కాగితాన్ని చదివి ప్రజలు వాతావరణ వివరాలు తెలుసుకోవాలట.

రాయి పొడిగా ఉంటే వర్షం రాదని, తడిగా ఉంటే వర్షం పడుతుందని, రాయి నీడ కింద పడిన పక్షంలో సూర్యరశ్మి బాగా ఉందనీ, రాయి ఇటూ అటూ కదులుతూ ఉంటే గాలి వీస్తుందనీ, గెంతుతూ అల్లల్లాడుతుంటే భూకంపం వస్తుందని, రాయిపైని తెల్లగా ఉంటే మంచు కురుస్తుందనీ, రాయి చెట్టుకు వేలాడి ఉన్నప్పటికీ కనుపించకపోతే పొగమంచు అలుముకుందనీ, అసలు రాయే కనపడకుండా అదృశ్యమైపోతే తుఫాను వచ్చిందనీ అర్థంట.

సర్దాగా, స్నేహితుల కోసం సృష్టించిన ఈ వాతావరణ మాపకాల్ని అమ్మే ఉద్దేశం తనకి లేదని, వినోదం కలిగించడమే తన ముఖ్యోద్దేశమని టర్నర్ మహాశయుడు స్పష్టం చేసేడు.

## భూతల స్వర్గం

కాశ్మీర్ అనుకొని పొరబడేరు... కానీ అంతకన్నా అందమైన గొప్ప దేశం ఇది. అక్కడ దొంగల్లేరు, హంతకుల్లేరు, బ్రైకులూ, లాకౌట్లు అసలే లేవు. ఇది కలకాదు. నిజంగా నిజం.

'లిబియా' దేశం మన దేశంలో మూడో వంతుంటుంది. జనాభా ఇరవై లక్షలకు మించదు. ఇహ ధరవరలు చూస్తే మతిపోతుంది. లీటరు పెట్రోలు ధర అరవై పైసలు. డీసెల్ ఆయిల్ లీటరు ముప్ఫయిఐదు పైసలు. కరెంటు కూడా కారు చవక. వెతికినా ఒక్క యాచకుడు కూడా కనిపించడు.

వ్యవసాయ, విద్యారంగాల్ని ఇతోధి

శుభ్రమైన తాజా శ్వాస...
ఆరోగ్యంవిందే గట్టి పళ్ళు



**కోల్గేట్** డెంటల్ క్రీమ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంటే, కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క పాటిశీల వర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

**నోటి దుర్వాసనను ఆపండి...**
**కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో**
**దంతక్షయాన్ని**
**ఎదుర్కోండి!**







DC.G.74 TL

కంగా ప్రోత్సహిస్తోంది ఇక్కడి ప్రభుత్వం.

రైతులకి ఉచిత గృహ సదుపాయాల్ని కలిగించి ద్రాక్ష, నారింజ, ఆప్రికాట్ పళ్లని, గోధుమ వంటి ఆహార ధాన్యాల్ని ఉత్పత్తి చేయిస్తోంది. లిబియా దేశంలో చాలా భాగం ఎడారుల్లోకి వ్యాపించి వుంది. ఇక్కడ కన్యాశుల్కం అమల్లో వుంది. పెళ్ళికూతుర్ని ఆపాద మస్తకం నగల్తో అలంకరిస్తారు. పెళ్ళి ఖర్చంతా అబ్బాయి తరపువారే భరించాల్సుంటుంది. పాపం !! ఇక్కడి



ప్రజలంతా క్రమశిక్షణకు కట్టుబడ ఉంటారు. నిర్భయంగా అర్ధరాత్రి పూట నగల్తో అమ్మాయిలు ఒంటరిగా వీధుల్లో తిరగొచ్చు.

ఇళ్ళన్నీ జా తీ య ం చేయబడి ఉంటాయి. ఎవరికీ ఇల్లులేదన్న కొరత, చింత కనిపించవు. పోతే కొత్తలో విదేశీయులికి కాస ఇబ్బంది వుంటుందా విషయంలో. ఇవన్నీ వింటూంటే పరుగెత్తి లిబియా పారిపోవాలనిపిస్తోంది కదూ!



# తీరని కోరిక

రుమేనియాకి చెందిన 25 ఏళ్ళ ఏంజెల్ బుజెల్ ఎప్పటి నుంచో అమెరికాపోయి అక్కడ స్థిరపడిపోవాలని కలలు కనేవాడు.

కాని తన పేదిరికంతో అది సాధ్యమయ్యే పని కాదని గ్రహించాడు. ఒకవేళ ఎవరన్నా ధన సహాయంచేసినా పాస్‌పోర్టు ఇప్పించేంత పలుకుబడి గల వాళ్ళెవరూ లేరు అతని పరిచయస్తులలో. అందుకని పారిపోడానికి ఓ మంచి పథకం ఆలోచించాడు. ఓ చెక్కపెట్టి సంపాదించి తనకు తానే అందులో చేరి తలుపులు బిగించాడు. అలా 15 రోజులున్నాక నౌకాశ్రయంలోని ఓడపోర్టర్లు టెక్సాస్‌కి వెళుతున్న ఓడలో పడేశారా పెట్టెని. మార్గమధ్యంలో ఓడ ఇటలీలో ఆగింది. ఏంజెల్ వున్న పెట్టె లాగే వున్నాయి అన్ని పెట్టెలూ. కష్టమ్స



అధికారి వాటిని పరిశీలిస్తున్న సమయంలో పన్నెండు అడుగుల పొడవు నాలుగు అడుగుల వెడల్పు వున్న ఓ పెట్టెలోంచి వింతగా శబ్దంరావడం గమనించి, దాన్ని



## మీ చేతుల్లో ఒదిగిపోయే తారామణిహారం
## మీ కన్నుల్లో వెలుగులు చిమ్మే దివ్వెల తోరణం

- చలనచిత్ర పరిశ్రమలోని ప్రతి రంగం గురించీ సమగ్రమైన సమాచారాన్ని అందిస్తుంది 'సితార'
- ఆబాలగోపాలాన్ని తన అందచందాలతో ఆకర్షిస్తుంది 'సితార'
- రంగుల ముఖచిత్రాలతో, అభిమాన తారల వర్ణచిత్రాలతో, తాజాతాజా ఖబుర్లతో మిమ్మల్ని మురిపించే మరిపించే అంశాలతో, ఎన్నెన్నో విశేషాలతో వారం వారం వెలువడుతుంది 'సితార'

# సితార

సమగ్ర సినీవార పత్రిక

రూపాయి మాత్రమే

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాదు-500004

తెరిపించాడు. ఏంజెల్ తనని పట్టుకున్న వాళ్ళు పోలీసులనుకొని "చంపకండి, లొంగిపోతున్నానని" అరిచాడు. ప్రయాణంలో సరిపడ చాకొలేట్స్, మంచినీళ్ళు దగ్గిరుంచుకొన్నా తన ప్రయాణం అంత దీర్ఘ కాలం కొనసాగుతుందని ఊహించలేదని కస్టమ్స్ అధికారితో తన కథంతా చెప్పి మొరపెట్టుకున్నాడు. ఆ ప్రయాణంలో ఓడ శీతల ప్రాంతాల్లో ప్రయాణించినపుడు ఇంచుమించు ఏంజల్ గడ్డ కట్టుకుపోయాడు చలికి. ఇప్పుడతణ్ని ఇటలీలో శరణార్థిగా వుండనిస్తారా లేక అమెరికా పంపిస్తారా లేక రుమేనియాకే పంపిస్తారా అన్నది తేలలేదు ఇంకా.

## శవ భద్రత

శవాల భద్రత అనే సరికి మనకి ఈజిప్షియన్ మమ్మీలు గుర్తుకొస్తాయి. ప్రాణం పోయిన శరీరం కుళ్లిపోకుండా సంవత్సరాల తరబడి జాగ్రత్త చేయడం ఒకకళ.

ముక్కు లోంచిఒక కొక్కాన్ని లోపలికి దూర్చి మెదడులో వున్న పదార్థాన్నంతా వెలికి తీసారు. ఇంకా కొద్దో గొప్పో మిగిలి వుండే మందులు, రసాయనాల సాయంతో పూర్తిగా తొలిగిస్తారు. పొట్టను కొద్దిగా కోసి లోపలవున్న ప్రేవుల్ని తీసేసి, నిర్ణయించ బడిన నిల్వమందులతో శుభ్రపరుస్తారు. కాపుసారాలో కొన్ని రసాయనాలను కలిపి బాగా మరిగించి ఈ నిల్వ మందును తయారుచేస్తారు. పొట్టను కుట్టేసి దానిమీద తెల్ల రంగు పెయింట్ వేసి బాగా ఆరిన తర్వాత డెబ్బయ్ రోజుల పాటు తైలంలో నానబెట్టి, శుభ్రంగా కడిగి బట్టలు వేస్తారు. రవాణాలో పాడవకుండా గాలి చొరని పెట్టె లోపలిభాగానికి గ్లూ, 'గ్లూ'అనే జిగట పదార్థంపూసి అందులో భద్రపరుస్తారు. ఇది ఖరీదైన పద్ధతి.

ఇకపోతే రెండవ పద్ధతి ప్రకారం పురీష నాళంలో కొన్ని రసాయనాలు పోసి ఆ ద్వారం మూసి వేసారు. కొన్ని నిర్ణీత దినాల తర్వాత ఆ రసాయనాలను బైటికితీస్తారు. అప్పటికే మెదడు, ప్రేవులు అన్నీ ద్రవంగా మారి పోయి వుండడంవల్ల పురీష నాళంగుండా బైటికి వచ్చేస్తాయి- శరీరంలోని ఎముకలు మాత్రం చెక్కు-



చెదరవు. అంతే ! ఆ తర్వాత శవానికి దుస్తులు వేసి వారసులకి అప్పగించడమే!

సూక్ష్మంలో మోక్షం చూపించేది మూడవపద్ధతి. ఇందులో రసాయనాలనుపయోగించి ప్రేవుల్నిమాత్రమే తీసివేస్తారు. తర్వాత శరీరానికంతా 'నిల్వమందు పూతపూస్తారు. ఇది అంత చెప్పుకోదగిన పద్ధతి కాదు. తక్కువ ఖర్చుతో అందరికీ అందుబాటులో వున్న ఈ విధానం వల్ల శవం ఎక్కువ రోజులు నిలవ వుండదు.

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly Eenadu Compound, Hyderapad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004.

Regd. No. H/ HD /402

# తారలకు తార

"మామిడికాయ పచ్చడి అంటే ఇష్టం లేనిదెవరికి?
'ప్రియ' మామిడికాయ పచ్చడి అంటే
నాకు మరీ మరీ ఇష్టం." ... జయప్రద

ఇంట్లో చేసినంత జాగ్రత్తగా-స్వచ్ఛమైన
నూనె, మేలైనమసాలాలు తగుపాళ్ళలో మేళవించి
చేసిన 'ప్రియ' మామిడికాయ పచ్చడి రుచిని మీరెంతో
అభిమానిస్తారు.

మీరు కోరే పలురకాల్లో
•మామిడికాయ•నిమ్మకాయ•టొమాటో•అల్లం•గోంగూర.

**ప్రియ ఫుడ్స్** ప్రైవేట్ లిమిటెడ్
పోరంకి, కృష్ణాజిల్లా.



Marketed by
Margadarsi
Marketing PRIVATE LIMITED
Eenadu Compound, Somajiguda,
Hyderabad-500 004.
Tel : 223422

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

KIRON/PF/807